

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆర్థిక విజ్ఞానం

సేకరణ:

శ్రీ వి. వి. నరసింహారావు.

ఉపోద్ఘాతము:

ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య.

కవిరాజ పబ్లిషర్సు

తెనాలి :: సికింద్రాబాదు

**1957**

# ఉపోద్ఘాతము

ప్రపంచములోని దేశములను పురోగమించిన దేశములని, వెనుకబడి యుండు దేశములని రెండు రకములుగ విభాగము చేయుచున్నారు. ఈ విభాగమునకు ఆ యా దేశముల ఆర్థిక పరిస్థితులు ప్రధానాధారములు. పురోగమన మనగా ఆర్థికముగ నభివృద్ధిగాంచుట అనియు, వెనుకబడి యుండుట యనగా అట్టి యభివృద్ధిని గాంచకుండుట యనియు సాధారణాభిప్రాయముగ నున్నది. మత, వైజ్ఞానిక రంగములం దుచ్ఛస్థితిని గాంచిన దేశములు కొన్ని యున్నను, ఆర్థికవిషయములందలి వృద్ధి గాంచినవి కావన్న కారణమున వాటిని వెనుకబడియుండు దేశములుగ భావించుట జరుగుచున్నది. అభ్యుదయ, అనభ్యుదయములకు ఆర్థిక పరిస్థితులను కొలబద్దలుగ చేయుట యుక్తమా అన్న విషయమై అభిప్రాయభేదములు కొన్ని యున్నను మొత్తముమీద ప్రస్తుతకాలమున పురోగమనమునకు ఆర్థికసంపత్తియే ప్రధాన లక్షణమన్న సిద్ధాంతము ప్రాబల్యము గాంచియున్నది. అర్థశాస్త్రమునకును ఆర్థికవిజ్ఞానమునకును ప్రాధాన్యము కలుగుట కిదియే కారణము.

అమెరికా, బ్రిటన్, రష్యా మొదలగు పురోగమించిన దేశముల ఆర్థికసంపదలకు ప్రధానకారణము లనేకము లున్నవి. ప్రకృతిశాస్త్ర విజ్ఞానఫలితముగ నిర్మాణము గావింపబడిన యంత్రములను ఎక్కువగ వాడుట వీటిలో అగ్రస్థానము వహించి యున్నది. యంత్రములను వాడుచుండు దేశములు పురోగమించుచున్న వనియు, అవి వాడనట్టి దేశములు వెనుకబడియున్న వనియు చెప్పుట అతిశయోక్తి కాజాలదు. అందుచేతనే ఆధునిక యుగమునకు "యంత్రయుగ" మను పేరు వాడుకలోనికి వచ్చియున్నది. నూలు వడుకుటకును, బట్టల నేయుటకును,

రంగులు అద్దుటకును వాటిని వివిధప్రాంతములకు రవాణా చేయుట కును పురోగమించిన దేశములలో యంత్రములను వాడుచుండగా, వెనుక బడిన దేశములలో ప్రాచీనకాలపు రాట్నమును మగ్గమును అచ్చులను ఎద్దుబండ్లను వాడుచున్నారు. ఆర్థికసంపత్తి వాంఛనీయమని భావించు వారు ప్రకృతిశక్తులను వశపరచుకొనుటకు సాధనములైన యంత్రములను వాడుటకు సంసిద్ధులుగ నున్నప్పుడే వారి వాంఛ సఫలము కాగలదు. పురోగమించు దేశములవారి సత్యమును గ్రహించి దాని కనుగుణముగ వారి ఆర్థికజీవితమును మార్చుకొనుచున్నారు. వారి పురోగమనమున కిదియే మూలసూత్రము.

యంత్రములను బాహుళ్యముగ నుపయోగించు దేశములలో ఆర్థిక వ్యవస్థలు నూతనరూపముల ధరించి యున్నవి. వ్యవసాయము, పరిశ్రమలు, వర్తక వ్యాపారములు లక్షలకొద్దిగను కోట్లకొద్దిగను పెట్టుబడి పెట్టగలవారి యాజమాన్యమున జరుగుచున్నవి. వ్యవసాయదార్లు, కార్మికులు, బేరసారములు చేయువారు ఇతరుల యాజమాన్యమున నిర్వహింపబడు సంస్థలందు పనిచేయువా రగుచున్నారు. ఎవరిపొలములో వారు సొంతముగ వ్యవసాయము చేయుటగాని, ఎవరి ఇంట వారు వారి సొంత పరిశ్రమను నిర్వహించుటగాని, అదృశ్యమగుచున్నది. దీనితో పాటు అప్పు లిచ్చు బ్యాంకీలు అత్యవసరము లగుచున్నవి. చెలామణి ద్రవ్యముయొక్క ప్రభావ మత్యధిక మగుచున్నది. పురోగమించిన దేశముల ఆర్థిక విధానమునకును వెనుకబడినవాటి ఆర్థిక విధానమునకును ఎంతో భేదము కనుపించుచున్నది.

దీనిమూలమున క్రొత్త ఆర్థికసమస్య లనేకము లుత్పన్నమగుట తప్పదయ్యెను. ధనధాన్యము లతిస్వల్పములుగ నుత్పత్తియగుచుండిన కాలములో కొందరు ధనికులుగను, తక్కినవారు దరిద్రులుగను ఉండుట తప్పనిసరి యను భావము వ్యాపించియుండెను. కాని యంత్రసహాయమున

సమస్త పదార్థముల నపరిమితముగ నుత్పత్తిచేయుట సాధ్యమైన తర్వాత కూడ మానవులలో తరతమ భేదము లుండుట ధర్మముకాదన్న అభిప్రాయము వ్యాపించెను. ప్రపంచమందు దారిద్ర్యమనునది ఉండవలసిన ఆవశ్యకత లేదన్న వాదము ప్రాబల్యము గాంచెను. ఉత్పత్తియగు సిరిసంపదలను దేశములోని వివిధ వర్గములవారు సమానముగ ననుభవించుటయే న్యాయమన్న సిద్ధాంతము సమర్థనీయ మయ్యెను. కాని, వీనితో పాటు "న్యాయమైన పంపక"మనగా ఎట్టిది? ఉన్నదానిని సరిసమానముగ అందరు పంచుకొనుట న్యాయమా? లేక వారి వారి అవసరముల బట్టి పంచుకొనవలెనా? లేక వారు వారు చేయు కష్టమునకు తగినట్లు పంచుకొనవలెనా? కష్ట మనగా కాయకష్టము మాత్రమేనా లేక మనస్సు బుద్ధి మొదలైనవాటి కష్టముకూడ గుర్తించతగియున్నదా? వీటిని గురించి అభిప్రాయభేదము లేర్పడినపుడు వాటిని సమన్వయపరచగల అధికార మెవరికి ఉండవలెను? కార్మికసంఘములద్వారా వీటిని పరిష్కరించుకొనుట వాంఛనీయమా లేక ఇట్టి అధికారము ప్రభుత్వమునకు మాత్రమే ఉండవలెనా? అన్న ప్రశ్న లనేకములు యంత్రయుగమున బయలుదేరెను.

అందరు అంగీకరించు సమాధానము లీ ప్రశ్నలకింకను లభించలేదు. "కేపిటలిజం", "సోషలిజం", "ఫాసిజం", "కమ్యూనిజం" అనునవి ఈ సమాధానములలో కొన్ని. ఈ తత్వము లొక్కొకదానియందు కొన్ని గుణములతోపాటు కొన్ని దోషములుకూడ కనుపించుచున్నవి. ఏదికూడ నిర్దుష్టమైన సిద్ధాంత మని చెప్పుటకు వీలులేదు. బహుశః అట్టి సిద్ధాంతమును కల్పింపగల శక్తి మానవమాత్రునికి లేదేమో! కాని ఆర్థికముగ పురోగమించదలచిన దేశములలోనివారు ఇట్టి సమస్యలను ఎదుర్కొనవలసిన స్థితిలో నున్నారని తెలుసుకొనుట అవసరము. కొందరికి మార్క్సు చెప్పినది వేదము; కొందరికి మహాత్మాగాంధి చెప్పినది వేదము.

ప్రస్తుతకాలపు ఆర్థికజీవితము ఇన్ని సమస్యలతో కూడుకొనియున్నది. దీనిని గురించిన విజ్ఞానము సామాన్యప్రజ లందరికి అత్యవసరము.

శ్రీ వి. వి. నరసింహారావుగారు ఇట్టి విజ్ఞానమును అందజేయుటకై ఈ గ్రంథమును వ్రాసిరి. ఇది కడు సులభశైలిలో వ్రాయబడిన గ్రంథము. ఈకాలమున ఆర్థికజీవితమునకు గల ప్రధాన లక్షణములు, వీనిని గురించి బయలుదేరిన వివిధ తత్వములు వాదోపవాదములు ఇందు వివరింపబడియున్నవి. వీరు వ్యక్తపరచిన అభిప్రాయములు అందరికి అంగీకారములు కాకపోవచ్చును. కాని అట్టి అంగీకారమును కుదుర్చు ఉద్దేశముతో ఇది వ్రాయబడలేదు. ఆర్థికరంగముయొక్క స్వరూప మెట్టిదో, అందు ఉత్పన్నములగు సమస్య లేలాటివో, వాటిని పరిష్కరించుటయందు గుర్తించదగిన సంగతి సందర్భము లేలాటివో, తెలుసుకొనుటయం దీ గ్రంథము మిక్కిలి సహాయకారి కాగలదు. ఇట్టి గ్రంథమును వ్రాసిన శ్రీ నరసింహారావుగారు ఆంధ్రు లందరి ప్రశంసకు పాత్రులగుచున్నారు. ఇందలి విషయము లనేకములు సూత్రప్రాయములుగ పేర్కొనబడి యున్నవి. వీటిని మరింత విపులముగ వివరించు గ్రంథ మింకొకదానిని అనతికాలముననే వీరు రచించెదరని ఆశించుచున్నాను.

మద్రాసు
14—1—57

మామిడిపూడి వెంకట రంగయ్య.

# ఒక మాట

విజ్ఞానశాస్త్ర విషయాలు సామాన్య పాఠకునికి సులభగ్రాహ్యమయ్యేట్టు చేయగలమా ?

విద్యాబోధన మాతృభాషలో జరగాలనే ప్రచారానికి తోడుగా, అందుకు కావలసిన పుస్తకాలను, అందులోను విజ్ఞానశాస్త్రాలకు సంబంధించిన వానిని, విద్యాబోధనకు అనువగు పద్ధతిలో సులభశైలిని వ్రాసి, ప్రచారంలో పెట్టలేమా ?

విజ్ఞానశాస్త్ర గ్రంథాలు, సుబోధకమైన పద్ధతులలో, పాఠకులకు తగిన శైలిలో, రకరకాలుగా వస్తున్నప్పుడు, నిత్యజీవితానికి సంబంధించిన ఆర్థికవిజ్ఞానాన్నికూడా ఆ పద్ధతులలో ఆంధ్రదేశానికి అందజేయలేమా ?

ఈ విధమైన ఆలోచనలతో ఆర్థికవిజ్ఞానానికి సంబంధించిన వ్యాసాలు కొన్ని వ్రాశాను. అవి "ధన కనక వస్తు వాహనాలు" అనే శీర్షికకింద "ఆంధ్రప్రభ" దినపత్రికలో వరుసగా ప్రచురింపబడినవి. వానికొక పుస్తకరూపం కల్పించిన అవకాశం యిప్పటికి లభించింది.

దినపత్రికను చదువుకొనే సామాన్యపాఠకుని మనస్సులో వుంచుకొని, తడవకొక విషయం చొప్పున, పాఠాలు చెప్పే పద్ధతిని ఆర్థికసూత్రాలను ఈ వ్యాసాలలో వివరించాను. ఆర్థికశాస్త్రాన్ని ఏకపక్షవాదంగా చెప్పక, ఎక్కడికక్కడ, సహేతుకమైన, విరివిగా ప్రచారంలో వున్న విమర్శలను కూడా ఆ యా సందర్భాలలో ఉదాహరించాను. ఇవన్నీ చేర్చి (1) ఆర్థిక విజ్ఞానం (ఎకనామిక్స్) (2) ఆర్థికాభ్యుదయం (పబ్లిక్ ఫైనాన్స్) (3) ఆర్థిక వ్యవస్థలు (ఎకనామిక్ సిస్టమ్స్) అనే మూడు ప్రధాన విభాగాలు చేసి, మొత్తం 32 శీర్షికలకింద వర్గీకరించాను.

ఆనాటి వ్యాసాలను నేటికి అనువగు కొన్ని మార్పులతో, ఈ "ఆర్థిక విజ్ఞానం" లో చేర్చాను.

పాఠకులు వీనిని వారం వారం అప్పుడు చదువుకున్నారు. వా టన్నింటిని యిప్పుడు వరసగా చదవనున్నారు. అలా వారు "ఈ ఆర్థిక విజ్ఞా"నాన్ని చదవగలిగినప్పుడు; విషయాలు సుబోధకంగా కలవనే భావం వారిలో కలిగినప్పుడు, నా కృషి ఫలించినట్టుగా భావిస్తాను.

ఈ కృషికి ముందుగా అవకాశమిచ్చి ఆదరభావంతో ప్రోత్స హించిన ఆంధ్రప్రభ ఎడిటర్ శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారికి—

ఆ కృషి ఫలితంగా వచ్చిన ఈ పుస్తకానికి, శిష్యవాత్సల్యంతో ఆశీర్వదిస్తూ ఉపోద్ఘాతం వ్రాసిన ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య గారికి— నా హృదయపూర్వకమైన ధన్యవాదాలు.

ఈ పుస్తక ప్రచురణలో సహాయపడిన మిత్రులు—ఆంధ్రప్రభ సబ్-ఎడిటర్ శ్రీ తిరుమల రామచంద్ర; తెలుగు స్వతంత్ర ఎడిటర్ శ్రీ గో. రా. శాస్త్రి; కవిరాజ పబ్లిషర్సు అధిపతి శ్రీ మాధవయ్య గార్లకు నా కృతజ్ఞత.

40, పైక్రాఫ్ట్సు ఫస్టుస్ట్రీటు,<br>రాయపేట, మద్రాసు.

—వి. వి. యస్.

# విషయ సూచిక

## మొదటి భాగము

## 1. ఆర్థిక విజ్ఞానం

# 2. ఆర్థికాభ్యుదయం

## (ఉ) ప్రభుత్వం - పన్నులు



## (ఊ) ప్రజలు - ప్రణాళికలు



## రెండవ భాగము

# 3. ఆర్థిక వ్యవస్థలు

# 1. జీవిత సమస్యలు

ప్రతి ఒక్కరూ తగిన వయస్సు వచ్చిన తరువాత ఏదో ఒక ఉద్యోగం లేదా పనికోసం ప్రాకులాడతారు. మన స్నేహితులలో అనేకమంది ఫ్యాక్టరీలలో పనిచేస్తారు. వ్యవసాయం చేస్తారు. ఉద్యోగాలు చేస్తూ వుంటారు. వీరందరి లక్ష్యం ఒక్కటే — జీవనోపాధికోసం కృషిచేయడం.

ఈ లక్ష్యసాధన చెప్పుకొనేటంత సులభమైనది కాదు. తమ వయస్సులో కుటుంబపోషణ ఎంత కష్టమైనదో, తాము ఎన్నెన్ని కష్టాలు పడ్డారో మన తల్లిదండ్రులు చెబుతూ వుంటారు. కాలం బాగా వున్నా సుఖంగా బ్రతకడానికి తగినంత ధనసంపాదన ఎంతకష్టమో వారిద్వారా మనకు తెలుస్తుంది. ఏదోవిధంగా "పనిని" పోగొట్టుకొనకుండా వుండటమే లక్ష్యమని ప్రతి ఒక్కరూ చెబుతారు. కనకనే ప్రతి ఒక్కరినీ ఎదుర్కొనే సమస్య - బ్రతుకు తెరువును సాధించడం ఎలాగ అన్నదే.

ఆర్థిక శాస్త్రం అంటే ఏమిటి అని మనను ఎవరైనా ప్రశ్నిస్తే - మనం సులభంగా ఇలా సమాధానం చెప్పవచ్చు- "ప్రజలు తమ బ్రతుకు తెరువుకోసం చేసే ప్రయత్నాలను వివరించే శాస్త్రమే ఆర్థిక శాస్త్రం." దీనినే పూర్వం మరొక అర్థంలో కుటుంబనిర్వహణశాస్త్రం అనేవారు కూడా.

మన పూర్వులంతా ఇంటివద్దనే వుండి పనిచేస్తూ పొట్ట పోసుకునేవారు. అవి పనులన్నీ చేతులతోనే చేసే రోజులు. అంటే కండపుష్టి కలవారి రోజులన్నమాట.

ఈనాడు యంత్రాలకు ప్రాధాన్యం వచ్చింది. ఎవరికి వారు తమ ఇంటివద్ద "తోచినపని చేసుకోనడం" కాక "పది మందితో కలిసిమెలిసి ఇతరులు చెప్పిన పని" చేయవలసిన రోజు లివి. అందువల్ల ఆర్థిక శాస్త్రం అంటే కుటుంబ నిర్వహణశాస్త్రం అని యిప్పుడు చెప్పడానికి వీలులేదు. జీవనోపాధికి సంబంధించిన ప్రతివిషయం ఈనాడు ఆర్థిక శాస్త్రంలో చేరిపోయింది.

ఉదయాన పిల్లలు స్కూలుకు వచ్చేటప్పటికి తరగతి బల్లలు, కుర్చీలు, స్కూలు ఆవరణ శుభ్రంగా తుడిచి వుంటవి. ఉపాధ్యాయులు మనకు పాఠాలు చెబుతారు. అంటే ప్రతిరోజూ దైనందిన వ్యవహారాలలో ఎవరో ఒకరి మీద లేక కొందరిమీద మనం ఆధారపడి వుంటున్నాం అన్నమాట. ఏ ఒక్కరు లోటుచేసినా మనం అనుకున్నట్టు పనులు జరగవు.

అందువల్లనే ఆర్థిక శాస్త్రాన్ని సాంఘిక శాస్త్రం కింద జమకట్టారు పెద్దలు. అంటే పదిమందికీ కల సంబంధాలు, పదిమందిలో వుండే సంబంధ బాంధవ్యాల తరహాలకు ఆర్థిక శాస్త్రం అర్థం చెబుతుందన్నమాట. మనం ఒకరిమీద ఆధారపడి ఒకరం బ్రతుకుతున్నామని మనకు తెలుసు. జీవనోపాధికి కృషి చేయడంలో ఇతరుల సహకారం, సహచర్యం లేకుండా బ్రతకడం చాలా కష్టం.

ఇలా మానవులు ఒకరిమీద ఒకరు ఆధారపడక తప్పని పరిస్థితులు ఏర్పడడంతో వ్యక్తుల సంబంధబాంధవ్యాలకు సంబంధించిన విషయాలపై అనేక శాస్త్రపరిశోధనలు జరిగినవి.

బస్తీలు, పట్టణాలు, రాష్ట్రాలు, పరిపాలనా వ్యవహారాలు మొదలగువాటికి సంబంధించిన శాస్త్రాన్ని "సివిక్స్" అన్నారు.

వ్యక్తుల నడతకు సంబంధించిన నైతిక విషయాల శాస్త్రాన్ని "నీతిశాస్త్రం" అన్నారు.

పూర్వకాలపు పరిణామాలు, వాటికి కారణాల వివరాలను చెప్పే శాస్త్రం "చరిత్ర" అన్నారు.

వ్యక్తుల వివాదాలతో కోర్టుల తీర్పులు, వాటి విచారణల శాస్త్రాన్ని "న్యాయశాస్త్రం" అన్నారు.

సంఘం వివిధ దశలలోని అభివృద్ధికి సంబంధించిన విషయాలను "సాంఘిక శాస్త్రం" అన్నారు.

మానవుని ఆలోచనలు, వాటి పుట్టుక పరిణామాల శాస్త్రాన్ని "మానసిక శాస్త్రం" అన్నారు.

మానవ జీవనోపాధికి సంబంధించిన ప్రయత్నాలను "ఆర్థిక శాస్త్రం" అన్నారు.

ఆర్థిక శాస్త్రం సంఘంలో కొందరు కలిసి చేస్తున్న సమష్టి కృషిని, వ్యక్తిగతంగా ప్రతి ఒక్కరూ కొనసాగించే కృషిని వివరిస్తుంది. కనుక దానిని సాంఘిక శాస్త్రాలలో ఒకటిగా చేర్చారు. అయితే పైన చెప్పిన శాస్త్రాలన్నీ— కొంతవరకు ఆర్థిక శాస్త్రంలో చేరివున్నవి. ఉదాహరణకు అసలు మనుష్యులు పని ఎందుకు చేస్తారు ? నేటి ఆర్థిక పరిస్థితుల పూర్వచరిత్ర ఏమిటి ? అనేది తెలుసుకొనడానికి పైన వివరించిన శాస్త్రాలన్నీ సహాయకారి కావలసివుంటుంది.

ఇవన్నీ మనకెందుకు ? మన బ్రతుకు మనం బ్రతకలేమా ? అనేవారున్నారు. ఇది అమాయకత్వం అనుకున్నా ఈ రోజుల్లో దీనివల్ల విపరీతంగా నష్టపోవలసివస్తుంది. సాంఘిక సూత్రాలను, వ్యాపార సంబంధాలను తెలుసుకోనకుండా బ్రతకడం కష్టం. కనక ఆర్థిక విషయాలను తెలుసుకోనడం ద్వారా జీవనోపాధికి సంబంధించిన పరమ రహస్యాలు కొన్నింటిని మనం అవగాహనం చేసుకోనవచ్చు. దానివల్ల మన జీవితవిధానాలను చాలవరకు మార్చుకోనడానికి కూడా వీలు కలుగుతుంది.

ఆర్థిక శాస్త్రాన్ని నాలుగు భాగాలక్రింద విభజించారు. (1) వాడకం; (2) ఉత్పత్తి; (3) మారకం; (4) పంపిణీ అని వీటికి పేర్లు పెట్టారు. (5) ప్రభుత్వం— పన్నులు; (6) ఆర్థిక వ్యవస్థలో మార్పులు అనే ఉపభాగాలను కూడా వీటితో జతపరిచారు.

వీటిని గురించి సూక్ష్మంగా ముందు కొన్ని విషయాలు తెలుసుకుందాం.

ఆర్థిక శాస్త్రంలో "వాడకం" అనేదానిని సరుకుల వాడకం, వస్తువుల వినియోగం అనే అర్థంలో వాడతారు. దీనితో అనుభవించడాన్ని కూడా ముడిపెట్టారు. అందుకే మనవారు అంటారు: "ఎంతవున్నా అనుభవించే అదృష్టం వుండవద్దా" అని.

ఉదాహరణకు — బట్టలవాడకం, ఆహార పదార్థాల వినియోగం. వస్తువాహనాల ఉపయోగం వగైరా.

ఎవరూ ఏ సరుకులు వాడనప్పుడు అసలు వాటిని తయారు చేయడానికి ఎవరూ ప్రయత్నించవలసిన అవసరం వుండదు. కనుక "వాడకం" మీద ఆధారపడినదే "ఉత్పత్తి."

"ఉత్పత్తి" అంటే మన కోర్కెలను తీర్చగలిగిన వస్తువుల సృష్టి. అంటే వస్తువులను లేదా సరుకులను తయారు చేయడం అన్నమాట. రైతులు, కూలీలు, ఫ్యాక్టరీలు ఇవన్నీ ఉత్పత్తిదారు లన్నమాట. వస్తువులను ఉత్పత్తి చేయడం ఎంత అవసరమో వాటి వాడకం కూడా అంతే అవసరం. సరుకుల ఉత్పత్తి లేనిదే వాడకం జరగదు. వాడకం హెచ్చుగా లేనిదే ఉత్పత్తి అవసరం ఏర్పడదు. ప్రజలు తక్కువ సరుకులను వాడుతూవుంటే – సరుకులు కూడా పరిమితంగానే ఉత్పత్తి కాగలవు.

అనేకమందికి కావలసిన అనేక సరుకులను అనేకమంది ఉత్పత్తి చేస్తూ వుంటారు. అయితేఒకరికి కావలసిన సరుకులను మరొకరి వద్దనుంచి "యిచ్చి — పుచ్చు" కోవడాన్ని "మారకం" అంటారు. అంటే అమ్మడం, కొనడం అన్నమాట. దీనిక్రిందనే డబ్బు, బ్యాంకీలు, వర్తకం, వాణిజ్యం వగైరాలు చేరతవి.

మారకంద్వారా ప్రజలు తమ ధనాన్ని, సరుకులను ఒకరికి ఒకరు ఎలా "ట్రాన్స్ఫర్" చేసుకుంటారనేదే కాక కొన్ని సరుకుల ధరలు ఎప్పటికప్పుడు ఎందుకు మారుతూ వుండేది, కొన్ని వస్తువుల ధరలు సంవత్సరాలతరబడి అలాగే

ఎలా వుండిపోయేదికూడా మనం తెలుసుకోనవచ్చు. సరుకుల మారకంలో ధరల పలుకుబడి చాలా జాస్తిగా వుంటుంది.

ఎవరి సరుకులు వారివద్ద వుంటే ఫలితం వుండదు కనక అవి అందరికీ అందుబాటు కావాలి. ఉత్పత్తి చేయబడిన సరుకులలో ఎవరికి ఎంతభాగం ముడుతున్నదీ చెబుతుంది "పంపిణీ".

తినడానికి తిండి, కట్టుకొనడానికి బట్టలు, లేదా లాభాల రూపంలో డబ్బు మనకు రావచ్చు. ఉదాహరణకు మనం ఒక ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాం అనుకుందాం. ఇందులో మనకు వచ్చేది "కూలి".

మనకు కొంత భూమి, లేదా ఒక యిల్లు వుందనుకుందాం. దానిమీాద మనకు వచ్చేది "కౌలు" లేక "అద్దె".

మనకు ఒక వ్యాపారం వుంటే—దానిమీాద వచ్చేది "లాభం."

మనం ఒకరికి అప్పు పెడితే మనకు ముట్టే ప్రతిఫలం "వడ్డీ". ఆర్థికశాస్త్రంలో ఈ భాగానికి సంబంధించిన విషయాలను "పంపిణీ" ఏర్పాట్లు అంటారు.

ఇంక చివరి రెండు భాగాలలో ఒకటి ప్రభుత్వం — పన్నులు — అంటే ప్రభుత్వం మనవద్ద పన్నులు ఎలా వసూలు చేస్తుంది. మన జీవనోపాధికి సాగించే కృషిని ఎలా క్రమబద్ధం చేస్తుంది చెబుతుంది. రెండవది ఆర్థికవ్యవస్థ మారవలసిన అవసరాలు, ఈనాడు ప్రచారంలో వున్న నూతన ఆర్థికవ్యవస్థలు ఏమిటి? అనే విభాగానికి సంబంధించి వుంటుంది.

కనక ఆర్థికశాస్త్ర భాగాలను ఈ క్రింది విధంగా సంగ్రహపరచవచ్చు :

వాడకం — సరుకుల వాడకం
ఉత్పత్తి — సరుకుల తయారీ
మారకం — సరుకుల ట్రాన్స్‌ఫర్
పంపిణీ — మొత్తం సరుకుల విభజన

# 2. సరుకులు - వాటి వాడకం

సరుకు అంటే ఏమిటి? ఆర్థికశాస్త్రానికి సంబంధించి నంతవరకు మన కోర్కెలను తీర్చగలిగే ప్రతిదాన్నీ "సరుకు" క్రిందనే జమకడతారు. దానిలో కూడా అనేక రకా లున్నవి.

ఒక రకం సరుకులను "సహజమైనవి" అన్నారు. అంటే ప్రకృతిసిద్ధమైన వన్నమాట. మనం ఖరీదు చెల్లించ వలసిన అవసరం లేకుండా కొల్లలుగా మనకు ప్రకృతిలో లభ్యమయ్యే వేడి, వెలుతురు, గాలి మొదలగునవి. వీటిని సిద్ధింప జేసుకొనడానికి కష్టపడవలసిన అవసరం ఉండదు.

అయితే, జలం విషయం వేరు. గ్రామాలలో అయితే బావులనుంచి తెచ్చుకుంటాం. వేసవికాలంలో నూతినీరు కొందరికి మాత్రమే సరిపోతుంది. బస్తీలలో అయితే పురపాలకసంఘం నీరు సప్లయి చేస్తుంది. దానికి పన్ను కట్టాలి. దానిని "కొనవలసిన సరుకు" అన్నారు. అంటే

వాటికి మానవ కృషి అవసరం. పరిమితంగా మాత్రమే అందుబాటులో వుంటవి. ఇలా కొనేసరుకులు ఉపయోగకర మైనవిగాను వుండాలి. ఎక్కువ మందికి అందుబాటులో లేనివిగా కూడా వుండాలి. ఉదాహరణకు కుర్చీలు, బల్లలు, కలాలు వగైరా.

కనుక సరుకులు అనేవాటిని ఆర్థికశాస్త్రంలో రెండు రకాలుగా పరిగణిస్తారు.

ఒకటి — "సహజమైన సరుకులు." అంటే ప్రకృతి ద్వారా అపారంగా మనకు సిద్ధించేవి. డబ్బు చెల్లించవలసిన అవసరం లేనివి.

రెండు — "కొనవలసిన సరుకులు." అంటే మానవ ప్రయత్నంతో ఉత్పత్తి అయి కొంతవరకు మాత్రమే సప్లయి కాగలవి. డబ్బు చెల్లించి కొనవలసిన అవసరం వున్నవి.

మరొక రకమైన విభజన కూడా వుంది.

ప్రతి దుకాణదారు నెలకొక దఫా తన దుకాణంలో సరుకులను నిల్వ తీస్తాడు. ఆనాటికి "చేతిలో వున్న సరుకుల" పట్టీ తయారు చేస్తాడు. వీటిని ఎవరైనా వెంటనే కొనుక్కొని వాడుకొనవచ్చు. మనం తొడిగే చెప్పులు, మనం కట్టుకునే బట్టలు వగైరాలు "చేతిలోవున్న సరుకులు" అంటారు.

కాని కొంతమంది నెలరోజులనాటికి ఫలానా సరుకు కావాలని ఆర్డరు యివ్వడం కద్దు. కొంత డబ్బుకూడా చెల్లిస్తారు. సరుకు సప్లయి మాత్రం కొన్ని రోజులకు కాని

జరగదు. ఇలాంటి వాటిని భవిష్యత్తులో సప్లయిచేసే సరుకులు అంటాడు.

రేపో మాపో వాడుకోనడానికిగాను ఈ రోజునే కొన్ని సరుకులు కొనేవా రున్నారు. ఉదాహరణకు 50 మామిడి పండ్లు కొన్నామని అనుకుందాం. రేపటికి వానిలో కొన్ని డాగుపడవచ్చు. వాడుకొనేనాటికి కొన్ని కుళ్ళిపో వచ్చు. ఇలాంటివాటిని వెంటనే చెడిపోయే సరుకులు అన్నారు. నాసిరకం సరుకులను, ఎక్కువకాలం నిల్వ లేని సరుకులను వీటిక్రింద జమకడతారు.

ఇంక మనం ఏ ఖర్జూరకాయలో, కొబ్బరికాయలో కొన్నాం. అవి చాలాకాలం నిల్వలో వుంటవి. ఎప్పటికైనా అవి మనకు ఉపయోగపడతవి. అంతేకాదు, కుర్చీ, బల్ల మొదలగువాటిని ప్రతిరోజూ చాలాకాలం వాడుకొనవచ్చు కూడా. ఇలాంటివాటిని మన్నికగల సరుకులు అంటారు.

మనకు కావలసిన అనేక వస్తువులను ప్రతిరోజూ మనం కొంటూవుంటాము. వాడుకునే వ్యక్తి కోర్కెలు, అవసరా లకు తగినట్టుగా ఉపయోగించే సరుకులను మొత్తంమీద కొనుగోలు సరుకులు అంటారు. వ్యక్తి అవసరాలను తీర్చడా నికి ఉపయోగించేవానిని మాత్రమే ఈ పేరుతో పిలుస్తారు. ఉదాహరణకు : చెప్పులు, చొక్కాలు.

ఇంక ఒక వస్తువును తయారుచేయడానికి కావలసిన సరుకులను ఉత్పత్తికి కావలసిన సరుకులు అంటారు. ఒక కుర్చీ తయారుచేయడానికి కొయ్య చెక్కలు, మేకులు, వార్నీసు

వగైరాలు కావాలికదా! వీటినే ఉత్పత్తి సరుకులు అంటారు. కుర్చీ తయారు అయినతరువాత కొనుగోలు సరుకు అంటారు. అంటే కొనుగోలు సరుకులను తయారుచేయడానికి కావలసినవి ఉత్పత్తి సరుకు లన్నమాట.

మనం రోజూ చూస్తూవుండే సరుకులు ఆర్థిక శాస్త్రంలో ఇన్ని భాగాలుగా వాటి లక్షణాలనుబట్టి విభజించారు. ఇన్నిరకాల సరుకులలోనూ మనకు అవసరం లేకపోయినా, ధర తక్కువగా వుందని కొనడం జరుగుతుందా? మనం అప్పుడప్పుడూ మాత్రమే ఉపయోగించే సరుకులు అనేకం మన ఇంటిలో వుంటవికదూ! ఉపయోగించలేని సరుకులు అనేకం ప్రతిఒక్కరికి వుంటవి.

ఉపయోగం అంటే ఏమిటి?

మన అవసరాన్ని తీర్చడమే ఉపయోగం. అవసరాన్ని తీర్చగల శక్తి కలదానినే ఉపయోగకరమైన వస్తువు అంటాము. సైకిలు దానిని తొక్కడం చేతనైనవారికే ఉపయోగిస్తుంది. సైకిలు ఎక్కలేనివారికి అది వున్నా నిరుపయోగమే కదా?

వస్తువుల ఉపయోగాలలో కూడా అనేకరకా లున్నవి.

బంగారం, వెండి, బొగ్గు, ఉప్పు ఇవి యధాతథంగా మనకు ఉపయోగపడతవి. వీటిని సహజోపయోగకరవస్తువులు అంటారు.

చర్మాన్ని చెప్పులుగా కుడతారు. దూదితో బట్టలు తయారుచేస్తారు. కొయ్యతో ఇంటిని కడతారు. అంటే "ఆ రూపంలో" అవి అలా ఉపయోగిస్తవి.

కొన్ని సరుకుల ఉపయోగం ఇతర ప్రాంతాలలో హెచ్చుగా వుంటుంది. కొన్ని సరుకులు కొన్ని కాలాల లోనే ఎక్కువగా ఉపకరిస్తవి. కనక సరుకుల ఉపయోగం అనేది "స్థలాన్ని" బట్టి "కాలాన్ని" బట్టి మారుతూ వుంటుంది.

మనదగ్గర చెడిపోయిన గడియారం ఒకటి వుంది. అది మనకు ఉపయోగపడదు. కాని గడియారాలు బాగు చేసేవారికి దానిని అమ్మివేశాం. దానిని అతడు బాగు చేశాడు. అది అతనికి ఉపయోగిస్తుంది. కనక "యజ మానిని" బట్టి కూడా సరుకు ఉపయోగం మారుతూ వుంటుంది.

డాక్టర్లు మనకు మందులు యిస్తారు. ఫ్యాక్టరీలలో నిపుణులైన ఉద్యోగులు పనిచేస్తూవుంటారు. వీరికి హెచ్చు జీతాలు యిస్తారు. ఎందుచేత ? సర్వీసునుబట్టికూడా "ఉప యోగానికి" విలువ హెచ్చుతుందన్నమాట.

వస్తువుల ఉపయోగంలోకూడా ఇన్ని "తరహాలు"న్న వనేది ఆర్థికశాస్త్రంలో ఒక ముఖ్యవిషయం.

అతడు చాలా ఆస్తిపరుడు. ఇతడు పెద్ద ధనవంతుడు. ఆయన మహాపలుకుబడి కలవాడు అంటూ వుంటారు. ఇందులో "ఆస్తి—ధనం" అంటే అర్థం ఏమిటి ?

ఆర్థికశాస్త్రంలో ఇదీ ప్రధాన విషయమే. వ్యాపార దృష్టితో చూస్తే—అనేక సరుకులను కొనగలిగినవాడు ధనవంతుడు అని అర్థం. లౌకిక దృష్టితో చూస్తే—చదువు

కున్నవాడు, గౌరవం కలవాడు, డబ్బు కలవాడు, పలుకు బడి కలవాడు అంటారు. ఇంక ఆస్తి అనేదానికి అర్థాలు వేరు. ప్రయివేటు ఆస్తి – పబ్లిక్ ఆస్తి – స్వంతఆస్తి (భూమి) – కుటుంబం ఆస్తి (ఎస్టేటు) అనే రకాలుకూడా వున్నవి.

ఆర్థికశాస్త్రం ఇన్ని విషయాలను గురించి చెబుతుంది కనకనే సాంఘికశాస్త్రంలో ఒకభాగంగా దానిని ఉదహరించారు. సంఘంలోని వ్యక్తుల, సమూహాల నైజాన్ని (ఆర్థికరంగంలో) వివరించడమే ఆర్థికశాస్త్ర లక్ష్య మన్నారు.

## 3. జీవనవ్యయం

మనం మార్కెట్‌కు వెడితే ప్రతి వ్యాపారస్తుడు తన సరుకుల మంచి చెడ్డలను గురించి చెప్పడం కద్దు. పత్రికలలో ప్రతిరోజూ అనేక రకాల అడ్వర్‌టైజ్‌మెంటులు కూడా వుంటాయి. సరుకులు అమ్మదలచిన ప్రతివ్యాపారి, వ్యాపార సంస్థకూడా తన సరుకు నాణ్యాన్ని గురించి ప్రచారం చేస్తూ వుంటుంది. ఈ ప్రచారాన్ని బట్టి కూడా మనం కొన్ని సరుకులను ఆ యా దుకాణాలలో కొనవచ్చు.

ఎందరు ఎంత ప్రచారం చేసినా, మనకు వాని ఉపయోగాన్ని (ఆర్థికశాస్త్రంలో – అనుభవించడం. వాడు కొనడం అనే అర్థం చెబుతారు.) ఆ సరుకు కొనేవారు – (వారినే కొనుగోలుదారులు అంటారు) – తమ సరుకుల ద్వారా కోర్కెలను, అవసరాలను పూర్తిగా తీర్చుకొనగలరని నచ్చచెప్పడమే వ్యాపారసంస్థల ప్రధాన లక్ష్యం.

మనలో చాలామంది తమకు కావలసిన వానిలో కొన్ని అయినా కొనకుండా వుండలేరు. ఆటల వస్తువులు అమ్మే దుకాణంలో ఒక పిల్లవానిని నిలబెట్టండి. తాను చూచిన ప్రతిది తన తల్లిదండ్రులు కొనితీరాలని మారాం చేస్తాడు. ప్రతి వస్తువు అతని కంటికి ఆకర్షణీయంగా వుంటుంది. ఆ ఆకర్షణనుంచి అతడు తప్పించుకొనలేడు. పెద్దవారిలోకూడా ఇంతే జరుగుతుంది. తమ కంటికి నచ్చిన వస్తువు కొనకుండా విడిచిపెట్టలేరు.

సహజంగా, మనకు అనేక రకాల కోర్కెలు వుంటవి. వాటిని తీర్చుకొనడానికే మనం పనిచేస్తాం? అడవిజాతుల వారి కోర్కెలు అవసరాలు చాలా తక్కువ. అవి సులభంగా తీర్చుకొనగలిగినవి కూడా! కాని, ఈనాటి వారి అవసరాలు కోర్కెలు చాలా క్లిష్టమైనవి. వాటికి ఒక పరిమితి అనేది లేదు.

తమకు కావలసినది, తాము కోరుకున్నదీ సులభంగా లభ్యం కాకపోవడంవల్లనే నాగరికత నేడు ఇంతగా అభివృద్ధి చెందింది. ఎప్పటి అవసరాలు అప్పుడు, తమ కోర్కెలకు తగినట్టుగా తీరని సందర్భంలో వాటిని పొందడానికి అనేక నూతన విధానాలను మానవుడు కనిపెడుతున్నాడు. దానితో నూతన యంత్రాలు రావడం సరుకులు త్వరగా ఉత్పత్తి కాగల అవకాశాలు పెరగడం జరిగింది. నూతన పరిశోధనలతోపాటు క్రొత్తరకం కోర్కెలుకూడా పుట్టినవి. ఇలాగా జీవన ప్రమాణాభివృద్ధి జరిగింది.

చాలమంది అనేక సరుకులు కొంటారు. వీటిలో కొన్ని లేకపోయినా వారికి నష్టం లేదు. కాని ప్రతి ఒక్కరూ, కొద్దిపాటి జీవితావసరాలతో మాత్రమే సరిపెట్టుకొనక అదనంగా కొన్ని అవసరాలను కోరతారు.

దైనందిన జీవితంలో వ్యక్తి అవసరాలు కోర్కెలు రెండు రకాలు. ఒకటి ప్రాథమికమైన కోర్కెలు. రెండు వైజ్ఞానికమైన అవసరాలు.

ప్రాథమికమైన కోర్కెలు దైనందిన జీవితానికి సంబంధించినవి. అన్నవస్త్రాలు, గృహావసతి ఈ తరగతికి చెందుతవి. ఇతర కోర్కెలు కలిగివుండడానికి ముందు, బ్రతకడానికి అవసరమైన వాటి విషయంలో ప్రతి ఒక్కరూ జాగ్రత్త పడతారు.

సాగుబడి వున్నవారికి ఈ ప్రాథమికమైన కోర్కెలు మాత్రమే కాక జీవితాన్ని సుఖంగా అనుభవించడానికి తగిన వైజ్ఞానికమైన కోర్కెలుకూడా వుంటవి. వీటిలో విద్య, విశ్రాంతి, విజ్ఞానసేకరణ మొదలగునవి చేరివుంటాయి.

కోర్కెలు కలిగివుండడం "మానవ సహజం". కోరిక అంటే ఒక వస్తువు కావాలని అనుకొనడం. లేదా "ఆ వస్తువు నాకు వుంటే?" అని తలంచడం అని ఆర్థికశాస్త్రంలో అర్థం చెబుతారు.

"నాకు ఒక రేడియో కావాలి" ఇది కోరికమాత్రమే.

ఈ కోరికవున్నా, దానిని కొనగలిగిన శక్తి, దాని ఖరీదు చెల్లించగల తాహతు వుండవద్దూ! ఈ తాహతును

కలిగివుండి రేడియోను కొనగలిగిన శక్తివుంటే - అప్పుడు దీనిని "డిమాండు" అంటారు. అంటే జరూరుగా ఆ సరుకు మనకు కావాలన్నమాట. దీనిని మనం "ఫలించే కోరిక" అనుకొందాము.

రేడియో కొనగలిగిన తాహతు లేకపోయినా, దానిని కొనాలనే కోర్కె వుంటే, దానిని "ఫలించని కోరిక" అంటారు.

కనకనే మానవుని కోరికలను ఫలించని కోరికలు, ఫలించే కోరికలు అనే రెండు తరగతులుగా తిరిగి విభజించారు.

మనం అనేక వస్తువులు కావాలని కోరుకొనవచ్చు. వీటిలో కొన్ని మనకు అందుబాటులో వున్నా వాటి ధర తగ్గినా ఎక్కువగా కొని నిల్వచేయము.

ఉదాహరణకు నెయ్యి ధర తగ్గిందనుకుందాం. కొన్ని వీసెలుమాత్రమే కొంటాంగాని మణుగులు కొని, వాడకానికి నిల్వచేయబోము. కారణం! నెయ్యి నిల్వవున్నకొలదీ వాసన వేస్తుంది. దుంపకూరల ధర తగ్గిందనుకుందాం. ఇవి చాలాకాలం నిల్వవుంచవచ్చు. కనక ఎక్కువగానే కొని దాచిపెడతాము. ఇలాంటివాటిని - అంటే నిత్యం వాడకానికి కావలసినవి - జీవితావసర వస్తువులు అంటారు.

ఒకరికి సొంత కారు వున్నది. పెట్రోలు రేషన్ తీసివేశారు. ఇదివరకటికంటె ఎక్కువగా ఆ కారును ఆ కుటుంబం వాడుకుంటుంది. పెట్రోల్ రేషన్ వుంటే కొన్ని

పనులకు మాత్రమే వాడతారు. ఇలాంటివాటిని భోగవస్తువులు అంటారు.

ఈ కుటుంబంవారికి ఇంటివద్ద ఒక రేడియో వుంది. కారులో వున్నప్పుడు కూడా సంగీతం వినడానికి, వార్తలు తెలుసుకొనడానికి మరొక రేడియో ఏర్పాటు చేయించు కుంటారు. ఇలాంటివాటిని వినోదవస్తువులు అంటారు.

భోగవస్తువులు, వినోదవస్తువులు లేకపోయినా కాలం గడుస్తుంది. కాని జరుగుబాటును బట్టి, వ్యక్తి ఆదాయాన్ని బట్టి వీటి అవసరాలు ఏర్పడుతూ వుంటవి.

ఇందులో రేడియోధరలో మార్పు వచ్చిందనుకుందాం. దానిని కొనేవారి సంఖ్య పెరగడం కాని, తగ్గడం కాని జరగవచ్చు. దానిని "ఎలాస్టిక్ డిమాండ్" అంటారు. సామాన్యంగా భోగవస్తువులకు మాత్రమే ఇది వర్తిస్తుంది.

ధర తగ్గినా హెచ్చినా కొనేవారి సంఖ్య ఒకే విధంగా వుంటే అది "ఇన్ ఎలాస్టిక్ డిమాండ్" అంటారు. ఇది నిత్యజీవితావసర వస్తువులకు ఎక్కువగా వర్తిస్తుంది. ఉదాహరణ – బియ్యం.

అంటే ధరలనుబట్టి కూడా మానవుని అవసరాలు, కోర్కెలలో మార్పులు కలుగుతూ వుంటవన్నమాట.

చాలామంది ఏమీతోచక దుకాణాలవెంబడి తిరగడం కద్దు. ఫలానా వస్తువు కొనాలనే తలంపుతో వారు బయలుదేరరు. ఊరికే చూద్దామని బయలుదేరుతారు. లాభంగావుండే వస్తువు ఏదైనా కనిపిస్తే, దానిని కొనడం

కూడా కద్దు. మరికొంతమంది ఫలానా వస్తువు కొనాలనే ఉద్దేశ్యంతో బయలుదేరుతారు. అలాగే కొంటారు.

ఈ విధంగా ఎవరికి కావలసిన సరుకులు వారు కొని, వాటిని తనివితీర అనుభవిస్తారు. దీనినే సంతుష్టిపొందడం అంటారు. ఆర్థికశాస్త్రంలో దీనికొక సూత్రంకూడా వుంది.

ఒక ఆఫీసరుకు ఒక జత బూటులు వుంటే సరిపో తుంది. అవసరం గడుస్తుంది. రెండు జతలు వుంటే మరింత తృప్తిగా వుంటుంది. మామూలు పరిస్థితులలో మూడవ జత కూడా వుంటే పూర్తి సంతృప్తి చెందుతాడు.

ఒక వస్తువు అవసరం లేదా దానిమీద ఆపేక్ష అనేది ఒక పరిమితిలో తృప్తి కలుగజేస్తుంది. సంతుష్టి చేకూర్చుతుంది. దీనినే "సంతుష్టి సూత్రం" అంటారు.

"అధికశ్య అధికం ఫలం" అన్నారు పెద్దలు. ఇది పై సూత్రానికి సంబంధించినదే. ఈ సూత్రానికి సంబంధించిన ఇతర విషయాలు కూడా కొన్ని వున్నవి. సంతుష్టి చేకూరడ మనేది ఒకేదఫా జరగదు. ఒకే తరగతి వస్తువు అనేక దఫాలుగా వాడడంతో మనకూ క్రమక్రమంగా విసుగుపుడు తుంది. లేదా అసంతృప్తి కలుగుతుంది. దీనికికూడా ఆర్థికశాస్త్రజ్ఞులు ఒక సిద్ధాంతం చేశారు.

"ఏ ఒక్క దఫా అయినా, ఒకే రకం వస్తువులు అనేకం వరుసగా వాడినప్పుడు, రెండవదానికంటె మొదటి దానివల్ల మూడవదానికంటె రెండవదానివల్ల మనకు ఎక్కువ సంతుష్టి కలుగుతుంది" అనేదే ఈ సిద్ధాంతం. దీనిని ఇంగ్లీషులో "లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీ" అంటారు.

ఒక పిల్లవానికి మనం నాలుగు నారింజపండ్లు ఇచ్చామనుకుందాం. ఒకటి తిని నవ్వుకున్నాడు. దీనివల్ల అతనికి కలిగిన సంతృప్తికి మూడు మార్కులు వేద్దాం. రెండవది త్వరగా తిన్నాడు. దీనికి రెండు మార్కులు. మూడవది ఎలాగో తిన్నాడు. దీనికి ఒకమార్కు. నాల్గవది తినలేక తిన్నాడు. దీనికి మార్కులు సున్నా వేశాం. అంటే నాలుగు నారింజపండ్ల వల్ల ఆ పిల్లవానికి కలిగిన సంతృప్తి ఆరుమార్కులు అని తేల్చాం.

అయితే వీటిలో పూర్తి సంతృప్తి కలిగింది మూడవ పండువద్ద. అంటే మూడవ పండువరకు తినాలనే ఉత్సాహం పిల్లవానిలో వుంది. ఆ తరువాత పండ్ల అవసరం అతనికి లేదు. ఈ కథ అంతా "మార్జినల్ యుటిలిటీ" సిద్ధాంతం చెప్పడానికి ఊహించిందే.

వాడుకునే సరుకులలో కాని, తినే తిండిలో కాని అనేక రకాలు వుండాలని ప్రతి ఒక్కరూ కోరతారు. మనకు వున్న సరుకులన్నీ ఒకే రకంగా వుంటే చివరకు విసుగుపుడుతుంది. దీనిని ఆర్థికశాస్త్రజ్ఞులు "లా ఆఫ్ వెరైటీ" అన్నారు.

అందరి అభిరుచులు ఒకే విధంగా వుండవు. కొంత మందికి భోజనంకంటే కాఫీ చాలా యిష్టం. కొంతమందికి పాలు యిష్టం. అలా తాను ఖర్చుపెట్టిన దానికి తగిన పూర్తి ఉపయోగం, సంతృప్తి తనకు సిద్ధించగలదనే నమ్మకం కలిగినప్పుడే ఎవరైనా ఏ వస్తువునైనా కొనడం జరుగుతుంది. దానిని "ఎకనామిక్ ఛాయిస్" సిద్ధాంతం అంటారు.

మనకు కావలసిన వస్తువులను కొనడంలో ఇన్ని సూత్రాలు మనకు తెలియకుండానే పనిచేస్తూ వుంటాయి.

ఫలానావారి కుటుంబం చాలా సుఖంగా వుంది. వారు తాహతు కలవారు అని చెప్పుకుంటూ వుంటాం. ఆర్థిక శాస్త్రానికి సంబంధించినంతవరకు "తాహతు" అంటే వారు ఎక్కువ సరుకులను వాడతారని, ఆనందాలతో కాలం వెళ్ళబుచ్చుతారని, చదువుకొనడానికి ఎక్కువ అవకాశం వుంటుందని అర్థం చెబుతాము. ఇవన్నీ వున్నవారి "జీవన వ్యయ ప్రమాణం" చాలా హెచ్చు అంటారు.

"జీవనవ్యయ ప్రమాణం" అనేది వ్యక్తి లేక కుటుంబం ఆదాయంమీాద ఆధారపడి వుంటుంది.

ఆదాయం హెచ్చుగా వున్నా దానిని ఖర్చుచేసుకొనే విధానం తెలియక కష్టాలు పడేవారు వుంటారు. అంటే వారి అవసరాలేమిటో వారికి తెలియక "దుబారా" వ్యయం చేస్తారన్నమాట.

కొందరికి ఖర్చుచేసే విధానం తెలిసినా, "పెద్ద పోకడలు" పోయి చిక్కులు తెచ్చుకుంటారు. అంటే ఇంట్లో డబ్బు తక్కువగా వున్నా రేడియో కొనితెచ్చే రకం అన్నమాట.

మన నిత్యజీవితంలో "వాడకం" అనే దానికి ఆర్థికశాస్త్రజ్ఞులు ఇన్ని సిద్ధాంతాలు చేసారు.

# 4. ఉత్పత్తిదారు

నీవు ఉత్పత్తిదారువా? అసలు ఉత్పత్తిదారు అంటే ఎవరు?

నీవు ఏదైనా పనిచేస్తుంటే, ఉపయోగకరమైన పని చేస్తుంటే ఉత్పత్తిదారుకింద పరిగణింపబడతావు.

వస్తువులను తయారుచేసి ప్రజల ఉపయోగానికి అందు బాటులోకి తీసుకొనిరావడమే ఉత్పత్తి.

కనక ఉత్పత్తిదారు అంటే వస్తువులు చేసేవాడు లేదా సరుకులు తయారు చేసేవాడు అనుకుందాం.

ఎవరికోసం సరుకులు ఉత్పత్తి చేయాలి? అవసరం వున్నవారికోసమేనని చెప్పవలసిన పనిలేదుకదా!

సరుకులు తయారుచేయడానికి కావలసిన ముడివస్తువు లను ప్రకృతి సప్లయి చేస్తుంది. ఈ ముడివస్తువులను కొను గోలుదారులకు అందజేయడానికి ముందు, వాటిలో తగు మార్పులు చేసి, ఉపయోగకరమైనవిగా చేయడమే ఉత్పత్తి దారు చేయవలసిన పని.

ఉదాహరణకు ముడిఇనుము వుంది. ఆ రూపంలో అది ఎందుకూ ఉపయోగించదు. దానిని సామానుల రూపంలో వాడకానికి అనువగు స్థితికి మార్చినప్పుడే దాని ఉపయోగం.

కనక కొనుగోలుదారుల అవసరాలను గురించి వారి అభిరుచులను గురించి ప్రత్యేకంగా పరిశోధనలు చేయడం

మొత్తంమీద యెన్ని సరుకులు కావాలనే అంచనాలు తయారుచేయడం కూడా ఉత్పత్తికి అత్యవసరం.

ఈ అంచనాల ప్రకారం సరుకులను ఉత్పత్తి చేయడమే ప్లానింగ్ అంటారు. ఇలా చేయడంవల్ల అటు ఉత్పత్తిదారులు లాభాలు పొందుతారు. ఇటు కొనుగోలుదారులు సంతృప్తి చెందుతారు.

అలా కాక ఎవరికితోచిన సరుకులు వారు ఉత్పత్తి చేయడం, ఎవరికి కావలసిన సరుకులు వారు కొనడం అంటూ జరిగితే కేపిటలిస్టు ఉత్పత్తి అంటారు. ఇందులో ధరల హెచ్చుతగ్గులకు ప్రాధాన్యం హెచ్చుగా వుంటుంది. ఇతరుల అవసరాలను పరిగణించడం అంటూ వుండదు.

అసలు ఉత్పత్తికి కావలసిన ప్రధాన పరికరాలు ఏమిటి ?

(1) ఆస్తి (2) కృషి (3) పెట్టుబడి (4) వ్యవహార నిర్వహణ. వీటిని ఉత్పాదకశక్తులు అంటారు.

ఇందులో ఆస్తి అనేది ప్రకృతిసిద్ధమైనది. కృషి అనేది మానవుడు పనిచేయడానికి సంబంధించినది. పెట్టుబడి అనేది సరుకులు తయారు చేయడంలో ఉపయోగించే పని ముట్లు వగైరాలకు చెందుతుంది. ఇంక వ్యవహార నిర్వహణ అనేది వాణిజ్యం, కంట్రోలు, వ్యాపారాభివృద్ధికి సంబంధించినది.

ఇందులో ముందు ఆస్తిని గురించి ఆర్థికశాస్త్రం ఏమిటి చెబుతుందో పరిశీలిద్దాం.

ఆస్తి అనేదానికి భూ సంపద అని ఆర్థికశాస్త్రం అర్థం చెబుతుంది. భూమిలోపల గల సంపద, భూమిపైనగల సంపదకూడా దీనిలో చేరుతుంది. అంటే ఖనిజాలు, గనులు, చెరువులు, జలపాతాలు, కొండలు అన్నీ దానిలో చేరివుంటవన్న మాట.

సహజ సంపదలలో భూమి ప్రధానమైనది. సరుకుల ఉత్పత్తికి ఇది అందజేసినన్ని ముడివస్తువులు మరితరంగా లభ్యంకావు.

ప్రతిపనికీ భూమి అవసరం వుంది. రైతులు సరాసరిగా సాగుచేసి భూమిని ఉపయోగిస్తారు. కొందరు ఫ్యాక్టరీలు వగైరాలు నిర్మించి భూసంపదను ఉపయోగించుకుంటారు.

అయితే భూమి విలువలో తేడాలు కనిపిస్తవి. రైతుల భూముల ధరలలో ఎంత తేడా వున్నదో బస్తీలలోని స్థలాల ధరలో కూడా అంతే భేదం వుంటుంది.

భూమి ధర అనేక విషయాలమీద ఆధారపడి వుంటుంది. పంటపొలాల విషయంలో సారాన్నిబట్టి అది వున్న ప్రాంతాన్నిబట్టి ధరలో హెచ్చుతగ్గులు వుంటవి. అంతేకాదు, పంటభూములకు చక్కని రాకపోకల సౌకర్యాలు, దగ్గరలో మార్కెట్ సౌకర్యం కూడా గమనించడం కద్దు. బస్తీకి ఆనుకొనివున్న భూముల ధర మరీ హెచ్చుగా వుంటుంది.

అదీకాక ఉపయోగానికి అనువగు భూమి విస్తీర్ణం చాలా తక్కువ. అయితే బంజరులను సాగుచేయడం ద్వారా విస్తీర్ణం పెంచుతుంటారు.

వ్యవసాయాన్ని గురించి ఈనాడు రెండు మాటలు ప్రచారంలో వున్నవి. ఒకటి భారీ వ్యవసాయం; రెండు సన్నకారు వ్యవసాయం.

ఒక రైతు ఎక్కువ నాగళ్ళు, యంత్రాలు ఉపయోగించి పెద్ద ఎత్తున వ్యవసాయం చేస్తే దానిని భారీ వ్యవసాయం అన్నారు. దానిలో కొన్ని లోపాలు వున్నవి. ముందు నాసిరకం భూమిజోలికి పోక మంచి భూమిని మాత్రమే పెద్దరైతులు సాగుచేస్తారు. నాసిరకం భూమిని ఇతరులకు కౌలుకు యివ్వడానికి ప్రయత్నిస్తారు. హెచ్చు ఎకరాలలో ఒకేరకం పంటవేయడం జరుగుతుంది. అంటే భూమిని అంతా సక్రమంగా ఉపయోగించడం జరగదు. అవకాశాలున్నా అనేకరకాల పంటలు పండించరు.

ఇంక సన్నకారు వ్యవసాయంలో వున్న కొద్దిపాటి భూమిని సక్రమంగా బాగుచేస్తారు. నాసిరకం పొలాన్ని మరింత కష్టపడి బాగుచేస్తారు. కౌలుకు యివ్వాలనేదృష్టి వీరికి వుండదు. ఒకే పంట కాకుండా అనేకరకాల పంటలు పండించడానికి ప్రయత్నం చేస్తారు. ధరనుబట్టి కాక, భూమి పదునునుబట్టి తగినపంట పండిస్తారు కూడా.

కాని భారీ వ్యవసాయంలో లాభాలు హెచ్చుగా రావడం, సన్నకారు వ్యవసాయంలో కష్టంకూడా గిట్టక పోవడంతో చిన్నరైతులు దెబ్బతింటున్నారు. అయితే ప్రతి దేశంలోనూ సన్నకారు సొంత వ్యవసాయం ప్రాతిపదికగా భారీ వ్యవసాయ కేంద్రాలు స్థాపించి తక్కువభూమిలో హెచ్చు

పంటలు పండించడానికి కృషి జరుగుతున్నది. దీనికి ప్రభుత్వం ప్రోత్సాహంకూడా వుంటున్నది.

కొంతమంది రైతులు బాగా కష్టపడి చేలకు బలంచేసి ఏటా అనేక ఎరువులనుకూడా వాడుతారు. కొంతకాలం వరకు చేసిన కష్టం, పెట్టిన పెట్టుబడికి సమానంగా ప్రతిఫలం పొందుతారు. కాని ఒకనాటికి ఇంక ఆ పొలంమీద పెట్టుబడి పెట్టడం లాభదాయకం కాదనే నిర్ణయానికి వస్తారు. దీనినిబట్టి "లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీ" అనే సూత్రం చేశారు. దీనిని "క్షీణవృద్ధిన్యాయం" అన్నారు.

దీని నిర్వచనం ఇది — ఒక భూఖండంలో పనిచేసే వారిని, పెట్టుబడిని హెచ్చుచేస్తే కొంతకాలం ఫలసాయం సమానంగా పెరుగుతుంది. కాని ఒకస్థితిలో ఫలసాయం మొత్తం పెరిగినా చేసిన కష్టం, పెట్టిన పెట్టుబడికి అనుగుణంగా ఆ ఫలసాయం వుండదు.

ఉదాహరణకు ఒక రైతు మొదటి సంవత్సరం తన ఎకరా భూమికి రూ. 50 ఖర్చు చేయగా 21 బస్తాల ధాన్యం పండిం దనుకుందాం. రెండవ సంవత్సరం రూ. 100 ఖర్చు చేయగా 45 బస్తాలు పండింది. (అంటే రూ. 50 అదనంగా ఖర్చు చేసినందుకు రెట్టింపు పంట పండిం దన్నమాట). ఈ లెక్కన మూడవ సంవత్సరంలో రూ. 150 ఖర్చు పెడితే కనీసం 65 బస్తాలు పంట పండవచ్చు ననుకుంటాం. (అంటే మూడురెట్లు అన్నమాట.) కాని వాస్తవంగా 55 బస్తాలు మాత్రమే పండింది. అంటే మూడవ

సంవత్సరంలో వెనకటికంటె హెచ్చుపంట పండినా, వెనకటికివలె రెట్టికిరెట్టు పంట రాలుబడి జరగలేదు. లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీని వివరించడానికి సామాన్యంగా ఈ ఉదాహరణను చెప్పడం కద్దు.

పంటలు పండటానికి, ప్రకృతి సంపదలను వాడుకోనడానికి కూడా ఒక పరిమితివుంది. అందరికీ తిండి దొరకడాన్ని గురించి అనేకమంది శాస్త్రజ్ఞులు అనేక శతాబ్దాలుగా పరిశోధనలు జరుపుతూ వచ్చారు. నానాటికి పెరిగిపోతున్న జనాభాకు కావలసిన ఆహారం సప్లయి కావడాన్ని గురించి వీరు అనేక ప్రణాళికలు ప్రకటించారు.

ఆహారం సప్లయి — జనాభా పెరుగుదల సమస్యను గురించి 1798లో మాల్థూస్ అనే ఒక ఆర్థిక శాస్త్రజ్ఞుడు ఒక వ్యాసాన్ని ప్రకటించాడు. ఈయన అభిప్రాయాలను సూక్ష్మంగా ఇలా వివరించవచ్చు :

"అందుబాటులో గల ఆహారంకంటె జనాభా పెరుగుదల హెచ్చుగా వుంటుంది. యుద్ధాలు, కరువులు, వ్యాధుల వల్ల జనాభా పెరుగుదల అరికట్టబడకపోతే అందుబాటులో వుండే ఆహారం సప్లయి చాలనంతగా జనాభావృద్ధి జరుగుతుంది. దీని ఫలితంగా కొందరు ఆకలిమంటలకు గురి అవుతారు."

మాల్థూస్ చెప్పిన ఈ సూత్రం ఆచరణలో ధృవపడలేదు. మాల్థూస్ దృష్టికి అందని అనేక కారణాల ప్రాబల్యం అధికంగా వుండటంవల్ల అలా జరుగలేదు. ముఖ్యంగా అధికో

త్పత్తి సాధనాలను (ట్రాక్టర్లు, ఎరువులు, తదితర వ్యవసాయ యంత్రాలు) గురించి ఆయన ఊహించలేదు. మనం ఎంత తింటున్నామనే విషయానికి కాక ఏమిటి తింటున్నామనే విషయానికి ఈనాడు డాక్టర్లు హెచ్చు ప్రాధాన్యం యిస్తున్నారు. అందువల్ల ఆహారం అనే దానిలో రకాలు హెచ్చినవి. దీనినికూడా మాల్థూస్ పరిగణించలేదు.

ఈ లోపాలనుబట్టి మాల్థూస్ సిద్ధాంతాన్ని చాలా మంది ఆమోదించలేదు. కాని జనాభా పెరుగుదలను కంట్రోల్ చేయడం - ఆహార పదార్థాల అభివృద్ధిని సాధించడం మొదలగు సమస్యలు మాత్రం అందరి దృష్టినీ ఆకర్షించినవి.

# 5. యంత్రశక్తి - మానవశక్తి

యంత్రశక్తి - మానవశక్తి—వీనిని గురించి తరచుగా మనం వింటూ వుంటాం. యంత్రశక్తి మానవశక్తికి భిన్న అని ధృవపడినప్పటికి కొందరు మన పూర్వకాలపు కుటీర పరిశ్రమల పునరుద్ధరణకు పూనుకోవాలని సూచిస్తున్నారు.

కొన్ని యంత్రాలను కనిపెట్టినందువల్ల వానిలో కొద్దిపాటి మార్పులు చేసినందువల్ల వేలకొలదిమందికి పని లేకుండా పోయినమాట నిజమే. యంత్రాలవల్ల ఇంకా అనేక వేలమందికి పని దొరికిందికూడా.

మానవశక్తి - అంటే కష్టపడి పనిచేయడం - చాలా ముఖ్యమైనది. ఉత్పత్తిలో దీనిది కీలకపాత్ర. సహజ సంపదను వాడకానికి అనువగు సరుకుగా మార్పుచేయడమే మానవశక్తి నిర్వహించు ముఖ్య పాత్ర. ఈ మార్పు చేయడం ద్వారా కార్మికులు జీవనభృతిని సంపాదించుకుంటారు. ప్రతి ఒక్కరూ ఏదో ఒకవిధమైన కష్టం చేస్తూ జీవనం గడుపుతూ వుంటారు.

కష్టపడి పనిచేయడానికి బుద్ధిబలం, కండబలం కూడా కావాలి. అందువల్ల పనిచేసేవారిని రెండు తరగతులుగా విభజించారు. కొందరు బుద్ధిజీవులు, మరికొందరు కష్టజీవులు. (శరీరకష్టం చేసేవారు) సూక్ష్మంగా పరిశీలిస్తే పనిచేసేవారిని - కార్మికులను- రెండు తరగతులుగా విభజించడం సబబుకాదు. బుద్ధిజీవులుకూడా శారీరకంగా కష్టపడాలి. కష్టజీవులుకూడా తమ తెలివితేటలను ఉపయోగించాలి.

డాక్టర్లు, లాయర్లు, ఉపాధ్యాయులు, వ్యాపారస్తులు వగైరాలంతా బుద్ధిజీవులలో చేరతారు.

ఇంక కష్టజీవులలో-శరీరకష్టం చేసేవారిలో-నిపుణులు, తెలివికలవారు, నౌకరులు అనే రకాలున్నారుకూడా.

కార్మికుని పనిశక్తి, నైపుణ్యం అనేవి అతని శక్తి యుక్తులమీదనే కాక కుటుంబం, ఇల్లు, వాకిలి, ఆదాయం, విద్య మొదలగువానిమీదకూడా ఆధారపడి వుంటవి. పని తరహానుబట్టికూడా కార్మికుని శక్తియుక్తులు బయటపడ గలవు.

సరుకుల ఉత్పత్తిలో కష్టజీవులతోపాటు యంత్రాలు కూడా ముఖ్యపాత్రను నిర్వహిస్తవి. సరుకుల ఉత్పత్తికి కావలసిన యంత్రాలు, పనిముట్లు తదితర వస్తువు లన్నింటినీ చేర్చి "పెట్టుబడి"గా ఆర్థికశాస్త్రం పరిగణిస్తుంది.

ఉదాహరణకు రవాణాకు ఉపయోగపడు మోటారు ట్రక్కులు, రైల్వే పెట్టెలు, తదితర సామాగ్రులు, యంత్రాలు వగైరాలు పెట్టుబడి సరుకులు అంటారు. డబ్బు రూపంలో పరిశ్రమలకు చేసిన ఖర్చును పెట్టుబడి నిధి అంటారు. నిల్వచేసి ఒక మూల నిరుపయోగంగా వుంచిన సొమ్మును పెట్టుబడిగా పరిగణించరు.

పెట్టుబడులు రూపొందడానికి ప్రస్తుతపు అవసరాలు కొన్ని మానుకొని అధికోత్పత్తి సాధనాల నిర్మాణానికి పూనుకొనడం అత్యవసరం ; అంటే నెలసరి జీతంలో కొంత ఆదాచేసి, సంవత్సరంమీద కొంత సొమ్ము నిల్వచేయడం. ఆ మొత్తంతో కొన్ని శాశ్వత ఫలితాలు కలిగే ఏర్పాట్లు చేసుకొనడం అన్నమాట.

కొన్ని వేల రూపాయలతో ఒక ఫ్యాక్టరీని కొనడం జరిగితే దానిని స్థిరమైన పెట్టుబడి అంటారు.

వర్తక వాణిజ్యాలకు ఉపయోగించే సొమ్మును "చలామణిలో పెట్టుబడి" అంటారు. అంటే అనేక సరుకు లకు డబ్బు పెట్టుబడిపెట్టి, వాటిని అమ్మడం, లాభంతో సొమ్ము రాబట్టి, తిరిగి పెట్టుబడి పెట్టడం వగైరా.

ఇనుము, బొగ్గు, కలప వగైరాలకు పెట్టే పెట్టుబడిని "స్వేచ్ఛగా వినియోగించే పెట్టుబడి" అంటారు. అంటే అనేక తరహాలుగా ఈ సరుకులు ఉపయోగపడత వన్నమాట.

ఒక ఫ్యాక్టరీ లేదా భూమి వగైరాలమీాద పెట్టుబడిని "ప్రత్యేకమైన పెట్టుబడి" అంటారు. ఒకేరకం ఉత్పత్తికి మాత్రమే ఇది ఉపయోగిస్తుం దన్నమాట.

అన్నిరకాల పరిశ్రమలకు ఇన్ని రకాలుగా పెట్టుబడుల అవసరం వుంది.

ఎంత పెట్టుబడి పెట్టికొన్నా, యంత్రాలు వగైరాలు ఎక్కువ రోజులు పనిచేయవు. కనక, మరమ్మతు నిధులు, తరుగుదల నిధులు అని ప్రత్యేకంగా ఏటా కొంత సొమ్ము కేటాయిస్తూ వుంటారు. అలాగే కార్మికులకు కూడా భీమా వసతులు, వైద్య సౌకర్యాలు, గృహ వసతులు వగైరాలు ఏర్పాటు చేస్తారు.

# 6. భారీ పరిశ్రమలు

పెద్ద పెద్ద ఫ్యాక్టరీలను, అనేక వేలమంది పనిచేసే పరిశ్రమలను భారీ పరిశ్రమలు అంటారు. ఈ పెద్ద ఫ్యాక్టరీలను చూడగానే, దీనిలో "మానవుని పాత్ర చాలా స్వల్పం" అని ఉద్దేశపడతాం.

జీవితానందంకోసం అనేకమంది అనేకరకాల సరుకులను ఒకేదఫా కోరతారనేది భారీ పరిశ్రమల వ్యాప్తికి ప్రధాన ప్రాతిపదిక.

భారీ పరిశ్రమల అభివృద్ధికి యంత్రాలు, కార్మికులు ముఖ్యావసరం. నూతన యంత్రాలను కనిపెట్టడం కూడా చాలా అవసరం. స్వల్పకాలంలో ఎక్కువ సరుకులను తక్కువ వెలకు తయారుచేయడమనేది యంత్రాల ప్రాబల్యానికి ప్రధాన సూత్రం.

భారీపరిశ్రమలన్నీ దాదాపు పెద్దపెద్ద కంపెనీల ఆధ్వర్యాన నడుస్తవి. వీరివద్ద పెట్టుబడిధనం విపరీతంగా వుంటుంది. కనక ముడిసరుకుల ప్రాప్తిస్థానానికి దగ్గరగా వీరు ఫ్యాక్టరీలను నెలకొల్పుతారు. అవసరమైతే కొంతకాలం నష్టంమీదకూడా వీటిని నడుపుతారు.

భారీ పరిశ్రమలు సరుకులు సప్లయిచేసి, ధరలు వసూలుచేసుకొనడంతో వాటి పని పూర్తికాదు. ప్రజాభిమతం, వారి అభిరుచులను కూడా గుర్తించి తదనుగుణంగా సరుకుల ఉత్పత్తి కొనసాగించాలి.

కనక భారీ పరిశ్రమల వ్యాప్తికి జాతీయావసరాలు-దేశ పరిస్థితులు గుర్తించడం అత్యావసరం. ప్రజలకు అందుబాటులో వుండగల ధరలకు సరుకులు ఉత్పత్తిచేయాలి. తమ కార్మికులు సుఖంగా బ్రతకడానికీ, సంఘంలో హెచ్చుమందికి పని చూపించడానికి తగిన ఏర్పాటుకూడా చేయాలి. కార్మికులతో అనవసరంగా తగాదాపడి ప్రభుత్వం జోక్యం కలిగించుకొనవలసిన పరిస్థితులు కలిగించి దేశాన్ని చిక్కులపాలు చేయకూడదు. దేశంలోని సహజసంపదలను వృథాచేసే ఉత్పత్తులను కొనసాగించకూడదు. అవసరాన్నిబట్టి పూచికపుల్లలను కూడా సంఘక్షేమంకోసం ఉపయోగించడానికి తగిన పరిశోధ

నలు జరిపించి, పరిస్థితులకు అనువుగా మార్పుచెందడానికి సిద్ధంగా వుండాలి.

భారీపరిశ్రమలను సక్రమపద్ధతిలో నడిపినప్పుడు, వానివల్ల వ్యక్తిగత వ్యాపారంకంటె సంఘానికి హెచ్చులాభం కలుగుతుంది. కార్మికులు యంత్రానికి బానిసలు కాగలరని, సరుకులతయారీలో కార్మికుని నిపుణత, ప్రత్యేకత కనిపించదని, వ్యక్తి అవసరాలను పరిగణించక, కేవలం సంఘం మొత్తం మీద సరకుల ఉత్పత్తి జరుగుతుందనే ధోరణిలో భారీ పరిశ్రమలనుగురించి విమర్శనలు జరగడం కద్దు. ఈ విమర్శన లను కాదనలేముకాని, ఆధునిక జీవితధోరణిని దృష్టిలో వుంచుకున్నప్పుడు ఈ విమర్శనలు సహేతుక మనిపించవు. తాత నాగలి దున్నాడు. తండ్రి ఉద్యోగం చేశాడు. తాను వ్యాపారం చేస్తున్నాడు. అయినా తాతలనాటి పద్ధతులు మంచివే అంటాడు. కాని, తానుమాత్రం నిత్యజీవితంలో ఆధునిక విధానాలవైపు మొగ్గు చూపుతాడు. భారీపరిశ్రమ లను కాదనేవారి ధోరణి కూడా ఇదే.

ఒక దేశంలో భారీపరిశ్రమలకు గల ప్రతిపత్తిని గురించి పరిశీలించేటప్పుడు ప్రాంతీయ నైసర్గిక పరిస్థితులు, అక్కడి సహజసంపదలు, రవాణా సౌకర్యాలు వగైరాలను గుర్తించాలి. ఉదాహరణకు ఒక రాష్ట్రంలో ఉక్కు పరిశ్ర మాభివృద్ధికి చక్కని అవకాశాలు వుంటే, మరొక రాష్ట్రంలో గాజు పరిశ్రమకు మంచి అవకాశాలు కనిపిస్తవి. వీటి అభివృద్ధికి ప్రాంతీయ పారిశ్రామికాభివృద్ధి ప్రణాళికలు అవసరం.

ప్రపంచం మొత్తంమీద చూస్తే ఏ ఒక్క దేశం ప్రతి విషయములోనూ స్వయంపోషకం కాదు. అందువల్ల ఒక దేశం మరొక దేశంమీద ఆధారపడక తప్పడంలేదు. ఉదాహరణకు మలయాలోని రబ్బరు అమెరికా, రష్యాలకు అత్యవసరం. మధ్యప్రాచ్యంలోని నూనెలు బ్రిటన్, అమెరికాలకు ప్రాణావసరం.

అలాగే కార్మికుల విషయంలో కూడా దక్షిణాది కార్మికులలో ఓపిక ఎక్కువ అని, చాలా తెలివితేటలతో పనిచేస్తారని ఉత్తరాదివారు చెప్పుకుంటూ వుంటారు. దక్షిణ భారతంలోని కార్మికులు పనిచేయడానికి పెక్కు అవకాశాలు, పనిచేసే చోట మంచి ఏర్పాట్లు కావాలని ముఖ్యంగా కోరతారట. ఉత్తరాదివారు పని గంటలు పరిమితం కావాలని, విశ్రాంతి కావాలని జీతాలు పెంచాలనే కోర్కెలను హెచ్చుగా కోరతారని కూడా ప్రతీతి.

అదే విధంగా యంత్రాల ఉపయోగంలో కూడా. యూరపులోని కొన్ని దేశాలనుంచి ఇండియాకు దిగుమతి చేసిన యంత్రాలలో కొన్ని దక్షిణ హిందూదేశంలో చాలాకాలం పనిచేస్తవని, మరికొన్ని వెంటనే చెడిపోతవని చెప్పడం కద్దు. దానికి శీతోష్ణపరిస్థితులు కారణమని విదేశ నిపుణులు చెప్పారట. దీనికి ఒక ఉదాహరణ ఇంజన్ బాయిలర్లు.

కనక భారీపరిశ్రమల అభివృద్ధికి ఇన్ని కష్టనష్టాలను తట్టుకోవాలన్నమాట.

ఈ చిక్కులన్నీ పరిష్కరించుకొని భారీపరిశ్రమలు నెలకొల్పడం జరిగిన తరువాత కూడా మరికొన్ని అవరోధాలు ఏర్పడ గలవు. ఇవి ప్రభుత్వానికి సంబంధించినవి.

వ్యక్తిగత వ్యాపారానికి ప్రాబల్యంవున్న రోజుల్లో ప్రభుత్వజోక్యం చాల తక్కువగా వుండేది. అంటే సరుకుల నాణ్యం, వాటికి ధర, సప్లయిలు, కార్మికుల సమస్యలు వగైరాలు వ్యాపారస్తులు చిత్తం వచ్చినట్లు పరిష్కరించుకొనే వారు. దీనిని "లాజా ఫేర్" అనేవారు. అంటే వ్యాపారంలో సర్వస్వాతంత్రం అని మనం అనుకుందాం. దీనిని సిద్ధాంతీకరించిన మహామహుడు యాడమ్ స్మిత్. ఈయన రచించిన ఉద్గ్రంథం " వెల్త్ ఆఫ్ నేషన్స్."

కాలక్రమేణ వర్తక వ్యాపారాలలో ప్రభుత్వం జోక్యం కలిగించుకొనడం సాగించింది. అంటే ఉత్పత్తి కోటాలు నిర్ణయించడం, ధరలు స్థిరీకరించి లాభాలను పరిమితం చేయడం, శాసనరీత్యా కార్మికులకు వసతులు నిర్దేశించడం వగైరాలు చేసిందన్నమాట. దానిని " మెర్కేంటైలిజం" అన్నారు. ఇది "లాజా ఫేర్"కు వ్యతిరేకమైనదశ.

ఇంక పారిశ్రామికవేత్తలు తమకు తాముగా ప్రభుత్వ జోక్యంలేకుండా పై ఏర్పాట్లుఅన్నీ చేసుకొని, సమష్టిగా వాటిని అమలుజరపడాన్ని "ఇండస్ట్రియల్ డెమోక్రసీ" అన్నారు. దీనిని మనం పారిశ్రామిక ప్రజాస్వామ్యం అనుకుందాం.

ప్రభుత్వమే కీలక పరిశ్రమలను స్వాధీనం చేసుకొని, నిర్వహించాలనే వాదనకూడా వుంది. దీనినే పరిశ్రమలను జాతీయం చేయడం, సంఘపరం చేయడం అంటారు.

ఇందులో కూడా రకా లున్నవి: ఒక పరిశ్రమకు ఒక కార్పొరేషన్‌ను ఏర్పాటుచేసి శాసనరీత్యా ఆ పరిశ్రమ

నిర్వహణబాధ్యత ఆ కార్పొరేషన్‌కు అప్పగింత పెట్టడం. ఉదాహరణకు దామోదరలోయ కార్పొరేషన్.

ప్రత్యేక శాఖలు, బోర్డులు, సలహా సంఘాలద్వారా ప్రభుత్వం ఉపాంగంగా నిర్వహించడం. ఉదాహరణకు తంతి తపాలా సర్వీసులు, రైల్వేలు వగైరా.

ప్రభుత్వాధిపత్యంక్రింద పరిశ్రమలు నిర్వహింపబడటంలో మేనేజర్ల పెత్తందారీతనం అనే క్రొత్త ప్రమాదం ఏర్పడుతుందనే విమర్శవుంది. కంపెనీలు లేదా కార్పొరేషన్‌లలో మేనేజర్లు సర్వాధికారులు కాగలరన్న ఆరోపణలు జరుగుతున్నవి.

ఈ ప్రమాదాన్ని తట్టుకొనడానికి కూడా ప్రభుత్వాలు రకరకాల శాసనాలద్వారా అధికారవర్గాలు పెత్తనం చెలాయించడాన్ని పరిమితం చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

కనక పారిశ్రామిక వ్యవస్థలో వివిధ దశలు ఇలా వున్నవి :—

వ్యాపార స్వాతంత్ర్యం (లాజా ఫేర్) — ఈ దశలో వర్తక వ్యాపారాలలో పోటా పోటీలు హెచ్చు. డబ్బుగల వాడిది రాజ్యం.

ప్రభుత్వం కంట్రోల్ (మెర్కెంటైలిజం) - వర్తక వ్యాపారాలకు కొన్ని గిరులు గీస్తూ ప్రభుత్వం శాసనాలు చేస్తుంది. అంటే పోటాపోటీలకు కొంతవరకు కళ్ళెం వేస్తుంది.

ప్రభుత్వాధిపత్యం (స్టేట్ కంట్రోల్) - ప్రభుత్వమే పరిశ్రమలను నిర్వహిస్తుంది. పోటీ వుండదు. ప్రభుత్వమే ఉత్పత్తిదారు - వ్యాపారస్తుడుగా వుంటుంది.

# 1. ధరలు - వాటి హెచ్చుతగ్గులు

స్వంతవాడకానికి సరిపోగా మిగిలిన వస్తువులను మాత్రమే మారకం చేయడానికి గాని, అమ్మడానికిగాని సామాన్యంగా ప్రజలు ప్రయత్నిస్తూ వుంటారు.

గ్రామాలలో కొందరు రైతులు తమ పంటలను వర్తకులకు అమ్మి సాలుపొడుగునా తమకు కావలసిన వాడకం సరుకులు వారి దుకాణాలలో తెచ్చుకుంటూ వుండటం మనకు తెలుసు.

ఇక్కడ మారకం అంటే వస్తువుపై యాజమాన్యాన్ని లేదా స్వాధీనపు హక్కును మరొకరికి యిచ్చివేయడం అన్నమాట.

ఆర్థికశాస్త్రంలో మారకం అనేది రెండు తరహాలు. ఒక వస్తువు యిచ్చి మరొక వస్తువు పుచ్చుకుంటే "బార్టర్" అంటారు. దీనిని వినిమయం అని మనం అనుకుందాం. ఉదాహరణకు ఒక కమ్మరివద్ద బండి తీసుకుని రైతు అతనికి ధాన్యం యివ్వడం. ఇది ముఖాముఖి జరిగిన మారకం. పూర్వకాలంలో ఇది అమలు జరిగింది.

డబ్బువాడకం అమలులోకి వచ్చింతరువాత పరోక్షపు మారకం హెచ్చుగా అమలులోకి వచ్చింది. ఒక వస్తువును "కొంత ఖరీదు" కట్టి మరొకరికిచ్చి, వారివద్ద తీసుకొనే సరుకుకుకూడా "ఖరీదుకట్టి" ధరలో తేడాను డబ్బులో సరిపెట్టుకోవడాన్ని పరోక్షపు మారకం అంటారు. ఇందు

లోనే "అప్పుల" పద్ధతికూడా జతపడివుంది. అంటే పరోక్షపు మారకంవల్ల "ఖరీదులు – అప్పులు – పరపతులు" అనే కొత్త సమస్యలు ఉత్పన్నమైనవి.

ఈ విధంగా సరుకుల మారకంవల్ల మనకు వచ్చేలాభం ఏమిటి?

ప్రతి కుటుంబం తమకు కావలసిన సరుకు లన్నింటినీ సొంతంగా తయారుచేసుకొని స్వయంపోషకంగా వుండే రోజులలో నేటికాలపు ఆర్థికపు చిక్కులు ఎక్కువగా వుండేవి కావు. ఎవరికి వారు పనులు చేసుకుంటూ వుండేవారు. కుటుంబ జీవితమే పరమావధిగా వున్న సాంఘిక జీవితం "పరిమితంగా" వుండేది. కొన్ని వేల సంవత్సరాల కిందట – కొన్ని గ్రామాలలో ఇప్పటికి కూడా – ఈ పరిస్థితు లున్నవి.

అయితే ఒక్కొక్క తెగవారు ఒకేరకం సరుకులు తయారుచేయడంలో నిపుణులు కావడంవల్ల, వారి ఉపయోగానికి పోను మిగిలినవి మరొక తెగకు పంపించడానికి పూనుకొనడంతో సరుకుల మారకం – వినిమయం –జరుగుతూ వుండేది. ఈ విధంగా ఆనాడు వ్యాపారాలు జరిగేవి.

రవాణా సౌకర్యాలు పెరగడంతో వ్యాపారాభివృద్ధి హెచ్చింది.

ఇంక మారక సౌలభ్యంవల్ల, టెలిఫోన్, టెలిగ్రాఫ్ సౌకర్యాలవల్ల, బ్యాంకీలు, సహకార వస్తు విక్రయసంస్థల

అభివృద్ధితో, ఒక ప్రాంతంలో తయారుచేయబడిన సరుకులు మరొక ప్రాంతంవారు వాడుకొనడానికి వీలు కలిగింది.

దీనితోపాటు వివిధ ప్రాంతాలవారు వివిధ రకాల సరుకుల ఉత్పత్తికి ప్రత్యేకశ్రద్ధ తీసుకొనడం, ఆ సరుకులలో ఆ ప్రాంతానికి మార్కెట్‌లో పేరు ప్రతిష్ఠలు రావడం జరిగింది. అంటే శ్రామిక విభజన జరిగి ప్రతివ్యక్తి ప్రత్యేకత బయటపడటానికి అవకాశం కలిగిందన్నమాట.

ఈ సరుకు విలువ చాలా హెచ్చుగా వుంది? అని అనుకుంటూ వుంటాం. అసలు విలువ అంటే అర్థం ఏమిటి?

ఒక సరుకు మనకు ఉపయోగపడే అవకాశాలను బట్టి దాని విలువను సామాన్యంగా అంచనావేస్తాం.

మన పూర్వీకుల ఫోటో ఒకటి వుందనుకుందాం. అది మన కుటుంబానికి ఉపయోగించినంతగా మరొకరికి ఉపయోగించక పోవచ్చు.

అలాగే ఒక హోటలులో భోజనం ఖరీదు అర్ధ రూపాయి. ఆకలిగా వున్న ఒక వ్యక్తి తనవద్ద డబ్బు వుంటే, ఆకలి తీర్చుకొనడానికి అయిదు రూపాయలైనా చెల్లించడానికి యిష్టపడతాడు. ఆ క్షణానికి దాని విలువ అంత హెచ్చా అనే సంగతి అతనికి పట్టదు. కాని ఇతరులుమాత్రం అర్ధ రూపాయి భోజనం అని అంచనా వేసుకుంటారు. దానిని ప్రత్యక్షపు విలువ అంటారు.

అయితే ఒక వస్తువు ఉపయోగం లేదా విలువను నిర్ణయించడం ఎలాగు?

ఒక చిన్న కారు వేలం వేయడానికి వచ్చింది. అది నాలుగువేలు చేస్తుందని దాని యజమాని చెబుతాడు. కాని మూడువేలకే ఒకరు పాటపాడతారు. అదే ధరకు అమ్మి వేయడం జరుగుతుంది. ఇందులో ఈ కారు ప్రత్యక్షపు విలువ మూడువేలు అన్నమాట. దీనినే మారకపువిలువ అంటారు. దీనినే "మార్కెట్" లో ధరపలకడం అంటారు. ఇంక యజమాని చెప్పింది పరోక్షపు విలువ అన్నమాట. దీనినే అసలు విలువ అనుకుందాం.

కనక ఒక వస్తువు అసలు విలువ దాని మారకంవల్ల అదనంగా రాగల ఇతర వస్తువులనుబట్టి నిర్ణయిస్తారన్నమాట. కొన్ని సందర్భాలలో హెచ్చుధర చెల్లించగలవారినిబట్టి కూడా ఈ విలువ నిర్ణయిస్తారు. డబ్బురూపంలో రాగల అదనపు మొత్తాన్ని బట్టికూడా సరుకు విలువను నిర్ణయించడం కద్దు.

ధరనుబట్టి వస్తువు విలువ లెక్కవేస్తారనుకున్నాం. ఇందులో ధర అంటేకూడా అర్థం తెలుసుకుందాం.

ఒక సరుకు విలువను డబ్బురూపంలో చెప్పడాన్ని ధర అంటారు.

ఒక ఆవు ధర రెండువందల రూపాయలంటే దానిని అమ్మే ఆసామి దృష్టిలో దాని విలువ డబ్బురూపంలో అంత చేస్తుం దన్నమాట.

ఒక వస్తువుకు కొనుగోలుదారులు చెల్లించే ధర అనేక విషయాలమీద ఆధారపడి వుంటుంది. అలాగే ధర నిర్ణయం కూడా.

వర్తకుడు తన సరుకు ధరను నిర్ణయించుకోనడానికి ముందు, దాని ఉత్పత్తికి తాను చేసిన ఖర్చును, తాను పొంద దలచిన లాభం వగైరాలన్నీ చేర్చి ధరను స్థిరీకరిస్తాడు.

దానిని దుకాణదారుకు అమ్మినప్పుడు నూటికి కొంత మినహాయించి యిస్తాడు. ఆ దుకాణదారు ఈ మినహాయిం పుకు తోడు మరికొంత లాభం వేసుకొని మార్కెట్‌లో అమ్మజూపుతాడు.

మర్కెట్‌లో తన సరుకు ఎక్కువగా అమ్ముడు పోవడానికి గాను ఉత్పత్తి వ్యయం తగ్గించి, చౌకగా సరుకు సప్లయి చేయడానికి ఉత్పత్తిదారులు ప్రయత్నిస్తారు. చౌకగా వస్తువులు ఉత్పత్తి చేయడానికి అనేక విధానాలు అవలంబిస్తారు. ఇందులో ఒకటి - ముడిపదార్థాలను చౌకగా కొనడానికి ప్రయత్నం; రెండు - కార్మికుల జీతాలు తగ్గిం చడం ; మూడు - యంత్రాల ఉపయోగం ; నాలుగు - సరుకు నాణ్యం తగ్గించడం ; అయిదు - భారీగా సరుకు ఉత్పత్తి ప్రయత్నాలు ; ఆరు - సొంతంగా దుకాణాలు పెట్టి, దుకాణా దారు వేసుకొనే లాభంకంటే తక్కువ లాభానికి అమ్మ చూపడం.

ఇన్నివిధాల ప్రయత్నించి, చౌకగా సరుకును అమ్మ జూపినా మార్కెట్ ధర అనేది అనుకూలంగా వుండక పోవచ్చు.

ఏరోజుకు ఆరోజు మార్కెట్‌లో ఏ ధరకు సరుకు అమ్ముడుపోతూ వుంటుందో దానిని మార్కెట్ ధర అంటారు.

ఇదికూడా సరుకుల సప్లయినిబట్టి, కొనేవారి సంఖ్యను బట్టి, కాలాన్నిబట్టి (సీజన్) ఆధారపడి వుంటుంది.

ఎక్కువమంది ఎక్కువ సరుకును ఎంత తక్కువ ధరకు కొంటారు అనేదానినిబట్టికూడా మార్కెట్ ధర నిర్ణయిస్తారు. కాని సప్లయిలను బట్టి, సరుకు గిరాకీనిబట్టి ఈధర పెరుగుతూ తరుగుతూ వుంటుంది.

ఇదికాక "మామూలు ధర" అనేదికూడా వుంది. మార్కెట్ ధర ఎంతవరకు పెరుగుతుంది, ఎంతవరకు తరుగుతుంది అనేదానినిబట్టి సరాసరివేసి మామూలుధర చెబుతారు. అంటే కొనేవారి సంఖ్యను, సరుకు గిరాకీని వారు పరిగణించరన్నమాట. ఉత్పత్తి వ్యయాన్ని మాత్రమే పరిగణించడం జరుగుతుంది.

ధరలు మామూలుకంటె హెచ్చినప్పుడు మార్కెట్ పెరిగిందంటారు. మామూలుకంటె ధరలు తగ్గినప్పుడు మార్కెట్ పడిపోయిందంటారు.

సరుకుల ధర పెరగడం తరగడం అనేదానికి కూడా అనేక కారణాలున్నవి.

ఫ్యాషన్‌కు మోజుపడేవారివల్ల ధరలు పెరుగుతవి. అలాగే అలవాట్లు, సాంప్రదాయాలుకూడా ధరల పెరుగుదలకు సహాయం చేస్తవి. ఉదాహరణ: లగ్నాల సమయం. "సప్లయి" లను బట్టికూడా ధర మారుతుంది. అన్నిటికంటె ముఖ్యమైనది సరుకుల కొరత. ఒక వస్తువుకు గిరాకీ

హెచ్చుగా వున్నప్పుడు దాని సప్లయి మందకొడిగా వుంటే ధర తప్పక పెరుగుతుంది.

ధరలు పెంచడానికిగాను కొందరు కావాలని కొన్ని సరుకులు ఖరీదుచేసి మార్కెట్‌లో కృత్రిమంగా వాటికి కొరతను ఏర్పరుస్తారు. దానిని "కార్నర్" చేయడం అంటారు. మనం దొంగనిల్వ చేయడం అందాం.

మార్కెట్‌లోని డబ్బు చెలామణీనిబట్టి కూడా ధరల మార్పు జరుగుతుంది. ప్రజల చేతిలో డబ్బు అదనంగా వుంటే మార్కెట్‌లో హడావిడి హెచ్చుగా వుండటం మామూలు.

ఇప్పుడు ధరలు – సప్లయిలకు సంబంధించిన ఒక ఆర్థిక సూత్రాన్ని గురించి తెలుసుకుందాం.

ఒక సరుకు ధర పెరిగినప్పుడు కొనేవారు తక్కువ కావడం, ధర తగ్గినప్పుడు కొనేవారు హెచ్చుకావడం మనకు తెలిసిన విషయమే.

అలాకాక ఒకే సరుకును కొనేవారు హెచ్చుమంది వున్నప్పుడు ధర పెరగడం, కొనేవారు తక్కువ కావడం తోనే ధర తగ్గడంకూడా మనకు తెలుసు.

అలాగే అందరికీ అవసరం వున్న కొన్ని సరుకుల ధరలు ఎప్పుడూ కొంచెం హెచ్చుగానే వుంటవి.

దీనినిబట్టి ఆర్థిక శాస్త్రజ్ఞులు సప్లయి – డిమాండు సిద్ధాంతం చేశారు. దీని సారాంశం ఇది :

(1) కొన్ని వస్తువుల ధరలు పెరిగినప్పుడు అవి తక్కువగా అమ్ముడు పోతవి; ధర తగ్గినప్పుడు హెచ్చుగా అమ్ముడు పోతవి.

(2) ఒక వస్తువు ఉపయోగం పెరిగినప్పుడు దానికి గిరాకీ తప్పక హెచ్చుతుంది.

(3) ప్రజలవద్ద హెచ్చు డబ్బు వున్నప్పుడు హెచ్చు సరుకులు కొంటారు. తక్కువ డబ్బు వుంటే తక్కువ సరుకులు కొంటారు.

(4) ధర తక్కువగా వున్నప్పుడు తక్కువ సరుకులు అమ్మజూపుతారు. ధర హెచ్చుగా వున్నప్పుడు హెచ్చు సరుకు అమ్మజూపుతారు.

## 2. డబ్బుచలామణి - కొన్ని సూత్రాలు

పనిచేసే ప్రతి ఒక్కరికి డబ్బురూపంలోనే సామాన్యంగా ప్రతిఫలం ముట్టచెపుతూ వుంటారు. గ్రామాలలో మాత్రం వ్యవసాయ కూలీలకు ధాన్యం వగైరా కొలుస్తారు.

సరుకుల మారకానికి సాధనంగా ఉపయోగపడి, వాటి ఉపయోగాన్ని తెలుసుకొనడానికి కొలతబద్దగా, సాంప్రదాయ సిద్ధంగా అందరూ ఆమోదించినదానిని "డబ్బు" (మనీ) అంటారు. సరుకుల మారకానికి కొలత బద్దగా గొర్రెలను, పొగాకును, రాగి చుట్టలను, ఉప్పు మొదలగువాటిని ఉపయోగించిన రోజు లున్నవి. అమ్మిన

సరుకుకు మూల్యంగా ప్రతి ఒక్కరూ స్వీకరించడానికి యిష్ట పడేదే "సొమ్ము."

పూర్వం వస్తువినిమయం వుండేది. ఈనాడుకూడా గ్రామాలలో చిల్లర వ్యాపారస్థులు మిర్చి వగైరాలు తీసుకొని రైతుకుటుంబాలకు కావలసిన నిత్యావాడకం సరుకులను యివ్వడం కద్దు. వస్తువులను సరాసరిగా ఇలా వినిమయం చేయడం రానురాను కష్టమైపోయింది. ఒకరికి కావలసిన సరుకుకోసం చిరకాలం వేచివుండవలసివచ్చింది. అందువల్ల డబ్బు అనేదాన్ని కనిపెట్టారు. ఈ డబ్బు అనేది ఏమిటి చేస్తుంది ? దాని ప్రత్యేకత ఏమిటి ?

ఏ ఒక వస్తువు అయినా డబ్బుగా అందరిచేత అమో దింపబడాలంటే అది మూడు రకాలైన విధులను నిర్వర్తించ వలసి వుంటుంది. (1) వస్తు మారకంలో మధ్యవర్తిగా వుండాలి. (2) విలువను కొలిచే కొలతబద్దగా ఉపయోగిం చాలి. (3) పరపతి వ్యవహారాలలో మార్పులేని ప్రమాణం కలిగి వుండాలి.

సంఘంలోనివారంతా వివిధ రకాల వస్తువులను ఉత్పత్తిచేసి వాటిని మార్కెట్‌లో అమ్ముకొని, వచ్చిన డబ్బుతో తమకు గల కోర్కెలను తీర్చుకుంటారు. కనుక డబ్బువల్ల సత్వర వ్యాపారాభివృద్ధి జరిగింది. డబ్బు అనేది లేనప్పుడు ఎవరికి కావలసిన వస్తువులను వారే తయారు చేసుకోవాలనే సంకుచిత స్వభావం వుండేది. ఇప్పుడు ఎవరి శక్తికొలది వారు భారీగా ఉత్పత్తులు కొనసాగించడానికి వీలు కలిగింది. దీనివల్ల కొనుగోలుదారులు, ఉత్పత్తిదారులు,

వ్యాపారులనే తరగతులు బయలుదేరినవి. ఈ విధంగా మారకం అనేది డబ్బువల్ల సులభసాధ్యమైంది.

ప్రతి సరుకు ఉపయోగానికి కొలతబద్దగా "డబ్బును" ఉపయోగిస్తున్నాం. డబ్బురూపంలో సరుకు "విలువ"ను తెలియజేస్తున్నాం.

ఈనాడు వర్తక వ్యాపారాలు చాలవరకు "పరపతి మీద" ఆధారపడి జరుగుతున్నవి. ఈనాడే సరకులు తీసుకొని మరొకనాడు డబ్బు చెల్లించడమే దీనికి ప్రాతిపదిక. ఈనాడు చెల్లించవలసిన "డబ్బు"కు, ఆనాడు చెల్లించగల "డబ్బు"కు మధ్య మూల్యంలో తేడారాకుండా వుండాలి. అంటే డబ్బుకు ఒక "ప్రమాణమైన విలువ" వుండాలి. ఇది నగదు వ్యాపారానికి, అప్పులతో వ్యాపారానికి అత్యవసరం.

ఇవన్నీ డబ్బు నిర్వహించే విధ్యుక్త ధర్మాలు.

ఇంక డబ్బుకు వుండవలసిన ప్రత్యేక లక్షణాలు ఏమిటి? ప్రతి వస్తువును డబ్బుగా చెలామణి చేయవచ్చునా?

1. డబ్బు అనేది అందరిచేత ఆమోదించబడాలి. అందరూ దానిని కోరాలి. ప్రభుత్వం ముద్ర వున్నదికదా అని కాకుండా, దానిలోని మూల్యాన్నిబట్టికూడా ఇది జరుగుతుంది.

2. చిరకాలం మన్నిక కలిగి వుండాలి. ఎందరు ఎంత కాలం ఎన్నిదఫాలు వాడినా తరుగు రాకూడదు. మొక్కపోరాదు. ఇలా జరిగినప్పుడు కొంతకాలానికి డబ్బుగా ఉప

యోగపడే వస్తువు నామరూపాలులేకుండా పోవడం జరుగుతుంది. ఒకప్పుడు డబ్బుగా ఉపయోగపడిన ఉప్పుకు, పొగాకుకు ఇదే జరిగింది.

3. సులభంగా వెంట తీసుకొని వెళ్ళడానికి అనువైనదిగా వుండాలి; స్వల్పమైన బరువులో అధిక మూల్యం కలిగివుండాలన్నమాట.

4. వెంటనే గుర్తుపట్టడానికి వీలుగా వుండాలి. లేకపోతే "దొంగ డబ్బు" వాడకంలోకి వస్తుంది.

5. డబ్బుగా ఉపయోగించే వస్తువు అది ఎక్కడ, ఎలా చేసి ఉపయోగించబడినా ఒకేరకమైన లక్షణాలు, నాణ్యం కలిగి వుండాలి.

6. రకరకాల "ఆకారాలలో", "విలువలలో" వుంచడానికి తగినదిగా వుండాలి. బంగారం, వెండి, రాగి మొదలగువానికి ఈ లక్షణం వుంది.

7. కొద్ది మార్పులతో చిరకాలం మనగల "విలువ" వుండాలి. ఇది చాలా ముఖ్య లక్షణం. విలువగల ఖనిజాలను డబ్బుగా ఉపయోగించడానికి కారణం ఇదే. దీనినే విలువలో స్థిరత్వం కలిగి వుండటం అంటారు.

ఇన్ని లక్షణాలు కలిగివుండి, డబ్బుకు ప్రమాణంగా వుండగలిగే అర్హత ఒక్క బంగారానికి మాత్రమే కలదని ఇంక వేరుగా చెప్పవలసిన పని లేదుకదా!

ప్రారంభదశలో బంగారాన్ని ముద్దలుగానే వుంచి, తూకంద్వారా, చెలామణి చేసుకొనేవారు. తరువాత దానిని

ప్రభుత్వాలు నాణెములుగా ముద్రించడం ప్రారంభించినవి. దీనిని "కాయినేజ్" అంటారు. నాణెములు ముద్రవేసే లేక తయారుజేసే స్థలాన్ని "మింట్" అంటారు. మనం "టంకసాల" అనుకుందాం.

వ్యక్తులు తమ యిష్టంవచ్చినంత వెండి, బంగారాలను "మింట్"ల వద్దకు తీసుకొనివెళ్ళి, నాణెములుగా ముద్రింప చేసుకొనడానికి కూడా పూర్వం అవకాశం వుండేది. దానిని "ఫ్రీకాయినేజ్" అన్నారు. దీనికి ప్రత్యామ్నాయంగా ప్రభుత్వం ఏమాత్రం రుసుము తీసుకొనని సందర్భంలో "గ్రాట్యూయిటస్" పద్ధతి అన్నారు. ముద్రణ ఖర్చులకోసం రుసుము వసూలుచేస్తే దానిని "బ్రాసేజ్" అన్నారు. అంతకన్న హెచ్చు వసూలు జరిగితే "సీనియరేజ్" అన్నారు.

ఇలా తయారైన "డబ్బు" అనేదానిలో ఎన్ని రకాలున్నవో కూడా ఈ సందర్భంలో తెలుసుకుందాం.

ప్రస్తుతం నాలుగు రకాలు చెలామణిలో వున్నవి.

ఒకటి స్టాండర్డ్ మనీ. దీనికి బంగారు నాణ్యాలు చక్కని ఉదాహరణ. ఈ నాణ్యంమీద ఎంత విలువ ముద్రించివుందో, అంతే విలువ దానిలోని బంగారాన్ని అమ్ముకున్నా వస్తుంది. ప్రతిదేశపు ద్రవ్య విధానాలకు ఇదే ప్రధాన ప్రాతిపదికగా వుంటుంది.

రెండవది రెప్రజెంటిటివ్ మనీ. దీనికి చక్కని ఉదాహరణ : రూపాయి కాగితాలు. రూపాయి కాగితాల

మీద ముద్రింపబడిన విలువమేరకు వెండి, బంగారము ప్రభుత్వము దగ్గర "గుప్త" పరచబడి వుంటుందన్నమాట. మనవద్దవున్న రూపాయ నోట్లను యిచ్చి ఆ మేరకు వెండి బంగారాలు తీసికోవచ్చు.

మూడవది క్రెడిట్ మనీ. దీనిని మనం గవర్నమెంట్ ప్రామిసరీనోటు లేదా రిజర్వుబ్యాంకి ప్రామిసరీనోటు అనుకుందాం. రూపాయి నోటుమీద వ్రాయబడిన మేరకు ఎప్పుడు అవసరంవుంటే అప్పుడు ప్రభుత్వం చెల్లించగలదని వాగ్దానం చేయడమే ఇందులో ప్రధాన సూత్రం. చెలామణిలో వున్న రూపాయి కాగితాల మొత్తం మేరకు ప్రభుత్వపు బ్యాంకివద్ద బంగారం వుండి వుంటుందన్నమాట.

నాల్గవది చిల్లరడబ్బు. అర్ధరూపాయిలు, పావలాలు, బేడలు, అణాలు, అర్ధణాలు, కానులు వగైరా లన్నీ దీనిలో చేరతవి. ఈ నాణెములు చేయబడిన ఖనిజం విలువ వీటిపై ముద్రణ విలువతో సరిసమానంగా వుండదు. అయినప్పటికీ కొన్ని చిల్లర నాణెములతో వాటి విలువమేరకు వెండి, బంగారాలను కొనవచ్చు. కనుక ప్రజలు వీటిని వాడడానికి సంకోచించరు.

"కరెన్సీ" అని, "ఇన్‌ఫ్లేషన్" అనికూడ కొన్ని పదాలు వాడుకలో వున్నవి. వీటికి అర్థం ఏమిటి ?

రూపాయి కాగితాలను "కరెన్సీ" అంటారు. కరెన్సీ ఇన్‌ఫ్లేషన్ అంటే చెలామణిలో వున్న మొత్తం రూపాయి కాగితాల విలువమేరకు వెండి బంగారం ప్రభుత్వంవద్ద నిల్వలో లేకపోవడం అన్నమాట. దీనినే ద్రవ్యోల్బణం అని

కూడా అంటున్నారు. ఆర్థికంగా చిక్కులు వచ్చినప్పుడు కొన్ని సందర్భాలలో ప్రభుత్వాలు అదనంగా కరెన్సీనోట్లు అచ్చువేసి చెలామణిలో పెట్టడం కద్దు. దీనిని ప్రింటింగ్ ప్రెస్ మనీ, ఫియట్ మనీ అంటారు.

చెలామణిలోవున్న రకరకాల "డబ్బు"ను ప్రతివారు ఆమోదించాలని ప్రభుత్వం శాసిస్తుంది. దీనినే "లీగల్ టెండర్" అంటారు.

ఇప్పుడు వెండి, బంగారం నాణెములు చెలామణిలో వున్న వనుకుందాం. ఇందులో బంగారం విలువ హెచ్చు; వెండి విలువ తక్కువ. అందువల్ల విలువ హెచ్చుగావున్న బంగారాన్ని అందరూ నిల్వ చేసుకుంటారు. విలువ తక్కువగా వున్న వెండి నాణెములు మాత్రమే ఎక్కువగా చెలామణిలో వుంటవి. ఈ విషయాన్ని "గ్రెషమ్స్" అనే ఆయన కనిపెట్టి ఒక సూత్రం చెప్పినందున దీనిని గ్రెషమ్స్ సూత్రం అన్నారు. ఒక్క మాటలో ఆయన చెప్పిన సూత్రం ఇది :—

"చెడ్డ డబ్బు, మంచి డబ్బును చెలామణిలోనుంచి గెంటివేస్తుంది."

ఈ సూత్రాన్ని వెండి, బంగారాలకు అన్వయంచేసి పైన వివరణ చేయడం జరిగింది. ఇప్పుడు పేపరు కరెన్సీకూడా చెలామణిలో వున్నప్పుడు గ్రెషమ్స్ సూత్రం పని చేస్తుందా, లేదా? అనే ప్రశ్న వస్తుంది.

ఒక దేశంలో వెండి, బంగారు నాణెములు, కరెన్సీ నోట్లుకూడా చెలామణిలో ఉన్నవనుకుందాం. గ్రెషమ్స్

సూత్రం ప్రకారం, ప్రజలు వెండి బంగారాలను తమవద్ద వుంచుకొని కరెన్సీనోట్లను మాత్రమే ఎక్కువ దఫాలు చేతులు మారుస్తారు. అంటే కరెన్సీ నోట్లు అనే "చెడ్డ డబ్బు" వెండి బంగారాలు అనే "మంచి డబ్బును" చెలామణిలో లేకుండా చేస్తుందన్నమాట. నాణెముల చెలామణిలో ఈ సూత్రాన్ని గురించి ఇంతవరకు తెలుసుకుంటే చాలు.

ప్రభుత్వ వ్యవహారాలకు చాలా డబ్బు కావలసి వుంటుంది. ఆదాయాన్ని మించి వ్యయం జరుగుతున్నప్పుడు ప్రభుత్వం అదనంగా కరెన్సీని చెలామణిలో పెట్టరాదని చాలామంది అంటారు. అంటే దేశంలో వర్తక వ్యాపారాలకు ఎంత డబ్బు అవసరమనేది ముఖ్యంగా పరిగణించాలంటారన్నమాట.

తగినంత వెండి బంగారం "రిజర్వు"లో వున్నప్పుడు కరెన్సీ "డబ్బు" ప్రభుత్వానికి చాలా సహాయకారిగా వుంటుంది. నాణెములకంటె సులభంగా తీసుకొనివెళ్ళడానికి, నిల్వ చేసుకొనడానికి వీలుగా వుంటుంది. నాణెములు ముద్రించడంవల్ల విలువగల ఖనిజాలు వృధాగా చెలామణిలో వుంటవి. రూపాయి కాగితాలవల్ల ఆ ఖనిజాలు నిల్వలో వుండటమే కాక రూపాయి కాగితాల విలువమేరకు పూర్తిగా వెండి బంగారాలను ప్రభుత్వం రిజర్వులో వుంచవలసిన అవసరం ఏర్పడదు. దీనిని ఇతరంగా పెట్టుబడి పెట్టవచ్చు. నాణెములు చెలామణిలో అరిగిపోవడం, మొక్కపోవడంవల్ల వచ్చే నష్టంకూడా వుండదు. ఇవన్నీ కరెన్సీగా డబ్బు వున్నందువల్ల లాభాలు.

## ద్రవ్య సిద్ధాంతం

వర్తక వ్యాపారాలు చక్కగా సాగుతూవుంటే ధరలు హెచ్చుగా వున్నా, వాటినిబట్టి వేతనాలు కూడా పెరుగుతవి కనక ప్రతిఒక్కరి చేతిలోనూ అదనంగా డబ్బు "మసులుతూ" వుంటుంది. అలాగే వర్తక వ్యాపారాలు దెబ్బతిని, ఆర్థికమాంద్యం ఏర్పడినప్పుడు కొనుగోలుదారుల చేతిలో డబ్బు తక్కువగా వుండి, ధరలుకూడా పడిపోవడం ప్రారంభిస్తవి.

మంచికాలంలో చెలామణిలో వుండే డబ్బు పెరిగిన కొలదీ, ప్రజలు దానిని విరివిగా ఖర్చుచేయడంవల్ల, డబ్బు విలువ సహజంగా తగ్గుతుంది. అంటే మనకు కావలసినవి కొనడానికి ఎక్కువ డబ్బు కావలసి వుంటుంది.

కనక ధరలు అనేవి, చెలామణిలోవున్న కరెన్సీ పరిమితి అనేవి దేశంలోని వర్తక వ్యాపారాల ధోరణినిబట్టి మారుతూ వుంటవన్నమాట. అంటే వర్తక వ్యాపారాలు ఎక్కువగా వుంటే డబ్బు ఎక్కువగా "చేతులు మారుతుంది." వ్యాపారం మందంగా వున్నప్పటికంటె హెచ్చు మొత్తాల అవసరం ఏర్పడుతుంది.

పై చెప్పిన విషయాలనే "క్వాంటిటీ థీరీ ఆఫ్ మనీ" అన్నారు. దీనిని మనం "ద్రవ్య సిద్ధాంతం" అనుకుందాం. సంగ్రహంగా ఈ సిద్ధాంతం ఇది.

1. ఏ దేశంలోనైనా డబ్బు విలువ, ఆ దేశంలో చెలామణిలో వున్న మొత్తం డబ్బుకు, చెలామణిలో దాని తీవ్రతకు (వెలాసిటీ) విలోమంగా మారుతూ వుంటుంది.

పరిమితమైన డబ్బు మాత్రమే చెలామణిలో వున్న ప్పుడు, ప్రతిరూపాయి విలువ హెచ్చుగా వుంటుంది.

హెచ్చు మొత్తం డబ్బు చెలామణిలో వున్నప్పుడు ప్రతిరూపాయి విలువ తక్కువగా వుంటుంది.

ఆర్థిక మాంద్యం వచ్చినప్పుడు తక్కువ మొత్తం డబ్బు చెలామణిలోవుండి, ధరలు చాలా తగ్గిపోయి ప్రతి రూపా యితో హెచ్చు సరుకులు కొనడానికి వీలుంటుంది.

ఆర్థికంగా ఒడుదుడుకులు లేనప్పుడు, హెచ్చు మొత్తం డబ్బు చెలామణిలో వుండి, ధరలు హెచ్చుగా వుండి ప్రతి రూపాయికి తక్కువ సరుకులు కొనడానికి వీలుంటుంది.

2. ప్రతి దేశంలోను ధరల సామాన్య ప్రమాణం, (లెవెల్) ఆ దేశంలో చెలామణిలోవున్న మొత్తం డబ్బుకు దాని చెలామణిలో తీవ్రతకు సరాసరిగా మారుతూ వుంటుంది.

కొద్ది మొత్తం చెలామణిలో వుంటే, ధరలు తగ్గి వుంటవి.

హెచ్చు మొత్తం చెలామణిలో వుంటే ధరలు ఎక్కు వగా వుంటవి.

ఆర్థిక మాంద్యం వచ్చినప్పుడు, ఆదాయాలు తగ్గి పోయినప్పుడు సరకుల ధరలు తగ్గడానికి ప్రయత్నిస్తవి.

ఆర్థికంగా ఒడుదుడుకులు లేనప్పుడు. ఆదాయాలు ఎక్కువగా వున్నప్పుడు, సరకుల ధరలు పెంగడానికి ప్రయత్నిస్తవి.

ఇలా ధరల హెచ్చు తగ్గులను బట్టి మార్కెట్ మారుతున్నదని అనుకుంటారు.

# 3. మార్కెట్ - దాని మంచిచెడ్డలు

ఆ సరుకులు మార్కెట్‌లో వున్నవి ; ఈ సరుకులను మార్కెట్‌లో కొన్నాను—అని మనం చెప్పుకుంటాం.

మార్కెట్ అంటే అర్థం ఏమిటి ? ఆర్థికశాస్త్రం దీనిని గురించి ఏమి చెబుతుంది ?

ఒకరకం వస్తువులను ఒకచోట అమ్ముతూ వుంటే దానిని మార్కెట్ అంటారు. ఉదాహరణ : కూరగాయల మార్కెట్. అయితే, ఇది ఎప్పుడూ వుంటుందా ? ఉదయం సాయంకాలం మాత్రమే ఈ మార్కెట్ వుంటుంది.

కనుక సరుకులు అమ్మేవారు, కొనేవారు ఏ సమయాలలో ఎక్కడ కలుసుకుంటే అక్కడే మార్కెట్ ఏర్పడుతుంది. "నా సరుకులకు మార్కెట్ వుంది" అని ఒక వ్యాపారస్థుడు చెప్పాడంటే అతని సరుకులు కొనడానికి సిద్ధంగా వున్నవారు చాలామంది వున్నారన్నమాట.

వర్తకవ్యాపారాలు అభివృద్ధి కాకపూర్వం వస్తు వినిమయం హెచ్చుగా వుండేది. తమవద్ద వున్న సరుకులు

యిచ్చి తమకు కావలసిన ఇతర సరుకులను తీసుకోనడమే సర్వ సామాన్యంగా జరిగేది. మారుమూల పల్లెలలో ఇప్పటికీ ఇది అమలులో వుంది.

ఇప్పుడు గ్రామాలనుంచి కూరగాయలు బస్తీలలోని మార్కెట్‌లకు వస్తవి. బస్తీలో కూరగాయలు కావలసిన వారు మార్కెట్‌కు వస్తారు. ఇలా చిన్నరకం మార్కెట్ సాగుతుంది. ఇది వస్తువినిమయం తరువాత దశ.

భారీగా సరుకులు ఉత్పత్తి చేసే ప్రతి వ్యాపారి, తన సరుకులకు "పెద్ద మార్కెట్" సంపాదించాలని ప్రయత్నిస్తాడు. చిన్న వ్యాపారస్థులు ఒక ప్రాంతానికి కావలసిన సరుకుల ఉత్పత్తితో సంతృప్తిపడితే, పెద్ద వ్యాపారస్థుడు దేశం, ప్రపంచం అంతటికీ కావలసినవాటిని ఉత్పత్తి చేయిస్తాడు.

కనక ప్రాంతీయ ప్రాతిపదికను బట్టి, లోకల్ మార్కెట్, నేషనల్ మార్కెట్, వరల్డు (ప్రపంచం) మార్కెట్ అని విభజన జరిగింది.

ఒక గ్రామానికి, లేదా ఒక బజారుకు మాత్రమే పరిమితమై వుండేది లోకల్ మార్కెట్ అంటారు. దానిని మనం వాడుకలో "సంత" అనుకుంటూ వుంటాం. పెద్ద పెద్ద నగరాలలో బజారు కొక మార్కెట్ వుంటుంది.

ఒక దేశం సరిహద్దులలోపల వుండేవారందరికీ సరుకులు సప్లయి పరిమితమై వుంటే, దానిని నేషనల్ మార్కెట్ అంటారు. దీనినే దేశీయ మార్కెట్ అనడం కద్దు. ఇక్కడ దేశం అవసరాలను మాత్రమే పరిగణిస్తారు.

అన్ని దేశాల సరుకులు, అన్ని ఇతర దేశాలలో అమ్ముడు పోవడాన్ని ప్రపంచపు మార్కెట్ అంటారు. కొన్ని సరుకులకు ప్రపంచపు మార్కెట్ వున్నదంటారు. అంటే ఆ సరుకు అన్ని దేశాలవారికి కావలసి వున్నదన్న మాట. కార్లు, సబ్బులు, వస్త్రాలు, రేడియోలు ఈ తరగతికి చెందినవి.

ఇంక మార్కెట్‌ను కంట్రోల్ చేయడాన్ని గురించి తెలుసుకుందాం.

మామూలుగా రెండురకాలుగా మార్కెట్ సాగుతున్నదంటారు.

ఒకటి పోటీమార్కెట్, రెండు గుత్తవ్యాపారం మార్కెట్.

ఎవరికి కావలసిన సరుకులను వారు "బేరం" ఆడుకొని ఏదో ఒక ధరకు కొనడానికి కావలసిన అవకాశాలు వుంటే పోటీ మార్కెట్ అంటారు. అంటే ఈ సరుకు ఆయన ఎంతకు కొన్నాడు, ఆ దుకాణదారు ఎంతకు అమ్ముతున్నాడు అనే యోచన వున్నా ఎక్కడికక్కడ ఎవరికివారికి ధర నిర్ణయం కావడమే పోటీమార్కెట్ అంటారు.

మార్కెట్‌లోని వ్యాపారస్థులంతా కలిసి వివిధసరుకుల ధరలను నిర్ణయించుకొని, చిల్లరగాను, టోకుగాను అదే ధరలకు అమ్మకం సాగిస్తే గుత్తవ్యాపారం మార్కెట్ అంటారు. దాని ప్రకారం ధరలు విపరీతంగా వుండకపోయినా, ప్రజలు "బేరం" ఆడటానికి అవకాశం వుండదు. అయితే వ్యాపారస్థులంతా కలిసి ఒక మాటకు రాలేనప్పుడు పోటీ మార్కెట్ జరుగుతుంది.

మార్కెట్‌లో చిల్లరవర్తకం, టోకువర్తకం జరుగుతూ వుంటుంది. ఆచరణలో వాటికి అర్థం ఏమిటి ?

ఒక వస్తువు మనం వాడుకోనడానికి అనువుగా తయారు కావడానికి ముందు పెక్కుమంది చేతులు మారుతుంది.

ఉదాహరణకు ఒక బీరువాను తీసుకుందాం. అడవిలో కలపను కొట్టించి, అమ్మకం చేసేవారు ఒకరు. దానిని కోయించి చెక్కగా చేయించేవారు మరొకరు. చెక్కలను చెక్కి వస్తురూపంగా అమర్పించేవారు ఇంకొకరు. దీనిని మార్కెటులో అమ్మకంచేసేది తదితరులు. వీరందరినీ "మధ్య దళారులు" అన్నారు.

మనందరికి తెలిసిన మధ్యదళారి చిల్లరవర్తకుడు. కాని టోకువర్తకుడు, కమీషన్ వ్యాపారి, జట్టీ వ్యాపారి అనే వారుకూడా మనకు తెలిసినవారే.

ఇంతమంది ఏమిటి చేస్తారు ? వ్యాపారంలో వీరిఅవసరం ఏమిటి ? వీరివలన మనకు కలిగే సహాయం ఏమిటి ?

గ్రామాలలో వుండేవారికి వీరి అవసరం అంతే కన్పించదు. కాని రేషన్ షాపులు, ధాన్యసేకరణ, కంట్రోల్ సరుకుల అమ్మకం అనేవి వచ్చినప్పుడు మధ్యదళారుల అవసరం గ్రామాలలో కూడా ఏర్పడుతుంది.

ఈ మధ్యదళారులు చేసే పనులలో ముఖ్యమయినవి:—

ఉత్పత్తిదారునుంచి మార్కెట్‌కు, అక్కడనుంచి కొనుగోలుదారులకు సరుకులను చేర్చడం.

ముందుగా సరుకులు కొని తగిన పెట్టుబడులు పెట్టడం.

వస్తువుల అమ్మకంలో రకరకాలుగా ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయడం. అమ్మకం లేనప్పుడు సరుకును భద్రంగా నిల్వచేసి, అదునులో కావలసినవారికి సప్లయి చేయడం.

ఇన్ని రకాల బాధ్యతలు తీసుకున్నందుకు ఫలితంగా మధ్యదళారులు "లాభాలు వేసుకొని" సరుకును అమ్ముతారు. సరుకుల ధరలలో వీరి లాభాలు ఒక భాగంగా వుంటవి.

ఇంక టోకువర్తకులు కూడా పెద్ద తరగతి మధ్య దళారులని చెప్పవచ్చు.

ఉత్పత్తిదారునుంచి ఏకమొత్తంగా సరుకులు కొని, చిల్లరవర్తకులకు దఫాలవారీగా ఆ సరుకులను సప్లయిచేసే వారిని టోకువర్తకులు అంటారు.

చిల్లర వర్తకులను టోకు వర్తకులను సాధ్యమైనంతగా తొలగించి, ఉత్పత్తిదారులే స్వయంగా సరుకులు అమ్మించ డానికి పూనుకోవడం కద్దు. దీనిని "చెయిన్ స్టోరు" పద్ధతి అంటారు. ఒకే వ్యాపారి, అనేకచోట్ల గొలుసుకట్టుగా స్వంత దుకాణాలు పెట్టిస్తాడన్నమాట.

ఉత్పత్తిదారుతో సరాసరి కంట్రాక్టు చేసుకొని, ఎక్కువ లాభం వేసుకొని సరుకులు అమ్మజూపడానికి జరిగే ఏర్పాటు "డిపార్టుమెంటు స్టోరు" అన్నారు.

ఇన్ని పద్ధతులు అమలుజరిగినా మధ్యదళారు లనే వారిని పూర్తిగా తొలగించడం సాధ్యం కాలేదు.

ఇంక సహకారోద్యమ వ్యాప్తితో మధ్యదళారులను పూర్తిగా తొలగించడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

ఉత్పత్తిదారుల సహకార సంఘాలు, కొనుగోలు దారుల సహకార సంఘాలు ప్రభుత్వం ఆదరణ పొందుతూ అభివృద్ధి చెందుతున్నవి.

స్వీడన్, ఇంగ్లాండు, ఫిన్లెండు, స్కాట్లండు, డెన్మార్కు వంటి దేశాలలో సహకారోద్యమ వ్యాప్తి చాలా హెచ్చుగా జరిగింది.

వీటన్నింటి ప్రధానలక్ష్యం ఒక్కటే. చౌకగా సరుకుల సప్లయి ; అందరికీ లాభాల పంపిణీ.

# 4. అంతర్జాతీయ వ్యాపారం

ఒక వ్యక్తి తయారుచేసిన సరుకులు మరొక వ్యక్తికి ఎలా అవసరం కాగలవో, ఒక ప్రాంతంలో ఉత్పత్తి చేయ బడిన వస్తువులు మరొక ప్రాంతంవారికి కావలసివస్తవి.

ఇతరులకు వున్న సరుకులనే మనం కూడా ఎందుకు కొనరాదు అనే కోర్కె వ్యక్తులకు వుండటంవల్లనే వర్తకం, వాణిజ్యం అభివృద్ధి చెందినవి. ఒక సరుకును అమ్మడం, కొనడం, లేక మారకం వేయడాన్ని వ్యాపారం అంటారు. ఈ వ్యాపారం రెండు రకాలు. ఒకటి : దేశీయ వ్యాపారం. రెండు : విదేశీయ వ్యాపారం.

దేశంలోనే ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతంవారితో జరిగే వ్యాపారాన్ని దేశీయ వ్యాపారం అంటారు. ఉదాహరణ: ఉత్తరాది గోధుమలు దక్షిణ భారత దేశానికి రవాణా.

ఒక దేశంవారు మరొక దేశంతో వ్యాపారం చేయడాన్ని విదేశీయ వ్యాపారం అంటారు. దీనినే అంతర్జాతీయ వ్యాపారం అని కూడా అంటారు. ఉదాహరణ: బర్మా బియ్యం ఇండియాకు సప్లయి.

ఒక దేశంతో మరొక దేశం వ్యాపారం చేస్తున్నదంటే, ఈ రెండు దేశాల ప్రభుత్వాలు మాత్రమే వ్యాపారం చేసుకుంటున్నవని అర్థం కాదు. ఒక దేశంలోని వ్యక్తులు, కంపెనీలు మరొక దేశంలో తమకు కావలసిన సరుకులను కొనడంకూడా అంతర్జాతీయ వ్యాపారమే.

ఈనాడు అంతర్జాతీయ వ్యాపారానికి ప్రాధాన్యం చాలా హెచ్చుగా వుంది. కొన్ని జాతుల "బ్రతుకు" ఇతర జాతుల "ఉత్పత్తుల" మీాద ఆధారపడి వుంటున్నది. దీనికి కారణం ఏమిటి?

కొన్ని జాతులు, కొన్ని సరుకులను ఇతర జాతులకంటె చౌకగాను త్వరగాను ఉత్పత్తిచేయగల శక్తిని కలిగివుండటమే దీనికి కారణం. శీతోష్ణస్థితి, సహజసంపదలు, ప్రజల వైజ్ఞానిక శక్తినిబట్టి ఈ పరిస్థితి ఏర్పడుతున్నది. అందువల్లనే కొన్ని దేశాలవారు కొన్ని సరుకులను మాత్రమే ఉత్పత్తి చేసుకొనగల శక్తిని కలిగివుండి, మరికొన్ని సరుకులకోసం ఇతరులమీాద ఆధారపడవలసి వస్తున్నది. ఈ కారణంగా అంతర్జాతీయ వ్యాపారాభివృద్ధి జరిగింది.

విదేశీయ వ్యాపారం సందర్భంలోనే "ఎగుమతులు" "దిగుమతులు" అని అంటూవుంటారు. వీటిని గురించికూడా ఆర్థిక శాస్త్రం ఏమి చెబుతుందో చూద్దాం.

ఒక దేశం పరాయి దేశానికి పంపించేవన్నీ "ఎగుమతులు." ప్రతి దేశం కూడా తాను అదనంగా ఉత్పత్తిచేసే సరుకులను విదేశాలకు పంపిస్తుంది. ఉదాహరణకు అమెరికా గోధుమలు, మోటారు కార్లు, ముడిపత్తి ఎగుమతి చేయడం.

తాను ఉత్పత్తి చేయలేని సరుకులను, తగినంతగా సప్లయిలో లేని సరుకులను ప్రతి దేశం "దిగుమతి" చేసుకుంటుంది. ఇతర దేశాలలో పరాయిదేశాలు కొనే సరుకులన్నీ దిగుమతుల క్రిందనే జమకడతారు. ఉదాహరణ: శిల్కు, కాఫీ, పువ్వులు, పొగాకు, చెరకు మొదలగువానిని అమెరికా దిగుమతి చేసుకోనడం.

ప్రతివస్తువులోనూ స్వయంపోషకంగా వుండి సుఖంగా బ్రతుకుతున్న దేశం ఈనాడు ఎక్కడా లేదు. ఆధునిక నాగరికత, ఏ ఒక్క దేశాన్ని ఆర్థికంగా స్వయంపోషకం చేయడంలేదు. కనక ప్రతిదేశంలోని ప్రజల కష్టసుఖాలు, అభివృద్ధి, ఆ దేశపు ఎగుమతులు దిగుమతులమీద ముఖ్యంగా ఆధారపడి వుంటున్నది.

విదేశ వాణిజ్యం అన్నప్పుడు దేశాలమధ్య సరుకుల వ్యాపారం మాత్రమే నని ఇప్పటివరకు అనుకున్నాం. కాని మరితరాలుకూడా దానిలో చేరతవి.

అసలు విదేశ వాణిజ్యం రెండు రకాలుగా జరుగుతుం దంటారు. ఒకటి: కనిపించే సరుకులద్వారా. రెండు: కనిపించని ఖర్చులద్వారా.

ఒక దేశంనుంచి మరొక దేశానికి జరిగే ఎగుమతులను, దిగుమతులను కనిపించే సరుకులు అంటారు. వీటిని కట్టు దిట్టం చేయవచ్చు. కాతాలలో జమాఖర్చులు తీయవచ్చు.

ఇంక ఒక దేశంనుంచి మరొక దేశానికి జరిగే వ్యక్తుల రాకపోకలు, వారు చేసే ఖర్చులు వగైరా లన్నీ కనిపించని ఖర్చులకింద పరిగణిస్తారు.

ఉదాహరణకు మనలో కొందరు అమెరికా వెళ్ళారు అనుకుందాం. వీరు విదేశ నౌకలమీద, విమానాలమీద ప్రయాణం చేశారు. వాటికి డబ్బు ఖర్చుపెట్టారు. అమెరి కాలో సొంత ఖర్చులు చేశారు. ఇవన్నీ ఆ దేశానికి చెందిన దిగుమతులకిందనే లెఖ్ఖవేస్తారు.

పరదేశాలలో విదేశీయుల పెట్టుబడికూడా "ఎగు మతి" చేయబడిన సరుకుకిందనే జమ. ఇలా ఇన్సూరెన్సులు, వడ్డీలు, డివిడెండులు, బహుమతులు, రాకపోకల ఖర్చులు వగైరా లన్నీ "కనిపించని సరుకుల" కింద చేరినవే.

విదేశ వ్యాపారంలో, తమకు నష్టం వచ్చిందని, లేదా లాభం వచ్చిందని మన ప్రభుత్వం ప్రకటనలు చేస్తూ వుంటుంది. ఇక్కడ లాభనష్టాలు అంటే అర్థం ఏమిటి?

ఏ ఒక్క సంవత్సరంలోనైనా ఒక దేశం అది ఎగుమతి చేసిన సరుకుల విలువకంటె దిగుమతి చేసుకున్న సరుకుల

విలువ తక్కువగా వున్నప్పుడు, ఆ సంవత్సరంలో ఆ దేశానికి విదేశవ్యాపారంలో లాభం వచ్చిందంటారు.

దిగుమతుల విలువ, ఎగుమతులను మించిపోయినప్పుడు విదేశ వ్యాపారం నష్టదాయకం అంటారు.

విదేశ వ్యాపారంలో లాభం వచ్చిన దేశానికి సకల సంపదలు చేకూరగలవని, వెండి, బంగారాలు నిల్వలో హెచ్చుగా వుండగలవనే వాదనకూడా వుంది.

అయితే ఒక దేశానికి వెండి, బంగారాలు హెచ్చుగా వచ్చి చేరడంతోనే ద్రవ్యసిద్ధాంతం ప్రకారం దేశంలో ధరలు హెచ్చిపోవడం కద్దు. అందువల్ల విదేశస్థులు ఆ దేశంనుంచి తక్కువగా సరుకులు కొనడం జరుగుతుంది.

కనక ధరలు హెచ్చుగావున్న దేశంలో విదేశాలు సరుకులు అమ్మడం లాభదాయకమేగాని, అక్కడ సరుకులు కొనడం స్వదేశానికి నష్టాన్ని ఆహ్వానించడమే కాగలదు.

అంతర్జాతీయంగా లాభదాయకమైన వ్యాపారాలు చేసే దేశాలు ఎక్కువగా వెండి, బంగారాలను నిల్వచేయడం జరిగినా, దానిని మూల వుంచడం నష్టదాయకమే కాగలదు. కనక లాభం రాగల పనులకు ఆ నిల్వలు ఉపయోగించక తప్పదు. ఇలా చేయనప్పుడు విదేశాలకు ఎక్కువగా సరుకులు అమ్మే దేశమే చివరకు తానే ఇతర దేశాలనుంచి సరుకులు కొనవలసిన స్థితికి వస్తుంది.

కనక ఒకప్పుడు విపరీతంగా సరుకులు అమ్మజూపే దేశం కొంతకాలానికి తానే విపరీతంగా విదేశ సరుకుల

గుమతికి పూనుకుంటుంది. అందువల్ల అంతర్జాతీయ వ్యాపారం "యిచ్చి-పుచ్చుకొనే" ప్రాతిపదికపై జరుగుతుంది. అంటే ప్రతి దేశం తన ఎగుమతులను, దిగుమతులను కొంతవరకైనా సరిపెట్టుకుంటూ పోవడానికి ప్రయత్నించాలి.

ఇంతవరకు విదేశవ్యాపారంలో లాభనష్టాలు-వాటి ఫలితాలను గురించి తెలుసుకున్నాం. ఇంక విదేశ వ్యాపారంలో 'కాతాలలెక్కలు" ఎలా తేల్చుకొంటారో చూద్దాం.

విదేశ వ్యాపారంలో "డబ్బు" చెల్లగట్టుకొనడానికి 1) నగదు (2) సరుకుల మారకం (3) మారకం బిల్లులు వాడతారు.

బొంబాయిలోని ఒక వర్తకుడు లండన్‌లోని ఒక కంపెనీకి వెయ్యి రూపాయల సరుకు పంపించాడనుకుందాం. దానికిగాను లండన్ వర్తకుడు వెయ్యి రూపాయల విలువగల బంగారం పంపవచ్చు. దీనిని నగదు వ్యాపారం అంటారు.

బొంబాయి వర్తకుడు పంపించిన వస్త్రాలు తీసుకొని, లండన్ వర్తకుడు వాటి విలువకు సరిపోవు మోటారుకారు సామాన్లు పంపించాడనుకుందాం. దీనిని సరుకుల మారకం అన్నారు.

లండన్ వర్తకుడు తాను చెల్లించవలసిన సొమ్మును ఆ దేశంలోని బ్యాంకిలో బొంబాయి వర్తకుని పేర చెల్లగట్టాడనుకుందాం. ఇండియాలో వర్తకుడు ఆ మొత్తాన్ని ఆ బ్యాంకి "బ్రాంచి" నుంచి తీసుకున్నాడనుకుందాం. ఇలా జరిగే దీనిని మారకం బిల్లుల వ్యాపారం అంటారు.

అనేక దేశాలు డబ్బుగా అనేక రకాల కరెన్సీని వాడతవి. ఒక దేశం కరెన్సీ మరొక దేశంలో చెల్లదు. అందువల్ల "మారకం రేటు" అనేది అమలులోనికి వచ్చింది.

మారకం రేటు అంటే ఏమిటో కూడా సూక్ష్మంగా తెలుసుకోనడం అవసరం. పైన చెప్పిన లండన్ వర్తకుడు బొంబాయి వర్తకునికి రెండు వేల రూపాయల బంగారం పంపించడానికి మరొక రెండు రూపాయలు అదనంగా ఖర్చు అవుతుందనుకుందాం. మారకం బిల్లుల పద్ధతిలో బంగారం సరాసరిగా పంపనవసరం లేదు. కనక ఈ అదనపు ఖర్చు తప్పుతుంది.

అయితే ఈ మారకం బిల్లుల రేటు—దానినే మారకం రేటు అంటారు——ఎప్పుడూ ఒకేవిధంగా వుండదు. బిల్లుల సప్లయి డిమాండులనుబట్టి, వాటి రేటు మారుతుంది. అయితే ఏలాంటి పరిస్థితులలోనూ పైన చెప్పిన రెండు రూపాయల కంటె పెరగదు; తరగదు. పెరగడం అంటూ జరిగితే సరాసరిగా బంగారం పంపించడమే లాభదాయకంగా వుంటుంది.

ఒక దేశపు ఎగుమతులు, దిగుమతులు దానితో వ్యాపారంచేసే మరొక దేశం ఎగుమతులు, దిగుమతులతో సరిసమానంగా వున్నప్పుడు ఆ రెండు దేశాల మధ్య మారకం రేటులో మార్పు వుండదు.

కాని, దేశాలలోని ఆర్థిక, సాంఘిక రాజకీయ పరిస్థితులనుబట్టి మారకం రేటులలో మార్పులు వుండడమనేది తరుచుగాను సహజంగాను జరుగుతున్నది.

దిగుమతికి పూనుకుంటుంది. అందువల్ల అంతర్జాతీయ వ్యాపారం "యిచ్చి-పుచ్చుకొనే" ప్రాతిపదికపై జరుగుతుంది. అంటే ప్రతిదేశం తన ఎగుమతులను, దిగుమతులను కొంతవరకైనా సరిపెట్టుకుంటూ పోవడానికి ప్రయత్నించాలి.

ఇంతవరకు విదేశవ్యాపారంలో లాభనష్టాలు-వాటి ఫలితాలను గురించి తెలుసుకున్నాం. ఇంక విదేశ వ్యాపారంలో "కాతాలలెక్కలు" ఎలా తేల్చుకొంటారో చూద్దాం.

విదేశ వ్యాపారంలో "డబ్బు" చెల్లగట్టుకొనడానికి (1) నగదు (2) సరుకుల మారకం (3) మారకం బిల్లులు వాడతారు.

బొంబాయిలోని ఒక వర్తకుడు లండన్‌లోని ఒక కంపెనీకి వెయ్యి రూపాయల సరుకు పంపించాడనుకుందాం. దానికిగాను లండన్ వర్తకుడు వెయ్యి రూపాయల విలువగల బంగారం పంపవచ్చు. దీనిని నగదు వ్యాపారం అంటారు.

బొంబాయి వర్తకుడు పంపించిన వస్త్రాలు తీసుకొని, లండన్ వర్తకుడు వాటి విలువకు సరిపోవు మోటారుకారు పనిముట్లు పంపించాడనుకుందాం. దీనిని సరుకుల మారకం అన్నారు.

లండన్ వర్తకుడు తాను చెల్లించవలసిన సొమ్మును ఆ దేశంలోని బ్యాంకిలో బొంబాయి వర్తకుని పేర చెల్లగట్టాడనుకుందాం. ఇండియాలో వర్తకుడు ఆ మొత్తాన్ని ఆ బ్యాంకి "బ్రాంచి" నుంచి తీసుకున్నాడనుకుందాం. ఇలా జరిగే దీనిని మారకం బిల్లుల వ్యాపారం అంటారు.

అనేక దేశాలు డబ్బుగా అనేక రకాల కరెన్సీని వాడతవి. ఒక దేశం కరెన్సీ మరొక దేశంలో చెల్లదు. అందువల్ల "మారకం రేటు" అనేది అమలులోనికి వచ్చింది.

మారకం రేటు అంటే ఏమిటో కూడా సూక్ష్మంగా తెలుసుకొనడం అవసరం. పైన చెప్పిన లండన్ వర్తకుడు బొంబాయి వర్తకునికి రెండు వేల రూపాయల బంగారం పంపించడానికి మరొక రెండు రూపాయలు అదనంగా ఖర్చు అవుతుందనుకుందాం. మారకం బిల్లుల పద్ధతిలో బంగారం సరాసరిగా పంపనవసరం లేదు. కనక ఈ అదనపు ఖర్చు తప్పుతుంది.

అయితే ఈ మారకం బిల్లుల రేటు—దానినే మారకం రేటు అంటారు——ఎప్పుడూ ఒకేవిధంగా వుండదు. బిల్లుల సప్లయి డిమాండులనుబట్టి, వాటి రేటు మారుతుంది. అయితే ఏలాంటి పరిస్థితులలోనూ పైన చెప్పిన రెండు రూపాయల కంటె పెరగదు; తరగదు. పెరగడం అంటూ జరిగితే సరాసరిగా బంగారం పంపించడమే లాభదాయకంగా వుంటుంది.

ఒక దేశపు ఎగుమతులు, దిగుమతులు దానితో వ్యాపారంచేసే మరొక దేశం ఎగుమతులు, దిగుమతులతో సరిసమానంగా వున్నప్పుడు ఆ రెండు దేశాల మధ్య మారకం రేటులో మార్పు వుండదు.

కాని, దేశాలలోని ఆర్థిక, సాంఘిక రాజకీయ పరిస్థితులనుబట్టి మారకం రేటులలో మార్పులు వుండడమనేది తరచుగాను సహజంగాను జరుగుతున్నది.

# 1. పరపతి - పుట్టుపూర్వోత్తరాలు

పూర్వకాలంలో డబ్బు అంటే ఏమిటి అని ఎవరైనా ప్రశ్నిస్తే ఒక బంగారు నాణెమో, లేక వెండి రూపాయో చూపించేవారు. వాటిని కరిగించి యిష్టంవచ్చిన సొమ్ములు చేయించుకొనడానికి కూడా అవి వీలుగా వుండేవి.

ఈనాడు మనం చూపించడానికి బంగారు నాణెములు లేవు. ప్రపంచం అంతటా బంగారు నాణెములను ద్రవ్యంగా వాడడం మానివేశారు. ఇప్పుడు వెండిరూపాయలు, రాగి కానులు చూపించవచ్చు. వాటిని మాత్రం వెనకటివలె కరిగించి, కావలసిన సొమ్ములు చేయించుకొనడానికి వీలు పడదు. ఈ నాణెములు కేవలం "చిల్లరగా" మాత్రమే ఉపయోగిస్తున్నాం.

ఇప్పుడు అంకెలువేసిన కాగితాల ప్రాబల్యం హెచ్చుగా వుంది. వీటిని రూపాయల నోట్లూ, బ్యాంకి చెక్కులు, నగదు బిల్లులు అని అంటున్నారు. వీనిలో అంకెలకే హెచ్చు ప్రాధాన్యం.

మీకు బ్యాంకిలో వెయ్యి రూపాయలు నిల్వ వుంది. నీ బ్యాంకి పుస్తకంలోని చెక్కులో సంతకంచేసి, రు 900 అని వ్రాస్తే, ఆ చెక్కుకూడా "డబ్బు"గా చెలామణి అవుతుంది.

"డబ్బు" నిర్వహించే ప్రధానపాత్ర ఏమంటే సరుకులు-సర్వీసులను విలువకట్టే కొలతబద్దగా ఉపయోగపడటం.

"డబ్బుగా" పరిగణింపబడు ఆధునికమైన ఏర్పాట్లన్నీ సరుకులు – సర్వీసులు చేతులు మారడానికి ఉపకరించేవి మాత్రమే. డబ్బుద్వారా సరుకులు – సర్వీసులలో కదలిక పుట్టినప్పుడు ఆ డబ్బు నిరుపయోగం అవుతుంది.

మనకు హఠాత్తుగా లక్ష రూపాయలు వచ్చిన వనుకొనండి. అవిచూసి ఇంక మనం పనిచేయడం దేనికి విశ్రాంతి తీసుకుందామని భావిస్తాం. అలాగే చేస్తాం. అంటే ఎవరు చేయవలసిన పని వారు చేయరన్నమాట. దీని ఫలితం ఏమిటి? ప్రతివారికి కావలసినవి మార్కెట్‌లో లభ్యంకావు. అంటే సంఘానికి కావలసిన సరుకులు ఉత్పత్తికావు. డబ్బులో విలువకడితే మనమంతా లక్షాధికారులమే? కాని, తినడానికి మాత్రం ఏమీ వుండదు. డబ్బుగల లక్షాధికారి తిండిలేని భిక్షాధికారిగా వుంటాడు.

డబ్బుగలవారు ఇలా ప్రజల కొనుగోలుశక్తిని తగ్గింపచేసే విధంగా ప్రవర్తిస్తారన్నమాట. అలా ప్రజలు సరుకులు కొనడం తగ్గిస్తే, సరుకుల చెలామణీ తగ్గుతుంది. నిరుద్యోగం పెరుగుతుంది. కొంతమందివద్ద బంగారం, నగలు, భూములు, పొలాలు, ఇండ్లు వుంటవి. వీటివల్ల కడుపు నిండదుగా!

కనక ఈరోజుల్లో "డబ్బు" "ద్రవ్యం" అనే దానిలో "అంకెల ప్రాధాన్యం" హెచ్చు. ద్రవ్యం చేతులు మారనప్పుడు ఆ అంకెల ప్రాధాన్యం కనిపించదు. కనక ద్రవ్యం అంటే "చేతులు మారే అంకెలు" అని మనం చెప్పుకోవచ్చు. ఈ అంకెలు ఎంత త్వరగా కదిలితే అన్ని

సరుకులు హెచ్చుగా ఉత్పత్తి అవుతవి. అంత ఎక్కువమందికి పని దొరుకుతుంది. హెచ్చుమంది సుఖపడతారు. ఎంత తక్కువగా కదిలితే అంత ఎక్కువ దౌర్భాగ్యం కలుగుతుంది. ఏమిటీ విపరీతం?

ఒక గ్రామంలో వంద కుటుంబా లున్న వనుకుందాం. వీరంతా వడ్లు మాత్రమే పండిస్తారు. దానినే ఆహారంగా వాడుకుంటారు. ఈ కుటుంబాలవా రంతా పొలాలలో పని చేసిన రోజులకు, ఒక్కొక్క చీటీ చొప్పున ఆ గ్రామాధికారి యిస్తూ వుంటాడు. ఇలా రెండువేల చీటీలు యిచ్చాడు.

పంటల మాసూలు అయిన తరువాత వెయ్యి బస్తాల వడ్లు గిడ్డంగిలో నిల్వచేశారు. వంద కుటుంబాలవారివద్ద రెండువేల చీట్లు వున్నవి. అంటే ఒక్కొక్క చీటీకి అరబస్తా చొప్పున వస్తవి. ప్రతి ఒక్కరూ తమ చీట్లు చూపించి, గ్రామాధికారినుంచి వడ్లు తీసుకుంటారు. ఇంతవరకు అంతా సవ్యంగా జరిగింది.

అంటే అధికోత్పత్తి జరగలేదు; కొందరికి పనిలేక పోవడం అనేది లేదు. ఉత్పత్తిచేసిన వడ్లు అంతా తీసుకొన డానికి తగినన్ని చీట్లు వున్నవి. కనక ధరల హెచ్చుతగ్గుల ప్రసక్తి రాలేదు.

ఈ చీట్లను "ద్రవ్యం" అనుకుందాం. ఇంతవరకు ఈ ద్రవ్యంతో ఎలాంటి చిక్కులు రాలేదు.

అయితే కొన్ని కుటుంబాలవారు కొంత ద్రవ్యం నిల్వ చేసుకొనదలచారు. తమదగ్గర వున్న చీటీలు కొన్ని దాచివుంచారు. అప్పు డేమౌతుంది?

అంటే పండిన వడ్లల్లో కొంత తమకు కావాలనే వారు తగ్గిపోతారు. వారివాటా గిడ్డంగిలో వుండిపోతుంది. చివరకు తుప్పుపట్టి ఆ వడ్లు ఎందుకూ పనికిరాకుండా పోయినవి.

అంతేకాదు. ఆ ఏడాది వడ్లు కావాలని కోరేవారు తగ్గిపోయారు. కనక వచ్చే ఏడాది తక్కువ ఎకరాలలో పంట పండిద్దామని గ్రామాధికారి తలంచాడు. దీని ఫలితంగా కొందరికి పనిలేకుండా పోయింది. గ్రామంలో కొందరు కటకట పడవలసి వచ్చింది. ఇది చూచి, ఇతరులు కూడా తమ ముందుగతి ఏమి కానున్నదో అని, ధాన్యం కొంతగానైనా నిల్వ చేసుకొనడానికి ప్రయత్నించారు. ఇలా నిల్వచేసుకొనేవారు పెరిగినకొలది, గ్రామాధికారి క్రమక్రమంగా పంటలు పండించడం తగ్గింపజేశాడు. దానితో తినేవారు ఎక్కువ కావడం, పండించే పంట తక్కువ కావడం. చీటీలు తీసుకొని, వాటిమీద ధాన్యం పుచ్చుకొనేవారు తరిగిపోవడం జరిగింది. అలా చీటీలు నిల్వచేసుకున్న వారు, ముందు సంవత్సరాలలో వాటితో ధాన్యం తీసుకొన డానికి తగినన్ని నిల్వలు లేకపోయినవి.

కనక "ద్రవ్యం" అనేది చెలామణి కాకుండా ఒక మూల పాతరవేస్తే సంఘంలో ఇలా అనేక చిక్కులు ఏర్పడత వన్నమాట.

మన దేశం అంతా ఒక గ్రామం అనుకుందాం. దానిలో కొన్ని కోట్లమంది వున్నారు. ఒక్క వరిపంట మాత్రమే కాక అనేక రకాల పంటలు వారు పండిస్తున్నారు. ధాన్యంవలె వీటిని గిడ్డంగిలో వుంచక మార్కెట్‌కు తీసుకుని పోతున్నారు.

ఇలా జరగక ఎక్కడి పంటలు అక్కడ నిల్వలో వుండిపోతే ధరలు తగ్గిపోతవి. సరుకుల నిల్వలు పెరిగిపోయి అనేక మందికి పనిలేని స్థితి వస్తుంది. ఈ స్థితిని ఆర్థిక మాంద్యం అంటారు.

అయితే మనకు కావలసిన సరుకులు కొనడానికి డబ్బు ఎక్కడనుంచి వస్తుంది ? పొలంలో పని చేసినప్పుడు గ్రామాధికారి చీటీ యిచ్చాడు. అంటే ఉత్పత్తిలో మనం కూడా పాల్గొంటే మనకూ డబ్బు వస్తుంది. దానిని కూలి, వేతనం, వడ్డీ, డివిడెండు, లాభం అని రకరకాల పేర్లతో పిలుస్తారు.

వస్తువు తయారు చేయడానికి అయిన ఖర్చు, దానిని తయారు చేయించిన అధికారి వేసుకొనే లాభం కలుపుకొనగా ఆ వస్తువుధర వస్తుంది. ఇందులో తయారు చేయడానికి అయిన ఖర్చును ఉత్పత్తి వ్యయం అంటారు. మిగిలిన దానిలో కార్మికులకు యిచ్చే కూలి, ఉద్యోగులకు యిచ్చే జీతాలు, పెట్టుబడులు పెట్టినవారికి చెల్లించే వడ్డీ చేరివుంటవి.

సరుకులు తయారు చేయడానికి కూలీలు, ఉద్యోగులు, పనిముట్లు మాత్రమే కాక ముడిసరుకులుకూడా కావాలి. ఉదాహరణకు : బొగ్గు, ఇనుము, నూనె వగైరా. వీటికి చెల్లించే డబ్బుకూడా కూలీ, జీతం, లాభం, వడ్డీల రూపంలో కొందరికి ముడుతుంది.

ఇలా దేశంలో ఉత్పత్తి జరిగిన సరుకులకు వివిధ వర్గాలకు చెల్లించబడిన మొత్తం సొమ్ము ఆ సరుకుల మొత్తం ధరకు సరిసమానంగా తప్పకుండా వుంటుంది.

ఇందులో వివిధవర్గాలకు ముట్టిన సొమ్మును, వెంటనే ఖర్చుచేయడానికి వారు పూనుకుంటే, వారు ఉత్పత్తిచేసిన సరుకులన్నీ అమ్ముడుపోవడం, తిరిగి ఉత్పత్తి కార్యక్రమం— అంటే అందరికి పని—ప్రారంభం కావడం జరుగుతుంది.

ఒకవేళ కార్మికుడు తన కూలీలో కొంత, ఉద్యోగి తన జీతంలో కొంత, షావుకారు తన లాభంలో కొంత— ఖర్చుచేయకుండా వుంటే ఏమిటి జరుగుతుంది? నిర్ణీతమైన ధరలకు సరుకులను కొనేవారిలో కొందరు తగ్గిపోతారు. సరుకులు చాలా నిల్వలోవుంటవి. వాటిని వెంటనే అమ్మివేయడానికి ముందు ధరలు తగ్గించి, ఆ తరువాత వాటి ఉత్పత్తిని తగ్గిస్తారు. అంటే కొంతమందికి పని లేకుండా పోతుందన్నమాట.

అయితే సొమ్ము కుదువపెట్టడం మంచిది కాదా?—

## 2. అప్పు - ఆదా

మనం ఆదాచేసిన సొమ్మును మరొకరికి ఖర్చుపెట్టడానికి ఇవ్వడంద్వారా ఎంత సొమ్మునైనా నిల్వచేయవచ్చు. దీనిలో ఎలాంటి అనుమానాలకు తావులేదు. దీనినే పెట్టుబడి పెట్టడం అంటారు. ఇది ఎవరు ఎలా చేస్తారు?

మనం ఆదాచేసుకొన్న సొమ్మును ఇతరులు ఖర్చుచేయడాన్నే పెట్టుబడి అంటారు. దీని కిటుకు తెలుసుకొనడానికి ఒక ఉదాహరణ తీసుకుందాం.

ఒకడు తన సంపాదననుంచి వంద రూపాయలు ఆదాచేసుకున్నాడు. ఈ వంద రూపాయలను పెట్టెలోపెట్టి తాళం

వేశాడు. అంటే చెలామణిలో వున్న డబ్బులో నూరు రూపాయలు తొక్కిపట్టా డన్నమాట. ఇలా కాకుండా దానిని పెట్టుబడిగా పెట్టవచ్చు. అంటే ఆ సొమ్మును ఒక బ్యాంకికి యివ్వవచ్చు. ఆ బ్యాంకి మన సొమ్మును ఇతరులకు అప్పుగా యిస్తుంది. ఒక రైతుకు వందరూపాయలు అప్పుగా యిచ్చిం దనుకుందాం. ఆ రైతు ఒక బస్తీకి వెళ్ళి తనకు కావలసినవన్నీ కొని, ఈ వంద ఖర్చు చేస్తాడు. ఇలాగా మనం నిల్వచేసిన రూపాయలు తిరిగి చెలామణిలోకి వస్తవి.

ఇలా కొందరి సొమ్మును బ్యాంకి సేకరించి ఒక ఫ్యాక్టరీ నిర్మాతకు అప్పు యిచ్చిందనుకోండి. ఆ ఫ్యాక్టరీ నిర్మాణం చేసినవారికి బ్యాంకి అప్పుగా యిచ్చిన సొమ్ము ముడుతుంది. ఫ్యాక్టరీ ప్రారంభించడంతో అనేకమందికి దానిలో పని దొరుకుతుంది.

ఒకరి నిల్వలు తీసుకొనకుండానే బ్యాంకి కూడా అప్పులు పెడుతుంది. అంటే తాను సంపాదించిన లాభాలను, నిల్వలను, మూలధనాన్ని కూడా మార్కెట్‌లో అప్పు కింద అది యిస్తుంది.

ఇలాగా రైళ్ళు, రోడ్లు, తపాలా సౌకర్యాలు, వంతెనలు, ఫ్యాక్టరీలు, పరిశ్రమల నిర్మాణం కొనసాగుతుంది.

అందరూ తమ సంపాదనను నిల్వచేసి, పెట్టెలో పెట్టుకున్నా రనుకోండి. పెట్టెలో సొమ్ము బయటకు తీయక పోవడంవల్ల దేశ ఆర్థికవ్యవస్థ చిన్నాభిన్నమై పోతుంది.

కనక "ద్రవ్యం" అనే దానిని సక్రమంగా వినియోగించుకోవాలి. ఎప్పుడైనా సరే ఆదే ఎక్కువగా

నిల్వచేసి పాతర వేసినా ప్రయోజనం లేదు. తక్కువగా సంపాదించి ఎక్కువగా ఖర్చుపెట్టుకున్నా ప్రమాదమే. దీనిలో రహస్యం ఏమిటి? ఎందరు నిరుద్యోగులుగా వున్నారో చూస్తే ఈ ప్రమాదం ఎంతో బోధపడుతుంది. సోమరిపోతులను కూడా సోమరిగా వుండే ద్రవ్యంకింద లెక్కవేస్తారు.

కనక డబ్బును పాతర వేయకూడదు. పెట్టుబడిగా పెట్టాలి. సరే పెట్టుబడిగా పెట్టడానికి చేతులో ఏమీ లేదు. నిల్వవున్నది తీసుకొనేవారు లేరు అనుకుందాం. అప్పుడు ఏమి జరుగుతుంది?

మనం మన డబ్బును బ్యాంకికి యిస్తాం. ఆ బ్యాంకి వీటిని నిల్వచేస్తుంది; కొత్తపనులు ప్రారంభించేవారు వుండరు. బ్యాంకి కొట్లలల్లో డబ్బు మూలుగుతుంది. అంటే ఆదా చేసిన సొమ్ము "స్తంభించి"పోయి వుందన్నమాట. దానిని పెట్టుబడిగా తీసుకొనేవారు లేరన్నమాట. అప్పుడు ఆర్థిక దుస్థితి వచ్చిందంటారు. పని చేయదలచినవారికి పని వుండదు. నిల్వలోవున్న సొమ్ము ఉపయోగించే అవకాశాలు కనిపించవు.

బ్యాంకీలలో నిల్వచేసుకొనడం కాకుండా మరొక తరహా పెట్టుబడి వుంది. దానిని స్టాక్ మార్కెట్ వ్యాపారం అంటారు. ఇది ఒక జూదంవంటిదే. నిజమైన పెట్టుబడి పెట్టవలసిన తరహాకు చెందినది కాదు. దీనివల్ల కొందరు గుమస్తాలు, బ్రోకర్లకు పనికలుగుతుందేకాని ఎక్కువమందికి పని చూపించదు. చివరకు ఈ మార్కెట్ కూడా డబ్బును పాతర వేస్తుంది. అదెలా జరుగుతుం దంటారా?

రామయ్యదగ్గర పుల్లయ్యా, ఆయనదగ్గర ఎల్లయ్యా, ఈయనదగ్గర తిరిగి రామయ్యా స్టాక్ మార్కెట్‌లో, నోటి మాటలతో "సర్టిఫికేట్లు" చేతులు మార్చుకుంటారు. అంటే సరుకుల చెలామణి, అది చేతులు మారడం అంటూ వుండదు. కాని, అంకెలు చేతులుమారి విలువ పెద్దదిగా కనిపిస్తుంది. దీనినే మనవాళ్లు కొంపలు తీసుకొనే వ్యాపారం అంటారు.

ఇక మరొక తరహా పెట్టుబడి. నోట్లు వ్రాసుకొనడం ద్వారా వస్తుంది.

ఒకరు పాడిగేదెను కొనడానికి మనదగ్గర వంద రూపాయలు తీసుకొని నోటు వ్రాసియిచ్చారు. ఇందులో డబ్బు యిచ్చినవాడు ఋణదాత; తీసుకొన్నవాడు బాకీదారు. కనక మనం నిల్వచేసుకున్న డబ్బు పెట్టుబడిగా పెట్టినప్పుడు మరొకరి ఋణంగా మారిపోతుంది.

ఈ "పెట్టుబడి — అప్పు" వ్యవహారంలో రెండు మినహాయింపు లున్నాయి. మనం సంపాదించుకున్న సొమ్ముతో ఒక యిల్లు కట్టుకున్నామనుకుందాం. దానిని అప్పుగా పరిగణించడానికి వీలులేదు. పూర్వపు రోజుల్లో ఇలాగే జరిగేది. సొమ్ము మిగిలితే భూములు కొనేవారు; నగలు చేయించుకొనేవారు. ఇప్పుడో, నిల్వచేసుకున్న డబ్బును బ్యాంకీలలో దాస్తున్నారు. భీమాకంపెనీలకు ప్రీమియంలుగా ముట్టజెబుతున్నారు. గృహనిర్మాణ సహకార సంస్థలకు అప్పు పెడుతున్నారు. పెక్కు పరిశ్రమలలో వాటాలు కొంటున్నారు. అంటే ఆదాచేసిన సొమ్మును పాతరవేసి నిరుపయోగం చేయక మరొకరిద్వారా చెలామణిలోకి తెస్తు

న్నారన్నమాట. దీనినే "పరపతి పెంపుదల" పద్ధతి అంటు న్నారు. దీనినుంచే బాండులు, తనఖాలు, షేర్లు అనేవి కూడా ఏర్పడినవి.

ఇప్పుడు వెనక చెప్పిన గ్రామం సంగతిని ఉదాహరణగా తీసుకుని వీటివ్యవహారం తెలుసుకుందాం.

ఆ వ్యవసాయక గ్రామంలోనివారు కష్టపడి పనిచేసిన రోజుల తాలూకు చీట్లు కొన్ని దాచుకొనడంద్వారా కొన్ని చిక్కులు తెలుసుకున్నాం. అయితే ఈ చిక్కులు రాకుండా చేసుకొనగల ఉపాయం ఒకటి వుంది. అదేమంటే కొంత మంది ఈ ఏడాదే ఎక్కువధాన్యం కావాలని గ్రామాధికారిని కోరతారనుకొనండి. వచ్చే ఏడాది వాటిని తిరిగి యిస్తామని పూచీ యిస్తారుకూడా. అప్పుడు ఎలాంటి చిక్కులు రాకుండా ధాన్యాన్ని పంపిణీ చేయవచ్చు. ఎలాగంటే...

ఉదాహరణకు కొంతమంది తాము దాచుకొన్న 100 చీట్లను, ప్రస్తుతం అదనంగా ధాన్యం కావలసివారికి అప్పుగా యిచ్చారనుకుందాం. వచ్చే ఏడాదికి "వడ్డీగా" మరి అయిదు చీట్లు చేర్చి యిస్తామని పూచీ యిచ్చారు. అంటే చీట్లు కూడబెట్టినవారు 100 చీట్లు "పెట్టుబడిగా" పెట్టారు. వీటిని బదులు తీసుకొన్నవారు నూరు చీట్లు "అప్పు" చేశారన్నమాట. అప్పుచేసినవారు ఆ చీట్లను ఉపయోగించి, ధాన్యం తెచ్చుకుంటారు. గిడ్డంగిలో ధాన్యం నిలవలో వుండదు. తిరిగి యథాప్రకారం ఉత్పత్తి కొనసాగుతుంది.

ఈ ఏడాది అప్పు చేసినవారు వచ్చే ఏడాదికి అదనంగా పని చేసి చీట్లు సంపాదింపవలసి ఉంటుంది. పంటల మాసూలు నాటికి వీరు 200 చీట్లు సంపాదించారనుకొందాం; తమ ఈ అదనపు సంపాదననుంచి అప్పు తీర్చివేస్తారు.

ఇంకా మిగిలినదానితో జీవనం గడుపుతారు. ఒక వేళ చేతిలో నిల్వ లేకపోయినా, అదనంగా కష్టించిన ఫలితంగా అప్పును తీర్చివేసికొన గలిగారన్న మాట. గత ఏడాది పొదుపు జేసుకొన్నవారు, ఈ ఏడాది మరింత అదనంగా ధాన్యం తీసుకొనగలుగుతారు. అయినప్పటికీ గ్రామాధికారి ఉత్పత్తిలో తరుగుదలకాని పెరుగుదలకాని చేయవలసిన అవసరం ఏర్పడదు.

ఈ విధంగా ఎలాంటి చిక్కులు లేకుండా ఆ గ్రామస్థులలో "పొదుపరితనం – పెట్టుబడి – అప్పు – వడ్డీ" అనేవి ఏర్పడినవి. ఈ సందర్భంలో రెండు ముఖ్య సూత్రాలను గుర్తుంచుకోవలసి వుంటుంది :—

(1) పొదుపు చేసిన సొమ్మును వెంటనే ఎవరికో ఒకరికి అప్పుగా యివ్వాలి. (2) అప్పు యిచ్చిన సొమ్ము చేతికి వచ్చిన వెంటనే అది మరొకరికి పెట్టుబడిగా పోవాలి.

ఈ రెండు సూత్రాలు అమలు జరిగినంతవరకు ఆధునిక ద్రవ్య విధానంలో ఎలాంటి చిక్కులు రావు. "పొదుపరితనం – పెట్టుబడి – అప్పు – వడ్డీ"ల రూపంలో డబ్బు చెలామణి అవడంతో సంఘానికి కొత్త కొత్త ఫ్యాక్టరీలు, రోడ్లు, వగైరాలు సమకూరగలవు. ఆర్థిక యంత్రం ఇలాగా పని చేసుకుంటూ పోతుంది.

ఈ ఆర్థిక యంత్రం కొన్ని సందర్భాలలో స్తంభించి పోవడానికి ఈ కింది కారణాలను చెబుతారు. (1) సహజ సంపదల కొరత (2) జనాభా పెరుగుదల (3) లాభసాటిగా పెట్టుబడులు పెట్టడానికి అవకాశం లేకపోవడం (4) తక్కువ పెట్టుబడుల నిష్ప్రయోజనం (5) నూతన పరిశ్రమలకు అవరోధాలు.

అన్నింటికంటె ముఖ్యమైనది – ఆదాయంలో హెచ్చు పొదుపు చేసుకొనడానికి వీలులేని సాంఘిక వ్యవస్థ.

ఈ అవరోధాలు తొలగించడానికి ఈకింది సూచనలు జరుగుతున్నవి :—

(1) వ్యక్తిగత వ్యాపారాభివృద్ధి (2) సరుకుల ధరలు తగ్గింపు (3) పన్నులు తగ్గింపు (4) సాంఘిక సేవా కార్యక్రమాలను ప్రభుత్వం ఎక్కువగా అమలుపరచడం.

ఆర్థిక యంత్రం నిరాఘాటంగా నడవడానికి అసలు ఆ యంత్రం పనిచేసే విధానాలు తెలుసుకొనడంతో, దాని లోపాల సవరణ సులభమని ఆధునిక ఆర్థిక శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

# 3. పరపతి - దాని వివిధ రూపాలు

ఒక దుకాణదారునివద్ద మనకు కావలసిన సరుకులు తీసుకొని, వాని డబ్బు ఆ తర్వాత చెల్లగట్టగలమని వాగ్దానం చేయడాన్ని "అరువు" పద్ధతి అంటారు. ఈనాడు ప్రతి

దేశంలోనూ వర్తక వ్యాపారాలు ఎక్కువగా ఈ పద్ధతిలోనే జరుగుతున్నవి. దీనికి కారణం ఏమిటి?

చాలామందికి పొదుపుచేసుకోనడం తెలియదు. కనుక అప్పులు చేస్తారని కొందరి వాదన.

నగదు చెల్లించి కొనడంలో కంటె అరువుకాతాకింద సరుకుల వాడకంలో హెచ్చు "తృప్తి" పొందవచ్చునని, అనేక కోర్కెలను సులభంగా "తీర్చు" కొన వచ్చునని మరి కొందరి వాదన.

డబ్బు చేతిలోకి వచ్చేదాకా వేచి వుండవలసిన అవసరం లేకుండా సరుకులు కొని వాడుకొనడానికి కలుగుతున్న అవకాశమే అరువుకాతా పద్ధతి, దానినే పరపతి అని కూడా అంటారు.

అత్యవసర పరిస్థితులలో కాక మిగతా సందర్భాలలో అరువుగా సరుకులు కొనడం అనేది, అప్పు చెల్లించగల తాహతుమీద ఆధారపడి వుంటుంది. జీవనోపాధి కొనసాగిస్తూ వాయిదాలుగా అప్పు మొత్తాన్ని చెల్లగట్టగలగడమే "పరపతి"కి ప్రధాన ప్రాతిపదిక. అంటే "అప్పు పెట్టేవానిని ఆకర్షించడం," "అప్పు తీసుకొనే వాడు విశ్వసనీయుడుగా వుండడం" అత్యవసరం. "వాడు మాట అంటే చాలు నోటు ఎందుకు" అని మనవారు అంటూ వుంటారు. దాని అర్థం ఇదే.

పెద్ద పెద్ద వ్యాపారసంస్థలలో అప్పు పెట్టడానికి ముందు "సెక్యూరిటీ" కోరడం కద్దు. దీనినే మనవారు "పూచీ

యివ్వడం" "తాకట్టు పెట్టడం" అంటారు. కొన్ని సందర్భాలలో "ఒక మిత్రుని సంతకం" లేదా "మాట" అయినా దీనికి సరిపోతుంది.

అరువు బేరాలు అనేక రకాలుగా సాగుతూవుంటాయి.

అవసరమైన సరుకులకు వెంటనే నగదు చెల్లించలేని స్థితి వున్నప్పుడే అరువుఖాతాను వాటిని కొనడానికి ఎవరైనా ప్రయత్నిస్తారు. కొంతమందివద్ద డబ్బు వుండికూడా అప్పు చేస్తారు. సొంతడబ్బును మొత్తంగా పెట్టుబడికి వినియోగించి అప్పులను నెలసరి వాయిదాలమీద చెల్లగడుతూ వుంటారు. కనక అప్పులఖాతా కాక, వాయిదాల బేరం అనేది కూడా ఈ నాడు అమలులో వుంది.

ఒక రేడియో ఖరీదు అయిదువందల రూపాయలు అనుకుందాం. అప్పుల ఖాతాకింద అయితే, ఒక దమ్మిడీ అయినా యివ్వకుండా ఖాతా పుస్తకంమీద సంతకంచేసి, రేడియో తెచ్చుకొని ఆ తరువాత డబ్బు చెల్లగట్టవచ్చు.

ఇంక వాయిదాలబేరంలో అయితే ముందు కొంత సొమ్ము చెల్లించాలి. మిగిలినది నెలసరిగా ఇంత అని, కొన్ని నెలలలో వడ్డీతో సహా చెల్లించవలసి వుంటుంది. యూరపులోనూ, అమెరికాలోను, మోటారు కార్లు, గృహోపకరణాలు, రేడియోల వ్యాపారం చాలవరకు ఇలా వాయిదాల బేరంగా సాగుతున్నది.

అరువు ఖాతా, వాయిదా బేరం కాక మరికొన్ని రకాల అప్పులు కూడా అమలులో వున్నవి.

ఒకడు సొంతంగా సరుకులుకొని, తరువాత సొమ్ము చెల్లించగలమని చెప్పినా, బ్యాంకినుంచి అప్పుచేసి వాడు కున్నా, దానిని వ్యక్తిగతమైన అప్పు లేక సొంత అప్పు అంటారు.

కొంత వడ్డీతో కొన్నిసంవత్సరాల తరువాత అప్పు తీర్చగలనని, ప్రభుత్వం బాండులను నోట్లను జారీచేసి అప్పు తీసుకొనడాన్ని గవర్నమెంటు అప్పు అంటారు.

మనం ఆదా చేసుకున్న సొమ్మును నమ్మకం కలిగిన ఒక బ్యాంకిలో దాచుకున్న సందర్భంలో దానిని బ్యాంకి అప్పు అంటారు. మనం కోరినప్పుడు కోరిన మొత్తాన్ని ముట్టచెప్పడంమీదనే బ్యాంకీల పేరు ప్రతిష్ఠలు ఆధారపడి వున్నవి.

వర్తక వ్యాపారాలలో చాలమంది బ్యాంకీలనుంచి అప్పులు తీసుకుంటారు. డబ్బు లేకుండా బ్యాంకి చెక్కులతో వ్యాపారం నడుపుతారు. దీనిని కమ్మర్షియల్ అప్పు అంటారు.

వర్తక వ్యాపార సంస్థలు, తమ కంపెనీల అభివృద్ధికి గాను ప్రభుత్వానికివలెనే, బాండులు, నోట్లు డిబెంచర్లు వగైరాలతో సొమ్ము అప్పుతీసుకుంటవి. దీనిని పారిశ్రామికపు (ఇండస్ట్రియల్) అప్పు అంటారు.

తనఖాలు పెట్టించుకొని, తనఖాలు అవసరం లేకుండానుకూడా రైతులకు వ్యవసాయపు పనులకు కావలసిన సొమ్ము అప్పుగా యివ్వడం మనకు తెలుసు. దానిని వ్యవసాయపు అప్పు అన్నారు.

పైన చెప్పిన "అప్పులు" పుట్టనివారంతా చేరి ఒక యూనియన్ ఏర్పరచుకుంటారు. ఉపాధ్యాయులు, రైల్వే కూలీలు వగైరాలు, ముఖ్యంగా ఈ యూనియన్‌లు ఏర్పాటు చేసుకుంటారు. మన ప్రాంతాలలో వీటిని "చిట్ ఫండ్" అని, చీటికట్టడం అని అంటారు. పదిమంది పదేసి రూపాయలు ఒకచోట చేర్చి, ఎక్కువ అవసరం వున్నవారికి ఆ మొత్తాన్ని కొంత వడ్డీతో అప్పుగా యివ్వడమే దీనిలో ప్రధాన సూత్రం. వీటిని ఆర్థికశాస్త్రం "క్రెడిట్ యూనియన్స్" అంటుంది.

రకరకాల అప్పులను గురించి తెలుసుకున్న తరువాత, "అప్పుల చెలామణి" ఉపయోగించే వివిధరకాల "బిల్లు" లను గురించి తెలుసుకోవలసి వుంది.

ఒకే దుకాణంలో సంవత్సరం పొడుగునా మనం అప్పు తెస్తూ వున్నప్పుడు "నెలసరి కాతా" పద్ధతి అమలు జరుగుతుంది. నెలకొకసారి "అప్పుబిల్లు" చెల్లగట్టాలన్న మాట. ఇలాంటి దానిని "చార్జిడ్ అకౌంటు" అన్నారు.

సొమ్ము నిల్వవున్న బ్యాంకివారికి ఫలానావారికి ఇంత సొమ్ము యివ్వమని చీటివ్రాసి పంపడం మరొక పద్ధతి. దీనిని "చెక్" పద్ధతి అన్నారు. వీటిలోనే డ్రాఫ్టులు, ఎక్స్ఛేంజి బిల్లులుకూడా చేరతవి.

ఇంతకాలంలో ఇంత సొమ్మును యివ్వగలననే వాగ్దానంతో సంతకం చేసియిచ్చిన దానిని "నోటు" అంటారు. ఇవి రెండు రకాలు. కాలపరిమితినిబట్టి వున్నవి

ఒక రకం; చీటీరకం రెండవది. చీటీని చూపిన వెంటనే సొమ్ము చెల్లించవలసి వుంటుందన్నమాట. ఇవన్నీ పరస్పరం నమ్మకం, విశ్వాసం అనే వాటిమీద ఆధారపడినవే.

# ✓4. బ్యాంకులు - వాటి నిర్వహణ

వర్తక వ్యాపారాలు చేసేవారు, డబ్బు కలవారు, ఉద్యోగస్తులు, ఈ రోజులలో ఎక్కువగా బ్యాంకులమీద ఆధారపడుతున్నారు.

అసలు బ్యాంకి అంటే ఏమిటి? అది ఏమిటి చేస్తుంది? వీటిలో ఎన్ని రకా లున్నవి? వడ్డీ వ్యాపారస్తునికి, దీనికి భేదం ఏమిటి? అనే విషయాలను గురించి తెలిసివుండటం ఈరోజుల్లో చాలా అవసరం.

బ్యాంకిని కూడా ఒక రకమైన షావుకారుకింద జమ కట్టవచ్చు. నమ్మకం, విశ్వాసం, అడిగినప్పుడు సొమ్ము చెల్లించడం అనేవి బ్యాంకింగ్‌లో ప్రధాన సూత్రాలు.

ప్రతి బ్యాంకి రెండు పనులు నిర్వహిస్తుంది. ఒకటి: డిపాజిట్లు తీసుకోవడం, రెండు: అప్పులుపెట్టి వ్యాపారం నడిపించడం.

రోజువారీ ఖర్చులు, అత్యవసర ఖర్చులు పోను, అదనంగా డబ్బు మిగిలివున్నవారందరికీ బ్యాంకులలో ఖాతా

వుంటున్నది. అంటే తన అదనపు డబ్బును కోరినప్పుడు తీసుకొనడానికి వీలుగా ఒక బ్యాంకిలో డిపాజిట్ చేస్తాడన్న మాట.

ఈ డిపాజిట్‌లు రెండు రకాలు.

ఇష్టం వచ్చినప్పుడు తీసుకొనడానికి అనువుగా డిపాజిట్ చేస్తే దానిని డిమాండ్ డిపాజిట్ అంటారు.

కొంతకాలంవరకు సొమ్ము అవసరం రాదనే పూచీతో డిపాజిట్ చేసిన మొత్తాన్ని టైమ్ డిపాజిట్ అంటారు.

ఈ రెండు రకాల డిపాజిట్లద్వారా ప్రజలవద్దవున్న అదనపు డబ్బు బ్యాంకులకు చేరుతుంది.

పూర్వపు రోజుల్లో దొంగల భయంవల్ల బ్యాంకులలో సొమ్ము దాచుకొనేవారు. ఇలా దాచిపెట్టినందుకు బ్యాంకులకే కొంత సొమ్ము యిచ్చేవారు. కాని ఈనాడు డిపాజిట్ చేసినవారికి — అందులోనూ టైమ్ డిపాజిట్‌లు చేసినవారికి మాత్రమే—బ్యాంకులవారే వడ్డీ చెల్లిస్తున్నారు.

అయితే ఈ డిపాజిట్ సొమ్మును బ్యాంకులు ఏమి చేస్తవి ? దీనిమీద సంపాదన ఏమైనా వుంటుందా ?

డిమాండు డిపాజిట్ల సొమ్ము ఏరోజుకు ఆ రోజే కావలసి రావచ్చు. అందువల్ల టైమ్ డిపాజిట్ల సొమ్మును ఇతరులకు అప్పులు పెడుతూ వుంటారు. దీనిమీద వడ్డీకూడా తీసు కుంటారు.

ఒకరు మోటారుకార్ల వ్యాపారం చేస్తున్నారు. కారు సామానులు కొనడానికి అయిదు వేల రూపాయలు అవసరంగా కావలసివచ్చింది. వెంటనే తనను విశ్వసించే బ్యాంకివద్దకు పోయి అప్పు కావాలని కోరాడు. వారు తగిన పూచీలు తీసుకొని ఈయనకు అప్పు పెట్టారు. ఆ బ్యాంకి నూటికి ఆరు రూపాయలు వడ్డీ తీసుకుంటున్నదనుకుందాం. మూడు నెలలలో ఈ సొమ్ము తిరిగి యిచ్చివేయగలనని వాగ్దానం చేసినందున ఆ వడ్డీని మినహాయించుకొని 4925 రూపాయలను యిస్తారు.

ఇలా ముందుగానే వడ్డీ మినహాయించుకోవడాన్ని "డిస్కౌంట్" అంటారు.

ఇందులో గమనించవలసిన మరొక విషయం ఏమంటే ఈ డబ్బును నగదుగాకూడా ఆ బ్యాంకి యివ్వదు. ఈయన ఆ సొమ్మును తమవద్ద డిపాజిట్ చేసినట్లు వ్రాసి, చెక్కు పుస్తకాలు యిస్తారు. అంటే ఈ సొమ్ము మేరకు తాను చెల్లించవలసిన బిల్లులను చెల్లగట్టడానికి అవకాశం కలిగిస్తారన్నమాట.

ఈ విధంగా బ్యాంకులు వ్యాపారం చేస్తవి:

తన డిపాజిటర్లందరికీ చెల్లించడానికి కావలసిన సొమ్మును నగదు రూపంలో ఎక్కువగా బ్యాంకులు నిల్వ చేయవు. కాని డిపాజిటర్ల రోజువారి సరాసరి వాడకం మేరకు సొమ్ము నిల్వలో వుండాలని ప్రభుత్వం శాసనం చేసింది. దీనినే రిజర్వు నిధి అంటారు. ప్రతి బ్యాంకికి ప్రభుత్వం బ్యాంకిలో (అదే రిజర్వుబ్యాంకి) ఒక కాతా వుండి, కొంత

సొమ్మును సెక్యూరిటీల రూపంలో వుంచుతారు. వీటితో రిజర్వుబ్యాంకి కూడా వ్యాపారం నడుపుతుంది.

ఇక్కడ మరొక అనుమానం రావచ్చు. ప్రతి బ్యాంకి ప్రతి ఒక్కరికీ అప్పులు పెడుతుందా? విశ్వాసం, నమ్మకం, అడిగినప్పుడు సొమ్ము చెల్లించడం అనేవి బ్యాంకులు నడపడంలో ప్రధాన సూత్రాలని ముందే తెలుసుకున్నాం.

ప్రస్తుతం అనేక రకాల బ్యాంకు లున్నవి. వీటిని ముఖ్యంగా నాలుగు రకాలకింద జమకట్టవచ్చు.

(1) కమ్మర్షియల్ బ్యాంకులు :— వీటిని మనం వ్యాపారపు బ్యాంకులు అనుకుందాం. వ్యక్తులకు వ్యాపార సంస్థలకు ఇవి సహాయం చేస్తవి. వారి డిపాజిట్లు తీసుకోనడం, అప్పులు పెట్టడం, వారి చెక్కులకు సొమ్ము యివ్వడం మొదలగు పనులద్వారా ఇవి సహాయం చేస్తవి.

(2) సేవింగ్సు బ్యాంకులు :— పొదుపరితనాన్ని పెంపొందించడానికి, దీర్ఘకాలిక ఋణాలు పెట్టడానికి యివి ప్రయత్నిస్తవి. చిన్న మొత్తాలు డిపాజిట్ చేయడాన్ని ప్రోత్సహించి వడ్డీలు చెల్లిస్తవి. మామూలుగా ఈ బ్యాంకులు తమ డిపాజిట్లను బాండుల రూపంలోనూ, తనఖాలుగానూ వుంచి, వీటిమీాద వచ్చే లాభాలను డిపాజిటర్లకు వడ్డీగా చెల్లిస్తవి.

(3) ట్రస్టు కంపెనీలు :— కొందరు వ్యక్తులు, లేదా ఎస్టేట్లకు ట్రస్టీలుగా పనిచేయాలని శాసనంద్వారా ఆదేశించ

బడతవి. ఇవి కూడా ఆ వ్యక్తులు లేదా ఎస్టేట్ల సొమ్మును వ్యాపారానికి వినియోగిస్తూ చివరకు కమ్మర్షియల్ బ్యాంకులుగా మార్పు చెందడం కద్దు.

(4) ఇన్వెస్టుమెంట్ బ్యాంకులు :— పెద్ద పెద్ద వ్యాపార సంస్థలు, పురపాలక సంఘాలు, రాష్ట్ర ప్రభుత్వాల బాండులను, స్టాకులను అమ్మిపెట్టడం వీటి పని. ఈ విధంగా ఆయా సంస్థలకు కావలసిన ఆర్థిక సహాయం సమకూర్చిపెడతవి.

ఇన్ని రకాల బ్యాంకులు వ్యాపారం చేస్తున్నప్పుడు, ప్రతిరోజూ ఏ బ్యాంకి ఎంత వ్యాపారం చేసింది లెక్క తీయడం కష్టం. ఒక బ్యాంకి చెక్కు మరొక బ్యాంకిలో "క్యాష్" కావడం (సొమ్ము చెల్లించడం) కద్దు. ఈ చిక్కులన్నీ ఏ రోజు కారోజు పరిష్కారం చేసుకొనడానికి ప్రతి నగరంలోను "క్లియరింగ్ హౌస్" ఏర్పాటు చేస్తారు.

నగరంలో వున్న బ్యాంకుల ప్రతినిధు లందరూ సాయంకాలం ఒకచోట సమావేశమై, ఏ బ్యాంకి చెక్కులు ఎవరికి, ఎంత మొత్తానికి వచ్చిందీ నిల్వ తీస్తారు. తరువాత ఎవరు ఎవరికి యివ్వవలసివుంటే వారికి సొమ్మును "చెక్"ల ద్వారా ముట్టచెప్పుకుంటారు.

ప్రతి ఒక్కరు తమ డబ్బును ఒక బ్యాంకిలో డిపాజిట్ చేయడానికి ముందు, ఆ బ్యాంకి ఆర్థికస్థితిని, మార్కెట్లో దానికి గల పలుకుబడిని తెలుసుకొనడానికి ప్రయత్నిస్తారు. ప్రతి బ్యాంకి కూడా తన ఆర్థిక ప్రతిపత్తిని గురించి కొన్ని

రోజుల కొక పర్యాయం ప్రకటన చేయాలని ప్రభుత్వాలు శాసనాలు చేసినవి. ఈ ప్రకటనను "బ్యాంక్ స్టేట్ మెంట్" అంటారు. . బ్యాంకి ఆస్తులు, అప్పులు, దాని నేటి ఆర్థికస్థితి వివరంగా దానిలో పేర్కొనబడి వుంటుంది.

# 1. బ్రతుకుతెరువు - పలురకాలు

ఆర్థికశాస్త్రంలో పంపిణీ అంటే దేశంలోని సంపదలను, ఆదాయాలను ప్రజలందరూ పంచుకోవడం అని అర్థం. మొత్తం సరుకులలో మనకు చెందే వాటాల నిర్ణయం అని కూడా దీనిని వివరించి చెప్పడం కద్దు. ఒకరికి నెలకు రెండువేల రూపాయల జీతం. సొంత ఇల్లు వుంది. బ్యాంకిలో కాతా వుంది. ఇన్సూరెన్సు ఏర్పాట్లు చేసుకున్నాడు. ఇవన్నీ చేరి ఆతని వాటాగా పరిగణిస్తారు.

ఉత్పత్తికి సంబంధించిన విషయాలను గురించి చర్చించిన సందర్భంలో నాలుగు ప్రధానాంశాలను గుర్తించాం. ఒకటి ఆస్థి, రెండు కృషి, మూడు పెట్టుబడి, నాలుగు వ్యవహార నిర్వాహణ. వీటిని ఉత్పాదకశక్తులు అంటారు.

ఈ నాలుగు ఉత్పాదక శక్తులమీద వచ్చే ప్రతిఫలాన్ని గురించి తెలుసుకొనడమే పంపిణీకి సంబంధించిన సమస్యలను తెలుసుకొనడం కాగలదు.

ఆస్తిమీద వచ్చే ప్రతిఫలాన్ని "అద్దె" లేక "కౌలు." కష్టం మీద వచ్చే ప్రతిఫలాన్ని "కూలి" అని, పెట్టుబడిమీద వచ్చేది "వడ్డీ" అని అంటారు. ఇక వ్యవహార నిర్వాహణవల్ల వచ్చినది "లాభం" క్రింద జమకడతారు.

"అద్దె-కూలి-వడ్డీ-లాభం" కింద సంఘంలో ఎవరికి ఎంత భాగం ముడుతుంది అనేది చాలా ముఖ్య విషయం. అదీగాక దేశసంపదలో ఎవరికి ఎంత భాగం అని కాక పై

నాలుగు రూపాలలో ఎవరికి ఏమాత్రం ముడుతుందనేదే మనం చూడాలి.

ఆస్తికి సంబంధించిన ఆదాయాలు ముందు పరిశీలిద్దాం:—

ఒకరికి సంబంధించిన పొలం లేదా భవనాలను మరొకరు వాడుకుని, అందుకు ప్రతిఫలంగా చెల్లించేది కౌలు (రెంటు) అంటారు. ఇది డబ్బురూపంలో నైనా కావచ్చు, పాలుభాగంగా నైనా వుండవచ్చు. భూమిబలం, రైతు వ్యవసాయం చేసిన పద్ధతి, ఫలసాయాన్ని అమ్ముకొనడానికి అందుబాటులో మార్కెట్ వుండటం మొదలగు వాటిమీద "రెంటు" ఆధారపడి వుంటుంది.

ఒక కుటుంబానికి వ్యవసాయంమీద రెండువేల రూపాయలు ఆదాయం వచ్చిందనుకుందాం. వ్యవసాయం ఖర్చులు తదితరాలు పదిహేనువంద లని అంచనా వేద్దాం. కనక ఖర్చు పోను అయిదువందలు ఆ కుటుంబానికి లాభమన్న మాట. ఈ రకం "కౌలును" ఎకనామిక్ రెంట్ అన్నారు.

మరొక కుటుంబానికి ఒక గ్రామానికి సమీపంలో మూడు ఎకరాల భూమి ఉంది. దీనిలో నారింజతోట వేశారు. దీనిమీద సాలుకు రెండువేలు ఎకనామిక్ రెంట్ వస్తుందనుకుందాం. ఒక పెద్ద భూస్వామి ఆ భూమిని సాలుకు రెండువేల రూపాయలు అద్దెయిచ్చి 20 సంవత్సరాలకు కంట్రాక్టు తీసుకొని దానిలో ఒక ఫ్యాక్టరీ కడతాడు. ఆ పొలంలో తోట వుంటే వెయ్యిరూపాయలు ఆదాయం వచ్చేది. ఇప్పుడు ఫ్యాక్టరీవల్ల రెండువేల ఆదాయం వస్తున్నది.

అంటే వెయ్యిరూపాయలు అదనంగా వస్తున్నదన్నమాట. దీనిని కమర్షియల్ రెంట్ అంటారు.

ఒక పెద్ద భూమందువద్ద చిన్నరైతు ఒక ఎకరా భూమి తీసికొని నెలకు ఇంత అని చెల్లించడాన్ని కంట్రాక్టు రెంటు అంటారు.

పంటభూముల విషయంలో భూసారాన్ని బట్టి పంట రాలుబడి వుంటుంది. రైతుకు మంచి లాభం వస్తుంది. చవిటి పొలాలు అయితే ఎంత కష్టపడినా ఫలితం వుండదు. చవిటి పొలాలు సాగుచేసేవారికి ఎకనామిక్ రెంటు కూడా రాదన్నమాట.

కనక భూమి ఉపయోగాన్ని బట్టి ఆ యా పరిస్థితులను బట్టి "రెంట్" వస్తూ వుంటుంది.

కొంతమంది కొన్ని భూములను ఉచితంగా సాగు చేసుకొనమని యిస్తూ వుంటారు. ఇవి తప్పకుండా చవిటి పర్రలు అయివుంటాయి. ఎక్కడో మారుమూలన వుండటం వల్ల అవి నిరుపయోగంగా వుండి ఎట్టి విలువను కలిగి వుండవు. వీటిని "మార్జినల్ భూములు" అంటారు. పెద్ద పెట్టుబడి పెట్టకుండా ఈ భూమిని శరీరకష్టంతో బాగుచేస్తారు. ఏదైనా పన్ను వసూలుచేయడానికి పూనుకుంటే వీటిని వదిలి వేస్తారు. ఈ రకం భూములను "మార్జినల్ భూములు" అంటారు.

భూసారాన్ని బట్టి, ఆ భూమివున్న ప్రాంతాన్ని బట్టి "రెంట్" వస్తుందని పైన చెప్పుకున్నాము. ఉదాహరణకు

చెన్నపట్నం వుంది. నగరం మధ్యభాగంలో కాళీభూమి వుంది. వర్తక వ్యాపార సంస్థలు అక్కడ వుంటే మంచి లాభం వస్తుంది. నగరం పెరిగిన కొలదీ భూమికి "కరవు" ఏర్పడడంతో దీని ధర పెరిగిపోవడం ప్రారంభించింది. భూస్వాములు ఏమీ చేయకుండానే కొన్ని కారణాలవల్ల భూముల విలువ ఇలా పెరిగితే దానిని "కష్టార్జితం కాని పెరుగుదల" అంటారు.

ఆస్తిమీద వచ్చే ప్రతిఫలాన్ని గురించి ఆర్థిక శాస్త్రం ఇన్ని రకాలుగా ఆలోచనలు చేసింది.

ఇక కార్మికులకు చెల్లించే కూలిని గురించి పరిశీలన చేద్దాం.

కష్టపడి పనిచేసే ప్రతి ఒక్కరికి ఏదో ఒక ప్రతిఫలం ముడుతుంది. ఇది ఏరోజుది ఆరోజు యిస్తే కూలి అంటారు. నెలకు లేదా సంవత్సరానికి ఒకదఫా యిస్తే వేతనం (జీతం) అంటారు.

ఇలా పని చేయగలిగిన ప్రతి ఒక్కరి "సర్వీసు" కు ప్రతిఫలంగా డబ్బు రూపంలో ముట్టేది కూలి లేక వేతనం అనవచ్చు.

"డబ్బు రూపంలో ముట్టజెప్పే ప్రతిఫలం" అంటే ఆ డబ్బుకు ఎన్ని సరుకులు రాగలవనేది పరిగణించరన్న మాట.

ఉదాహరణ :- ధరలు ఎక్కువగా వున్నప్పుడు ఒకరికి వందరూపాయలు కుటుంబ ఖర్చు వుంటుంది. ధరలు తగ్గుగా వున్నప్పుడు వందరూపాయలు ఎక్కువగా కనబడుతుంది.

అందువల్ల కూలి లేక వేతనం అనేది ధరలనుబట్టి చెల్లించాలంటారు. దానినే ఆర్థిక శాస్త్ర పరిభాషలో డబ్బు కొనుగోలు శక్తినిబట్టి "అసలు వేతనాలు" నిర్ణయం కావాలంటారు.

దీనికి ఒక ఉదాహరణ చూద్దాం. యుద్ధసమయంలో ధరలు చాలా హెచ్చుగా వున్నవి. వేతనాలు కూడా హెచ్చుగానే వున్నవి. వేతనం హెచ్చుగా వున్నది కనక ధరలు హెచ్చుగా వున్నా కుటుంబం గడవడం సులభంగానే వుంది.

ఒక దుకాణంలోని గుమాస్తాకు వారానికి 18 రూపాయలు యిస్తున్నారు. ధరలు నూటికి 33 వంతులు పెరిగినవి. ఇతని జీతం కూడా వారానికి 24 రూపాయలకు పెంచారు. డబ్బుగా చూస్తే గుమస్తా జీతం నూటికి 33 పెరిగిందేకాని దానివల్ల వచ్చే సరుకులనుబట్టి చూస్తే అతని అసలు జీతం ఏ మాత్రం పెరగలేదన్నమాట.

అయితే కార్మికులకు చెల్లించే వేతనాలు ఎలా నిర్ణయిస్తారు ?

ఒక పనిని చేయడంలో నాలుగు రకాల ఉత్పాదక శక్తుల అవసరం వుంటుంది. వాని ప్రాధాన్యాన్నిబట్టి కొన్నిం

టికి ఎక్కువ సొమ్ము ముడుతుంది. ఉదాహరణకు మనం ఒక బీరువా చేయించాం. దానికి కొయ్యకింద 16 రూపాయలు, వార్నిషు వగైరాలకు 3 రూపాయలు, మేకులు వగైరాలకు 2 రూపాయలు, పనివారికింద ఖర్చు 40 రూపాయలు. అంటే బీరువా మొత్తం విలువలో మూడింట రెండు వంతులు పని వారికి ముట్టుతున్నదన్న మాట.

కాని, పనిచేయగల శక్తినిబట్టి పనివారికి కూలి యిస్తారు. పని ఎంత ఎక్కువ చేస్తే ప్రతిఫలం అంత ఎక్కువ ముడుతుంది. దానిని "ఉత్పాదకశక్తి సిద్ధాంతం" అంటారు. ఈ సిద్ధాంతాన్ని గురించి అనేక విమర్శన లున్నవి.

కార్మికులు లభ్యంకావడాన్నిబట్టి కూడా కూలి రేటు నిర్ణయం జరుగుతుంది.

ఒక ఫ్యాక్టరీలో పనిచేయడానికి వందమంది కూలీలు కావా లనుకుందాం. మనిషికి రోజుకు రెండు రూపాయలు యిస్తామంటారు. కాని కొన్ని వందలమంది పనికావాలని వస్తారు. వెంటనే కూలిరేటు తగ్గించడం యజమానులకు మామూలు.

పారిశ్రామికులు కార్మికులకు అనేక రకాలుగా ఈ కూలిరేటు చెల్లిస్తారు.

గంటల లెక్కను యిచ్చేవారుకొందరు. చేసిన పనినిబట్టి చెల్లించేవారు కొందరు. నిర్ణీతమైనపని నిర్ణీతమైన గంటలలో పూర్తిచేసి, అదనంగా పనిచేసినవారికి ప్రీమియంలు, భోనస్‌లు రూపంలో "పారితోషికాలు" చెల్లిస్తారు. ఇప్పుడు

యజమానికి వచ్చిన లాభంలో కార్మికులకు ఇన్నోవంతు ప్రత్యేకించాలని అంటున్నారు. దానినే లాభాలపంపిణీ ప్రణాళిక అంటారు.

ఏదోవిధంగా కార్మికులకు కొంత ప్రతిఫలం ముట్టు తుంది. అయితే దీనితో వారి జీవన వ్యయ ప్రమాణం ఎలావుంటుంది ?

" జీవన వ్యయ ప్రమాణం " అంటే సుఖంగా బ్రతుకు తున్నారా, నానా అగచాట్లు పడుతున్నారా అనేది నిర్ణ యించడం అన్నమాట.

వందరూపాయల జీతం ఒక కుటుంబానికి బొటా బొటిగా సరిపోతుంది. మరొక కుటుంబానికి అది ఎక్కువగా కనిపించవచ్చు.

ఎందువల్లనంటే కుటుంబంలో సభ్యులనుబట్టి వారి అలవాట్లు, ఆహారవిహారాలనుబట్టి, దేశంలో సరుకుల ధరలనుబట్టి జీవన ప్రమాణం అధారపడి వుంటుంది కనక.

కష్టజీవుల కుటుంబ జీవితం అలావుంటే వారు పనిచేసే పరిస్థితుల సంగతి ఏమిటి ? పనిచేసేచోట వుండే సౌకర్యా లనుబట్టి కూడా పనిజరిగే తీరు మారుతూ వుంటుంది.

చవిటిపొలాన్ని రైతు ఎంత కష్టపడి బాగుచేసినా సంతృప్తికరమైన ఫలసాయం రాదు. అలాగే భూమి సారవంత మైనంత మాత్రాన పంట రాలుబడి హెచ్చుగానూ వుండదు. దానికి తగిన విధంగా పనిచేయాలి. దానిలో మంచి ఎరువులు ఉపయోగించడం, బాగా దున్నడం, సకాలానికి మంచి

విత్తులు వేయడం, పండిన పంటను కాపాడటం మొదలగు నవన్నీ దానిపనిలో చేరివుంటవి.

అలాగే ఫ్యాక్టరీ కార్మికులు పనిచేసేచోట కూడా మంచిగాలి, వెలుతురు, వుండాలి. కార్మికుని ఆరోగ్యానికి భంగం కలగని వాతావరణం వుండాలి.

## 2. లాభాలు - వడ్డీలు

**ఒకరు** మనవద్దను డబ్బు అప్పుగా తీసుకొని నెలకు నూటికి కొంత వడ్డీతో సొమ్ము చెల్లించి వేయడం మనకు తెలుసు.

ఆర్థిక శాస్త్రానికి సంబంధించినంత వరకు పెట్టుబడి ఉపయోగించినందువల్ల వచ్చిన ఆదాయాన్ని వడ్డీ అంటారు.

పెట్టుబడి ఉపయోగించడం ఏమిటి అనే అనుమానం రావచ్చు.

ఆర్థిక శాస్త్రంలో పెట్టుబడి అంటే ఇతర సరుకుల ఉత్పత్తికి వినియోగించే ప్రతి వస్తువు పెట్టుబడి కిందనే జమకడతారు. ఉదాహరణకు యంత్రాలు పనిముట్లు.

ఒక ఫ్యాక్టరీ యజమానికి సాలీనా ఖర్చుపోను వంద రూపాయలు లాభం వస్తుం దనుకుందాం. ఆ ఫ్యాక్టరీని ఉపయోగించడంవల్ల ఆ వంద రూపాయలు వడ్డీగా వచ్చిందని ఆర్థికశాస్త్రం భావిస్తుంది. దీనిని ఇంగ్లీషులో "ఇన్‌ట్రెస్టు" — అంటారు.

ఇలాగ ఉత్పత్తిదారుకు తన యంత్రాలమీద; బ్యాంకి యజమానికి అతని పెట్టుబడిమీద వడ్డీ వస్తుంది.

ప్రజాసామాన్యం వాడుకను బట్టి డబ్బుమీద వచ్చేదే వడ్డీ అనుకోవడం కద్దు. కాని, ఆర్థికశాస్త్రంలో యంత్రాల మీద పనిముట్లమీద వచ్చే నికరమైన ఆదాయాన్నికూడా వడ్డీగా పరిగణిస్తారు.

పెట్టుబడిని చేకూర్చడంలో మొదటి షరతు ఏమంటే అదనంగా సరుకులను ఉత్పత్తి చేయగలగడం. రెండు: ముందుకాలంలో సుఖపడడానికి ప్రస్తుతం కొన్ని సుఖాలను వదులుకోవడం. దానివల్లనే పొదుపరితనం ఏర్పడి డబ్బు ఆదా జరుగుతుంది.

ఈ ఆదాను ఒకరికి అప్పుగా పెట్టినందువల్ల లేదా ఒక సేవింగ్స్ బ్యాంకిలో డిపాజిట్ చేసినందువల్ల వచ్చే వడ్డీనిబట్టి ఈ సిద్ధాంతం పనిచేస్తూ వుంటుంది.

కనక ప్రస్తుతం అవసరమైన సొమ్ము తీసుకొని ముందు ఎప్పటికో చెల్లించడానికి సమ్మతించి, అందుకు ప్రతిఫలంగా ముట్టచెప్పే అదనపు మొత్తాన్ని "వడ్డీ" అంటారని మనం నిర్వచనంగా చెప్పుకోవచ్చు.

అప్పు చేసేవారు అసలు వడ్డీ ఎందుకు చెల్లిస్తారు? అప్పు చేసిన మొత్తంతో లాభం తీయగలమనే విశ్వాసంతో వారు అప్పు తీసుకుంటారు. అందువల్లనే వర్తకులు హెచ్చు వడ్డీ చెల్లిస్తారు. అలాంటివారికే చాలామంది సొమ్ము అప్పు పెడతారు.

అదీగాక ఎంత సొమ్ము – ఎంత కాలానికి ఏ ప్రాంతం వారు అప్పు కావాలంటున్నారు? అనే దానినిబట్టి కూడా వడ్డీరేటు మారుతూ వుంటుంది. బస్తీ వ్యాపారస్థులకు పల్లెటూరి షావుకారులు ఇచ్చే అప్పులు దీనికి ఉదాహరణ.

అయితే అప్పులు చేసేవారు ఎంత వడ్డీ అయినా చెల్లిస్తారా?

ఈ ప్రశ్నకు సమాధానం "తాము తీయగల లాభాన్ని బట్టి" వడ్డీరేటు చెల్లించగల తాహతు చాలావరకు పెరుగుతూ తరుగుతూ వుంటుందని, కొంతమంది "అవసరాన్ని బట్టి" కూడా విపరీతంగా వడ్డీ యివ్వడం కద్దని చెప్పుకోవాలి.

ఇప్పుడు "లాభాలు" అంటే ఏమిటో చూద్దాం.

వ్యాపారానికి అయిన ఖర్చులు పోను చివరకు వర్తకుని చేతిలో మిగిలే సొమ్మును "లాభం" అంటారు. పెట్టిన పెట్టుబడి, పడిన కష్టం పోను వచ్చిన ప్రతిఫలంలో మిగులు తేలిన సొమ్ము "లాభం" అని కూడా అనవచ్చు.

ఇందులో పెట్టుబడులు, పడిన కష్టం అనేదానిలోనే వడ్డీలు, అద్దెలు, కూలి, జీతాలు వగైరా లన్నీ చేరివున్నవి.

వ్యాపారం చేస్తున్నప్పుడు సామాన్యంగా వడ్డీలు, అద్దెలు, జీతాలలో మార్పు హెచ్చుగా జరగదు. దానికి కారణం ప్రతి వ్యాపారి ముందుగానే కొన్ని కంట్రాక్టులు ఏర్పాటు చేసుకొని వుండడమే.

ఇంకపోతే లాభనష్టాలు అనేవి వ్యాపారం నడుపుకొనే తెలివితేటలమీద ఆధారపడివుంటవి. ఎంత మొత్తం లాభం

వచ్చిందనేది ముఖ్యంగా తెలివితేటలమీద ఆధారపడి వుంటుంది. ఇక్కడ తెలివితేటలు అంటే మేనేజిమెంట్ అని అర్థం.

వ్యాపారం, దాని సరళి, మార్కెట్‌లో దానికి గల స్థానాన్ని బట్టి కూడా లాభాలు రావడం కద్దు.

లాభాలకు మరొక ఆధారం మార్కెట్‌లో వుండే పోటీ. ఒకే రకం పరిశ్రమకు చెందిన కొందరు వ్యాపారులు పోటాపోటీలు పడి, మార్కెట్‌లో తమ పలుకుబడిని నిలబెట్టుకొనడానికి ప్రయత్నించడం కద్దు. ఇది కొన్ని సందర్భాలలో నష్టానికి కూడా దారితీస్తుంది. ఇలా వచ్చిన లాభాలను "పోటీతో వచ్చిన లాభాలు" అంటారు.

ఒక వ్యాపారం, లేదా ఒక సరుకు సప్లయిమీద లైసెన్సు ఒకరికే వుంది. అంటే అతడొక గుత్తవ్యాపారి అయినప్పుడు వచ్చే లాభాలు, అతను వినియోగించుకొన గల అవకాశాలమీద ఆధారపడి వుంటవి; ఆశే దురాశకు పోవడం జరిగితే ప్రజలు అసలు ఈ సరుకులను కొనకపోవచ్చు కూడా.

అయితే ఎవరి యిష్టం వచ్చినట్టు వారు లాభాలు తీయవచ్చునా?

పూర్వపురోజుల్లో ఈ అవకాశాలు వున్నా ఈనాడు లాభాలు తీయడానికి కూడా కొన్ని పరిమితులు ఏర్పరచారు.

వీనిలో ఒకటి ధరల కంట్రోలు. కంట్రోలు ధర మీద నూటికి ఇంత "మార్జిన్" అని యిస్తారు. అంటే ఆ మేరకు మాత్రమే లాభం తీయాలన్నమాట.

మరొకటి సప్లయిల కంట్రోల్. అంటే పరిమితంగా సరుకు సప్లయిచేసి ఇంతమందికి మాత్రమే ఇంత లాభంతో అమ్ముకోవాలని ఆదేశించడం.

ఇంకొకటి ప్రభుత్వం అజమాయిషీలో వ్యాపారం. కొందరు చేరి ఒక సరుకుని విపరీతమైన ధరలకు అమ్ముతుంటే ప్రభుత్వం జోక్యం కలగజేసుకొని "చౌక డిపోలు" పెట్టి తక్కువ ధరకు ఆ సరుకును అమ్మించడం దీనికి ఉదాహరణ.

చివరది లాభాల పంపిణీ ప్రణాళిక. అంటే పరిశ్రమలో వచ్చిన లాభంలో నూటికి కొన్ని రూపాయలు ప్రత్యేకంగా కార్మికులకు పంచియివ్వడం అన్నమాట.

"ఐకమత్యమే బలం" అన్నారు మన పెద్దలు. నేటి భారీ పరిశ్రమల యుగంలో కూడా ఐకమత్యానికి ఎక్కువ స్థానం వుంది. పరిశ్రమలలో ఈ ఐకమత్యాన్ని గుత్త వ్యాపారం అని, వ్యాపార సమైక్యత అని (కాంబినేషన్) అంటారు.

ఒకదానితో ఒకటి పోటీ చేసుకుంటున్న కొన్ని వ్యాపార సంస్థలు, అధిక లాభాలు తీయడానికిగాను, తమ ఉత్పత్తి కార్యక్రమాలను, వాటి నిర్వహణ ఏర్పాట్లను ఒకే మేనేజ్‌మెంట్ కిందకు తీసుకొని రావడం అనేదే దీనిలో ప్రధానాంశం. ఒక రాష్ట్రంలో లేదా ఒక దేశంలో నాలు

గైదు నూనె కంపెనీలు వున్నప్పుడు అవన్నీ ఒకటిగా ఏర్ప డటం వ్యాపార సమైక్యత అంటారు.

ఈ వ్యాపార సమైక్యతలు అయిదురకాలుగా వున్నవి. (1) పూల్ (2) ట్రస్టు (3) మెర్జర్ (4) హోల్డింగ్ కంపెనీ (5) అసోసియేషన్. వీటిని గురించి సూక్ష్మంగా తెలుసుకోడం నేటి ప్రపంచ పరిస్థితులలో అత్యావసరం.

ఒక పరిశ్రమకు చెందినవారంతా కలిసి తమ ఉత్పత్తులను నిర్ణీతమైన కోటాలుగా నిర్ణయించుకొని, ధరల స్థిరీకరణచేసి, వచ్చిన లాభాలను వాటాల ప్రకారం పంచు కొనడాన్ని "పూల్" అంటారు.

ఒక ధనవంతుడు తన యావదాస్తిమీద వచ్చే ఆదాయాన్ని ప్రజోపయోగకరమైన పనులకు వినియోగించ డానికి ఉద్దేశించి, ఒకరిని (ట్రస్టీగా) అజమాయిషీ చూడమని అనడమే ట్రస్టు అంటారు. ఇంక పరిశ్రమలలో, వివిధ కంపెనీ లలోని నిల్వలన్నీ ఒక ట్రస్టీకి అప్పగించి, ట్రస్టు సర్టిఫికేట్లు తీసుకుంటారు. ఈ కంపెనీ లన్నింటిమీద ఆ ట్రస్టీకి అజమాయిషీ చేసే అధికారం ఈ విధంగా కలుగుతుంది.

వేరు వేరు రకాల వ్యాపారం చేస్తూ పోటీలు పడుతున్న కంపెనీలు, తమ యాజమాన్యాన్ని, కంట్రోలు అధికారాలను ఒక పెద్ద కంపెనీకి స్వాధీనం చేయడాన్ని "మెర్జర్" అంటారు. ముఖ్యంగా చిన్న చిన్న కంపెనీలు ఈ విధంగా పెద్దకంపెనీలకు అమ్ముడు పోవడం జరుగుతుంది.

నలుగురు ధనవంతులకు అనేక కంపెనీలలో వాటా లున్నవి. ఈ కంపెనీలు ఒకదానితో ఒకటి పోటీ చేసుకొనడం జరుగుతున్నది. అందువల్ల ఈ నలుగురు ధనవంతులు కలిసి, ఒకమాట అనుకొని, మొత్తం అన్ని కంపెనీలు తాము చెప్పినట్టు నడుచుకొనేటట్టు చేస్తారు. వీరు నలుగురు ఒక కమిటీగా ఏర్పడి అధికారం చెలాయిస్తారు. ఇలాంటి దానిని హోల్డింగ్ కంపెనీ అంటారు.

ఒకే పరిశ్రమకు చెందిన ఉత్పత్తిదారులంతా కలిసి ఏర్పరచుకొనే సంస్థను ట్రేడ్ అసోసియేషన్ అంటారు. కొన్ని ట్రేడ్ అసోసియేషన్‌లు కలిసి "ఛాంబర్సు" (మండలి) గా ఏర్పడడం కద్దు.

ఇన్నిరకాల వ్యాపార సంస్థలను రెండు తరగతుల కింద విభజించారు. ఒకటి : హారిజాంటల్ కాంబినేషన్, రెండు : వర్టికల్ కాంబినేషన్.

ఫోర్డు మోటారు కంపెనీ, జనరల్ మోటారు కంపెనీ అనే రెండు కంపెనీ లున్నవి. ఈ రెండు కంపెనీలు విడి విడిగానే వుంటూ, "కేంద్ర ఆఫీసు" చెప్పినట్టు నడవడం జరిగితే హారిజాంటల్ కాంబినేషన్ అంటారు. అంటే ఆయా కంపెనీల స్వతంత్ర ప్రతిపత్తికి దీనిలో భంగం కలగదన్న మాట.

ఇంక ఈ మోటారు కంపెనీలో మోటారుకు కావలసిన విడిభాగాలు తయారుచేసే షాపులు, వాటికి కావలసిన పరికరాలను అందజేసే ఫ్యాక్టరీలు, రబ్బరు కంపెనీలు వగైరాలు

విడివిడిగా వుండి, ఒకే అధికారానికి లోబడి వుండటాన్ని వర్టికల్ కాంబినేషన్ అంటారు.

ఇన్నిరకాల కంపెనీలద్వారా ఒకరు లేక కొందరు వ్యక్తులు సరుకుల సప్లయిని కంట్రోల్ చేస్తూ, వాని ధరలను చిత్తంవచ్చినట్లు నిర్ణయించడాన్ని గుత్త వ్యాపారం అంటారు.

గుత్త వ్యాపారంలో కూడా తరగతు లున్నవి. ఒకరి భూమిలో ప్రత్యేకమైన ఖనిజం దొరికింది. ఆ ప్రాంతానికి ఆ ఖనిజంలో ఆ భూస్వామి గుత్త వ్యాపారం చేస్తాడు. దీనిని సమాజ గుత్త వ్యాపారం అంటారు.

ఒక పరిశ్రమను ఫలానావారు మాత్రమే నడపాలని ప్రభుత్వం లైసెన్సు యిస్తుంది. దీనిని చట్టబద్ధమైన గుత్త వ్యాపారం అంటారు.

చిత్రకారులు, నటులు, రచయితలు, సంగీత విద్వాంసులు వగైరాలను వ్యక్తిగతమైన గుత్త వ్యాపారుల కింద జమ కడతారు. వీరికి ప్రభుత్వం తగిన రక్షణ యిస్తుంది. దీనినే వ్యక్తులు లేక వ్యాపార సంస్థల "సృజనశక్తి"కి రక్షణ కలిగించడం అంటారు. "పేటెంట్" అధికారం కాపీరైట్ హక్కు, ట్రేడ్ మార్క్‌లు ద్వారా ఈ రక్షణ యిస్తుంది.

కొత్త యంత్రాలతో అధికంగా కొత్త సరుకుల ఉత్పత్తికి ఒక వ్యక్తికి లేక ఒక కంపెనీకి ప్రభుత్వం పేటెంట్ అధికారం యిస్తుంది. దీనిలో మరొకరు పోటీ రావడానికి వీలుండదు.

పాటలు, రచనలు, చిత్రాలు వగైరాలు ఒకే ఒకరు లేదా ఫలానా కంపెనీవారు పునర్ముద్రించాలి లేక ప్రచురించాలని నిర్దేశించడమే "కాపీరైట్" అంటారు.

ప్రతి వర్తక వాణిజ్య సంస్థకు ఒక ట్రేడ్ మార్కు వుంటుంది. ఆ సంస్థ సరుకులన్నింటిమీద ఈ గుర్తు ముద్రించబడి వుంటుంది. ఆ సంస్థల పేరు ప్రతిష్ఠలకు వారి సరుకుల నాణ్యానికి ఈ చిహ్నం గుర్తుగా వుండి, మార్కెట్‌లో పేరుప్రతిష్ఠలు సంపాదించుకుంటుంది. ఇదే చివరకు "గుడ్‌విల్" గా మారుతుంది.

# 1. బడ్జెట్ తయ్యారీ - కొన్ని సూత్రాలు

తన పౌరులకు భద్రత కలిగించడమే ప్రతి ప్రభుత్వం ప్రధాన కర్తవ్యమని సర్వసామాన్యంగా అంగీకరించబడింది. ప్రజల హక్కులకు రక్షణ కలిగిస్తూ స్వాతంత్ర్యానుభూతిని వారు పొందేటట్టు చేయడంద్వారా ప్రభుత్వం తన కర్తవ్యాన్ని నిర్వహిస్తుంది.

ప్రతి ప్రభుత్వం తన ప్రజలకు అనేక సదుపాయాలు చేస్తుంది. పుష్టికరమైన ఆహారం, ఆరోగ్యకరమైన గృహ వసతి, శ్రేయోదాయకమైన సాంఘిక వినోదాలు, పెక్కు రకాల పనిపాట్లకు ఆధునికమైన ఏర్పాట్లు, విశ్రాంతికి అవకాశం, వ్యక్తిగతమైన భద్రత చేకూర్చడం అనేవి ఈ సదుపాయాలలో ముఖ్యమైనవి.

నేటి ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వానిది అగ్రస్థానం. రహదారులు, వార్తాసౌకర్యాలు, జలమార్గాలు, వంతెనలు, రేవులు మొదలగునవన్నీ ప్రభుత్వం అజమాయిషీకింద వుంటున్నవి. పారిశ్రామికాభ్యుదయానికి సంబంధించిన అనేక "సర్వీసు"లను ప్రభుత్వం నడుపుతున్నది. డబ్బు చెలామణి, పరపతి ఏర్పాట్లు కూడా ప్రభుత్వం కంట్రోల్‌లో వున్నవి. ఒకే రకమైన తూనికలు కొలతలు అమలు జరుపుతున్నది. అన్నింటికంటె విదేశాలతో రకరకాల సంబంధాలను కలిగి వుంటున్నది. వీటన్నింటినీ ప్రభుత్వం నిర్వహించే "ఆర్థిక విధులు" అన్నారు.

వైజ్ఞానిక సంబంధమైన విధులుకూడా కొన్ని వున్నవి. విద్యావ్యాప్తి, సాంఘిక సదుపాయాలు (ఆటలు, పాటలు, సినిమాలు, పార్కులు వగైరా) దీనికింద చేరతవి.

ప్రభుత్వం వీటన్నింటినీ నిర్వహించడానికి చాలా డబ్బు కావాలి. పూర్వకాలంలో ప్రభుత్వ వ్యవహారాలకు డబ్బు అవసరం అంతే వుండేది కాదు. ప్రతి పౌరుడు తన శక్తినిబట్టి, ప్రభుత్వానికి సేవచేసేవాడు. కాని ఈనాడు "పన్నులు చెల్లించడం" అనేదానికి ప్రాధాన్యం వచ్చింది.

ప్రభుత్వానికి అనేక రకాలుగా రెవెన్యూ (ఆదాయం) వస్తుంది. దీనిలో పన్నులు విధించడం, చార్జీలు వసూలు చేయడం, స్పెషల్ అసెస్‌మెంటు అనేవి ముఖ్యమైనవి.

అందరితోపాటు కాకుండా ప్రత్యేక సదుపాయంగా కొన్ని లాభాలు పొందుతూ వున్నప్పుడు ప్రభుత్వానికి చెల్లించే సొమ్మును "ఫీ" అంటారు. కారు లైసెన్సులు, కోర్టు దావాలు మొదలగునవి దీనికి ఉదాహరణ.

కొత్తరోడ్లు వేసినా, నూతనంగా రవాణా సదుపాయాలు చేసినా, వాని సమీపంలోని ఆస్తులమీద స్థానిక సంస్థలు (మునిసిపాలిటీలు) అదనపు చార్జీలు విధిస్తవి. వీటిని స్పెషల్ అసెస్‌మెంట్స్ అంటారు. అదనపు సదుపాయాల కోసం జరిగిన ఖర్చును ఇలా రాబడతారు. తంతి తపాలా ఏర్పాట్లకు మనం చెల్లించే డబ్బుకూడా ఈ తరగతికి చేరుతుంది.

ప్రభుత్వ వ్యవహారాలకు కావలసిన సొమ్మును రాబట్ట డానికిగాను ఆస్తులమీద గాని ఆదాయాలమీద గాని ప్రభుత్వం వసూలుచేసే సొమ్మును "పన్ను" (టాక్సు) అన్నారు. ఆదాయం పన్ను, ఆస్తి పన్ను, అమ్మకం పన్ను వగైరాలు దీనికి ఉదాహరణ.

ఇలా పన్నులుగా ప్రభుత్వానికి వచ్చిన ఆదాయాన్ని సక్రమంగా ఖర్చు చేయడానికి తగిన ఏర్పాట్లు చేయడమే "బడ్జట్ తయ్యారీ" అన్నారు. ప్రతి బడ్జెట్‌లోనూ, గత ఏడాది ఆదాయ వ్యయాలు పేర్కొనబడి, వచ్చే ఏడాదికి ఆదాయ వ్యయాల అంచనాలు వివరించబడివుంటవి.

సామాన్యంగా ప్రభుత్వం బడ్జెట్‌లు ఈ కింది విషయాలకు ఉద్దేశించబడి వుంటవి :

(1) ఒక ఏడాదిలో వచ్చే రెవెన్యూ అంచనా ఏ కాతాకింద ఎంత వచ్చేదీ ముందుగా నిర్ణయించడం.

(2) ప్రభుత్వంలోని ప్రతి శాఖకు కొంత సొమ్మును కేటాయించి, ఆ మేరకు మాత్రమే ఆ శాఖ వ్యయాన్ని పరిమితం చేయడం.

(3) పెట్టుబడికి తగినట్టు ఆదాయం తీస్తూ, ప్రభుత్వం అవసరాలకు తగినంత రెవెన్యూను మాత్రమే తయారు చేయడం.

(4) ప్రభుత్వ వ్యయంలో అనవసరపు ఖర్చులు, మితిమీరిన వ్యయం జరగకుండా చూడడం.

ఇలా బడ్జెట్ తయారు చేయడానికి ముందు ప్రభుత్వం లోని ప్రతిశాఖ తన కార్యక్రమాలను ఆర్థిక శాఖకు అందజేస్తుంది. వీటన్నింటినీ ఒకచోట చేర్చి ఆదాయం ఎంత ? ఖర్చు ఎంత ? అనే విషయం ముందు తేల్చుకుంటారు. ఆదాయం చాలనప్పుడు అదనపు పన్ను ప్రతిపాదనలను గురించి ఆలోచనలు చేస్తారు. లేదా వివిధశాఖల వ్యయం తగ్గిస్తారు. చివరకు దీనిని శాసనసభలకు అందజేస్తారు.

ఈ సందర్భంలోనే మన ప్రభుత్వాల ఖాతాల వ్యవహారాలను గురించి కూడా సూక్ష్మంగా తెలుసుకుందాం :—

మన ప్రభుత్వానికి మూడు రకాల ఖాతాలున్నవి. ఒకటి : రెవెన్యూ ఖాతా, రెండు : పెట్టుబడుల ఖాతా, మూడు : అప్పులు — అడ్వాన్సుల ఖాతా.

వైద్యం, విద్య, ప్రజా సౌకర్యాలు, శాంతిభద్రతలు కాపాడటం, ప్రభుత్వం పన్నులు వసూలు చేయడం మొదలగు వాటికి ఖర్చులన్నీ రెవెన్యూ ఖాతాలో చేరుస్తారు. ఈ ఖాతాను సరిపెట్టడంలో మొదటి సూత్రం ఏమంటే ఏ సంవత్సరం వచ్చే ఆదాయాన్ని ఆ సంవత్సరానికి సరిపెట్టుకోవడం.

శాశ్వతంగా ప్రభుత్వానికి ఆదాయం రాగల పనుల కింద జరిగే ఖర్చును పెట్టుబడుల ఖాతాలో చేరుస్తారు. కొత్త ఇరిగేషన్ ప్రాజెక్టులు, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు దీనికి ఉదాహరణ. జమీల రద్దుకింద జరిగిన ఖర్చును కూడా పెట్టుబడుల ఖాతాలో చేర్చారు. ఏ యేడాది కా యేడాది ప్రభుత్వం

ఆదాయంనుంచి మాత్రమే ఈ కాతాకింద ఖర్చు చేయవలసిన అవసరం లేదు. ప్రజలనుంచి అప్పులుచేసి కూడా పెట్టుబడులు పెట్టవచ్చు. ఇలా ఏర్పరచిన "ఆస్తులు" అప్పుచేసిన మొత్తాలకు పూచీగా వుంటవి. వాటిమీద అదనంగా వచ్చే ఆదాయంనుంచి వడ్డీలు చెల్లించడానికి వీలు కలుగుతుంది.

స్థానిక సంస్థలకు, పరిశ్రమలకు, విద్యా సంస్థలకు ప్రభుత్వం చేసే సహాయాన్ని అప్పులు—అడ్వాన్సుల కాతాల కింద చేరుస్తారు.

ఈ మూడు కాతాలకింద జరిగే ఖర్చు కాక, రెవెన్యూ రిజర్వు ఫండు వుంటుంది. సాలీనా కొంత మొత్తాన్ని వెనక వేయడంద్వారా ఈ నిధిని ఏర్పాటుచేసి, దానిని కేంద్ర ప్రభుత్వం బాండులు, సెక్యూరిటీలలో నిల్వచేస్తారు.

ఒక్కొక్క రాష్ట్ర ప్రభుత్వం తన బడ్జెట్‌ను ఈ విధంగా సరిపెట్టుకుంటుంది.

ప్రభుత్వ వ్యయం ఆదాయానికి మించినప్పుడు "తరుగు బడ్జెట్" అంటారు. ఈ లోటును భర్తీచేయడానికి ఒక్కొక్క ప్రభుత్వం ఒక్కొక్క విధానాన్ని అవలంబిస్తుంది.

కొత్తగా పన్నులు విధించడం; ఖర్చు తగ్గించుకోనడంతోపాటు మార్కెట్‌లో అప్పుచేయడంకూడా జరుగుతుంది.

ఈ అప్పు దీర్ఘకాలమైనది కావచ్చు; తాత్కాలికమైనది కావచ్చు. అప్పు యిచ్చినవారికి ప్రభుత్వం బాండులు యిస్తుంది, దీనిమీద వడ్డీ యిస్తుంది. నిర్ణీత కాలానికి వీటిని నగదుగా మార్చుకోనడానికి వీలుంటుంది.

మార్కెట్‌లో ప్రభుత్వం అప్పుచేయడం మంచిది కాదని, ఇలా చేయడం ప్రజల పరపతిపై దెబ్బకొట్టడమేనని కొందరి వాదన. అదనపుపన్నుల ప్రతిపాదన కొంతకాలం వాయిదా వేయడానికే అప్పులుచేయడం అన్యాయమని మరి కొందరి విమర్శ. పన్నులద్వారా వచ్చే సొమ్మునుంచి ఈ బాకీలు తీర్మానంచేస్తారు. కనక అదనపుపన్నులు విధించినా, అప్పులు తీసుకున్నా ఒక్కటేగదా! అని ఇంకా కొందరి సమర్థన వుంది.

మనది ప్రజాప్రభుత్వం. రాజ్యాంగసూత్రాలప్రకారం శాసనసభలు, మంత్రివర్గం, న్యాయశాఖలు వ్యవహరిస్తవి. మనకు, మన ఆస్తులకు, మన అభివృద్ధికి గల సౌకర్యాలకు తగిన రక్షణ కలిగించడం వారి బాధ్యత. కనక ప్రజలు ప్రభుత్వ ఆర్థిక వ్యవహారాలను గురించి ఎంత ఎక్కువగా తెలుసుకుంటే, ప్రభుత్వం ధోరణి అంత త్వరితంగా మార్చ గలుగుతారు.

## 2. పన్నులు వసూలు - కొన్ని ధర్మాలు

"మనం పస్తులున్నా పన్నులు తప్పవుగా" అని చాలా మంది అనుకుంటూ వుంటారు. పన్నులు కట్టడం మహా బాధగా వీరు పరిగణిస్తున్నారనిపిస్తుంది. కాని, ప్రభుత్వం పన్నులు విధించగలిగిన విధంగా ఆస్తిని కూడబెట్టటానికి మాత్రం వీరు ప్రయత్నిస్తారు.

పన్నుల రూపంలో మనం ప్రభుత్వానికి చెల్లగట్టే సొమ్ము సాంఘిక ఉపయోగానికే వినియోగింపబడుతుంది. మనకు మనం స్వయంగా చేసుకోలేని అనేక సదుపాయాలు చేయబడతవి. విద్యాసౌకర్యాలు, రాకపోకల సదుపాయాలు వార్తా సౌకర్యాలు, శాంతిభద్రతలు కాపాడటం మొదలగు నవి దీనికి ఉదాహరణ.

కనక న్యాయమైన పన్నులు చెల్లించడానికి పౌరులు బాధపడవలసిన పనిలేదు. పైగా పన్నుల వసూలులో ప్రభుత్వంతో సహకరించి త్వరగా పని జరిగేటట్లు చూడాలి.

న్యాయమైన పన్ను చెల్లించడానికి వెనకంజ వేయ రాదన్నాం. "న్యాయమైన" అంటే ఎవరికి, ఎంతవరకు న్యాయమైన అనే ప్రశ్న వస్తుంది.

దీనికి సమాధానంగా నాలుగు సిద్ధాంతాలను శాస్త్ర జ్ఞులు తయారుచేశారు. వీటిని పన్నులు విధింపు సూత్రాలు అని మనం అనుకుందాం.

ఒకటి: శక్తికొలది చెల్లించగల సిద్ధాంతం. ఒక వ్యక్తి ఎంతవరకు పన్ను చెల్లించగలడనే దానినిబట్టి పన్ను విధిం చడమని దీనికి అర్థం.

లక్షలు గల షావుకారు, నెలజీతం తెచ్చుకొనే గుమాస్తా ఒకే రకంగా పన్ను చెల్లించడం అన్యాయమని ఈ సిద్ధాంతం చెబుతుంది. ఆదాయం పెరిగినకొలది పన్ను రేటు పెరగాలనడం దీని మూలసూత్రం. పెద్ద ఆదాయం కలవారికి కొంత సొమ్ము లోటు వచ్చినా, నిత్యజీవితానికి వారికి

ఏలోటూ వుండదు. కాని చిన్న ఆదాయం కలవారికి ఏమాత్రం లోటువచ్చినా జీవితమే గడవదు. ఇది ఈ సిద్ధాంత సారాంశం.

రెండవది : సమానపంపిణీ సిద్ధాంతం. అందరూ ఒకే విధమైన పన్ను కట్టాలని ఈ సిద్ధాంతం చెబుతుంది. పన్నుల భారం ప్రజలంతా సమానంగా వహించాలని దీని అర్థం. ఈ సిద్ధాంతం ఆచరణసాధ్యం కాకుండా పోయింది. కలవారు లేనివారు సంఘంలో వుంటారని గుర్తిస్తే ఈ సిద్ధాంతం నిష్ప్రయోజనమని తెలుస్తుంది. శక్తికొలది చెల్లించాలనే సిద్ధాంతానికి ఇది పూర్తి వ్యతిరేకంగా వుంది.

మూడవది : ఆదాయాన్నిబట్టి పన్ను చెల్లించాలనే సిద్ధాంతం. అన్నిరకాల ఆదాయాలమీద ఒకే రేటు పన్ను చెల్లించాలని ఇది కోరుతుంది.

నూటికి మూడు రూపాయలు పన్ను అని నిర్ణయించా రనుకుందాం. పదివేలు ఆదాయం వచ్చేవారు దానిప్రకారం మూడు వందల రూపాయలు కట్టాలి. పన్నెండువందలు ఆదాయం వచ్చేవారు 36 రూపాయలు కట్టాలి. పదివేలు ఆదాయం వచ్చేవారికి మూడువందలు ఒక లెక్కలోనిది కాక పోయినా పన్నెండువందలు ఆదాయం వచ్చేవారికి 36 రూపా యల లోటు కష్టం కలిగిస్తుంది. కనక ఈ సిద్ధాంతం అమలు పరచడానికి ముందు పన్ను చెల్లించగల తాహతనుకూడా గుర్తించవలసి వుంటుంది.

నాల్గవది : ప్రతిఫలాన్నిబట్టి పన్నుల సిద్ధాంతం. ప్రభుత్వంనుంచి పొందే ప్రతిఫలాన్నిబట్టి పన్నులు చెల్లించా

లని ఈ సిద్ధాంతం చెబుతుంది. ఈ సిద్ధాంతంకూడా ఆచరణ సాధ్యం కానిదే. ప్రభుత్వం సౌకర్యాలు అంటే వైద్యం, విద్యాసౌకర్యాలు మొదలగునవి పొందే బీదలు కూడా పన్నులు కట్టగలిగిన స్థితిలో వుండరు. స్థితిగలవారు ప్రయివేటుగా ఈ సదుపాయాలు చేసుకుంటారు. కనక ఈ సిద్ధాంతంకూడా లోపభూయిష్టమే.

ఇన్ని సిద్ధాంతాలు లోపభూయిష్టమైనప్పుడు అసలు పన్నులు కట్టేవారెవరు ?

ఆచరణలో ప్రతి ఒక్కరూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పన్నులు చెల్లిస్తారు. భూమిశిస్తును ప్రభుత్వం పెంచిందనుకుందాం. వెంటనే భూముల కౌలురేటు పెరుగుతుంది. వ్యాపారం మీద పన్నులు వేశారనుకుందాం. వెంటనే సరుకుల ధరలు పెరుగుతవి.

ఇలా ఎంతవరకు సాగుతుంది ? ఎవరిమీద పన్నులు విధించినా చివరకు కొనుగోలుదారులేనా భరించేది ? కొన్ని సందర్భాలలో కాదనే చెప్పవలసి వుంటుంది. సరుకుల ధర పెంచితే వ్యాపారం దెబ్బతింటుంది. కౌలురేటు హెచ్చితే వ్యవసాయం చేసేవారు వుండకపోవచ్చు.

అందువల్ల పన్నులన్నింటినీ రెండు తరగతులుగా విభజించారు. ఒకటి - ప్రత్యక్షపు పన్నులు, రెండు - పరోక్షపు పన్నులు.

ఒకరిమీద విధించబడిన పన్ను మరొకరినుంచి రాబట్టడానికి వీలులేనిది ప్రత్యక్షపు పన్ను. ఆదాయంపన్ను; ఆస్తిపన్ను - ఈ తరగతికి చెందినవి.

భూమిశిస్తును కూడా ప్రత్యక్షపు పన్నుకిందనే చేర్చారు. కౌలుదారువద్ద ఇది వసూలు జరిగినా, చెల్లించవలసిన బాధ్యత భూస్వామిమీదనే వుంటుంది. ప్రత్యక్షపు పన్నులను బాధాకరమైన పన్నులు అనికూడా అంటారు.

ఒకరిమీద విధించబడిన పన్ను మరొకరినుంచి రాబట్టడానికి వీలున్నది పరోక్షపు పన్ను. ఎక్సైజు పన్నులు దీనికి చక్కని ఉదాహరణ. పన్నుల మేరకు సరుకుల విలువ పెంచడం జరుగుతుంది. సరుకు ధరలో ఈ పన్నులు చేర్చబడిన సంగతి మనకు తెలియకుండానే వర్తకునికి చెల్లిస్తాము. పరోక్షపు పన్నులన్నీ వాస్తవానికి కొనుగోలుదారులే చెల్లిస్తారు.

ప్రభుత్వం సక్రమంగా పన్నులు విధించిందనడానికి కింది లక్షణాలను కూడా ఆర్థిక శాస్త్రజ్ఞులు నిర్ణయించారు.

—క్రమమైన పన్నుల పద్ధతి చక్కగా జయం పొందాలంటే ప్రజలలో అధిక సంఖ్యాకులు వానిని పూర్తిగా అర్థం చేసుకోవాలి.

—అందరివద్ద న్యాయంగాను, సమానంగాను పన్నులు వసూలు చేయాలి. ప్రభుత్వ వ్యయానికి కావలసిన మేరకు మాత్రమే పన్నులు వసూలు జరగాలి.

—పన్నుల వసూలుకుగాను వ్యయం చాలా తక్కువగా వుండాలి. ఒకరిమీదనే ఒకే పన్ను రెండు రకాలుగా విధించరాదు.

—ఒకరిమీద విధించిన పన్నులభారం మరొకరి మీదకు త్రోసివేయకుండా వుండేటట్లు చూడాలి. అంటే ఎవరి మీద పన్ను విధించారో వారినుంచే అది రాబట్టాలి.

—తన రెవెన్యూకోసం ఒకే ఒకరకం పన్నును ప్రభుత్వం విధించకూడదు. సంఘం మొత్తంమీద అనేక రకాలుగా పన్నులు వసూలుచేసి ఆదాయం రాబట్టాలి.

—అవసరాలనుబట్టి పెంచడానికి, తగ్గించడానికి వీలుగా పన్నుల రేట్లు మదింపు జరగాలి. ప్రభుత్వానికి హెచ్చు రెవెన్యూ అవసరమైనప్పుడు. పన్నులరేటు స్వల్పంగా మార్చినా ఈ రెవెన్యూ వచ్చేటట్లు వుండాలి. తక్కువ రెవెన్యూతో సరిపోయినప్పుడు పన్ను రేటు కొద్దిగా తగ్గించినా, అందుకు సరిపోవాలి.

— సాంఘికంగా ప్రజలలో వివిధ వర్గాలకు గల ప్రతిపత్తిని బట్టి, తాహతనుబట్టి పన్నులు విధించి వసూలు చేయాలి.

ఇవన్నీ సక్రమమైన పన్నుల విధానానికి లక్షణాలని అందరూ అంగీకరించారు.

## 3. సుంకాలు - వాటి అవసరాలు

సమగ్ర జాతీయాభ్యుదయానికి లాభదాయకమైన విదేశ వాణిజ్యం అత్యవసరం.

అయితే విదేశ వ్యాపారస్తుల పోటీలేకుండా చేసుకోవాలని స్వదేశ వర్తకుల ఆతురతవల్ల టారిఫ్ సుంకాలు, కస్టమ్సు డ్యూటీలు అనేవి ఏర్పడినవి.

ఒక దేశానికి ఎగుమతి చేస్తున్న లేక దిగుమతి చేసుకుంటున్న సరుకుమీద విధించే పన్నును టారిఫ్ సుంకం అన్నారు. కొన్ని దేశాలలో ఇవి చాలా హెచ్చుగా వుంటవి. ఉదాహరణ: అమెరికా. కొన్ని దేశాలలో చాలా తక్కువగా వుంటవి. ఉదాహరణ: కామన్‌వెల్తు దేశాలు.

టారిఫ్ సుంకాలు కూడా రెండు రకాలు.

ఇతర దేశాలతో వర్తక వాణిజ్యాలకు అవరోధాలు కలిగించకుండా, కేవలం రెవెన్యూకోసమే విధించేదాన్ని "రెవెన్యూ టారిఫ్" అన్నారు. దేశంలో ఉత్పత్తికి అవకాశం లేని, విదేశాలనుంచి దిగుమతి చేయక తప్పని కొన్ని సరుకుల మీద నామమాత్రంగా దీనిని విధిస్తారు. అంటే ఈ సరుకులు చౌకగా దిగుమతి కావడానికి ప్రభుత్వం ఇలా చేస్తుందన్నమాట.

దేశీయ పరిశ్రమలకు రక్షణ కలిగించడానికి విధించే పన్నును రక్షణసుంకం (ప్రొటెక్టివ్ టారిఫ్) అన్నారు. విదేశాలనుంచి దిగుమతి కాగల సరుకులమీద హెచ్చుగా ఈ సుంకం విధించడంవల్ల వాటి ధరలు పెరగగలవు. మార్కెట్‌లో స్వదేశీ సరుకులకంటె, వీటి ధర హెచ్చుగా వున్నందున స్వదేశీ సరుకులనే హెచ్చుమంది కొంటారు.

ఇలా టారిఫ్ సుంకాల విషయాలను పరిశీలనలు చేసి ఇండియా ప్రభుత్వానికి తగిన సూచనలు చేయడానికి టారిఫ్ బోర్డు అని ప్రత్యేకంగా ఒక సంస్థ కూడా ఇండియాకు వుంది.

ఇలా టారిఫ్ సుంకాలు విధించాలా, అవసరం లేదా అనేదానిని గురించి రెండురకాల వాదన లున్నవి.

ఒకటి స్వేచ్ఛావాణిజ్య వాదం; కేవలం రెవెన్యూ కోసమే సుంకం విధించాలని వీరి వాదన. ఒక్కొక్క దేశం ఒక్కొక్క సరుకును ఉత్పత్తి చేయగల శక్తిని ప్రకృతిసిద్ధంగా కలిగివుంటుందని వీరి విశ్వాసం. స్వేచ్ఛగా ఒక దేశానికి, మరొక దేశానికి మధ్య వాణిజ్యం జరిగితే, ఎవరి శక్తికొలది వారు సరుకులు తయారు చేయడానికి వీలుంటుందనికూడా వీరు అంటారు. ఈ విధంగా ఒక్కొక్క దేశం ఒక్కొక్క సరుకును చౌకగాను, ఎక్కువగాను ఉత్పత్తి చేయవచ్చునని వీరి అంచనా.

దీనికి వ్యతిరేకంగా దేశీయ పరిశ్రమల రక్షణవాదం వుంది. ఇది ఆరు రకాలు.

(1) ఆరంభదశలో ప్రతి పరిశ్రమకు రక్షణకలిగించి, విదేశ పరిశ్రమతో పోటీ చేయగల తాహతు తీసుకొని రావాలి; ఇలా చేయడంవల్ల అనేకమందికి కొత్తపరిశ్రమలు ప్రారంభించాలనే ఉత్సాహం కలుగుతుంది.

(2) ఏ దేశంలో ఉత్పత్తి జరిగిన సరుకులు ఆ దేశంలోనే హెచ్చు వాడకానికి వీలుంటుంది. కనక విదేశాలకు ఎగుమతిచేయాలనే దృష్టితో కాక, స్వదేశంలో వాడకానికి అనే దృష్టితో ఉత్పత్తి కొనసాగింపచేయాలి. విదేశ మార్కెట్లమీద హెచ్చుగా ఆధారపడడంవల్ల దేశీయ పరిశ్రమ దెబ్బతింటుంది. కనక దేశంలోనే "మార్కెట్"ను ముందుగా బలపరచాలి.

(3) చౌకరకం నాణ్యంతక్కువ సరుకులు అధికంగా ఒక దేశానికి ఎగుమతి కాకుండా (దీనినే డంపింగ్ అంటారు) చేయడం అవసరం. దీనివల్ల దేశీయపరిశ్రమ పూర్తిగా దెబ్బ తింటుంది. కనక సుంకాలు అత్యవసరంగా విధించాలి.

(4) విదేశాలలో చౌకగా ఉత్పత్తి జరిగిన సరుకులపై సుంకాలు లేకుండా చేసినప్పుడు దేశీయ పరిశ్రమ దెబ్బ తినడమే కాక, చౌకగా ఉత్పత్తి చేయడానికని కార్మికుల వేతనాలు తగ్గించడానికి ప్రయత్నం జరుగుతుంది. కనక కార్మికులకు హెచ్చు వేతనాలు యివ్వడానికి కూడా సుంకాలు విధించడం అత్యవసరం.

(5) యుద్ధతంత్రదృష్ట్యా ప్రతి సరుకు సప్లయిలోను దేశం స్వయంపోషకంగా వుండాలి. ముఖ్యంగా ఇనుము, ఉక్కు, బొగ్గు వంటి పరిశ్రమలలో జాగ్రత్తపడాలి. అందు వల్లనే కీలక పరిశ్రమలకు ప్రతి ప్రభుత్వం రక్షణ కలిగిస్తుంది. స్వయంపోషకం అనేది మితిమీరితే అసలు అంతర్జాతీయ వ్యాపారమే దెబ్బతినగల ప్రమాదంకూడా వుంది.

(6) దేశీయ పరిశ్రమలకు రక్షణకలిగిస్తే జాతీయతను ప్రోత్సహించినట్లు కాగలదు. దేశంలోని ఒక్కొక్క పరిశ్రమ మరి ఇతర పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడగలదు కూడా.

స్వేచ్ఛా వ్యాపారంవల్ల ఒక్కొక్క దేశం కొన్ని పరిశ్రమలను మాత్రమే అభివృద్ధిచేసి, మిగిలినవాటికి ఇతర దేశాలపై ఆధారపడి వుండవలసిన స్థితి ఏర్పడుతుంది. పరిశ్రమలకు రక్షణ కలిగించడంవల్ల వర్తక వాణిజ్యాభివృద్ధి సక్రమంగా జరుగుతుంది.

పరిశ్రమలకు రక్షణ కలిగించడానికి సుంకాలు విధించడంవల్ల, వివిధ దేశాలు కొన్ని సరుకుల సప్లయి విషయంలో కొన్ని ఒడంబడికలు చేసుకొనవలసి వస్తున్నందున స్వేచ్ఛా వ్యాపారానికి కొత్తచిక్కులు ఏర్పడుతున్నవనే విమర్శ జరుగుతున్నది.

వీనిని తప్పించుకొనడానికి రెండు దేశాలు కలిసి, ఒక దాని నుంచి మరొకటి దిగుమతి చేసుకొనే కొన్ని సరుకులపై సుంకాలు తగ్గించుకోవాలనే ఒడంబడిక చేసుకొనడం ఒకరకం. ఉదాహరణ : అమెరికా – కెనడా ఒడంబడిక.

కొన్ని దేశాలు కలిసి సుంకాల విషయంలో కొన్ని సదుపాయాలు ఉమ్మడిగా చేసుకొనడం మరొకరకం. ఉదాహరణ. బెనలక్స దేశాలు. (బెల్జియం, హాలెండ్, లక్జెంబర్గ దేశాలు).

ఇతర దేశాల సరుకులపై హెచ్చు సుంకం విధిస్తూ, తమ సరుకులపై ఒకరికొకరు తక్కువ సుంకం విధించుకోవాలనే ఏర్పాటు మరొకటి. దీనినే ఇంపీరియల్ ప్రిఫెరెన్సు అన్నారు. ఉదాహరణ : బ్రిటిష్ కామన్‌వెల్తు దేశాలు.

ఏ దేశానికి ఆ దేశం దేశీయ పరిశ్రమలను ప్రోత్సహిస్తూ అవసరమైన సరుకులను విదేశాలనుంచి చౌకగా దిగుమతి చేసుకొనడానికి ఉద్దేశించినవే ఈ ఒడంబడికలన్నీ.

దేశీయ పరిశ్రమలకు రక్షణ కలిగించడానికి టారిఫ్‌లు మాత్రమే కాక, మరిరెండు పద్ధతులు కూడా వున్నవి.

ఒకటి – సబ్సిడీలు యివ్వడం. రెండు – పరిశ్రమల నిర్వహణకు ఆర్థిక సహాయం చేయడం.

ప్రజోపయోగకరమైన పరిశ్రమలకు ప్రభుత్వం సబ్సిడీలు యిస్తుంది. అంటే కొంత మొత్తాన్ని విరాళంగా యిస్తుంది.

కీలక పరిశ్రమలకు అప్పులుగా ఆర్థిక సహాయం జరుగుతుంది. ఈ మొత్తాలు వాయిదాల రూపంలో తిరిగి ఆ పరిశ్రమలనుంచి రాబట్టడం జరుగుతుంది. దీనికి మన రాష్ట్ర ప్రభుత్వా లన్నీ పారిశ్రామికార్థిక సహాయ సంస్థలు నెలకొల్పినవి. కేంద్రంలో ప్రత్యేకంగా ఈ సహాయం చేసే ఆర్థిక సంస్థలు కొన్ని స్థాపించబడినవి కూడా.

కస్టమ్సు డ్యూటీలవల్ల మన కేంద్ర ప్రభుత్వానికి చాలా ఆదాయం వస్తుంది. మన దేశానికి దిగుమతి జరుగుతున్న సరుకు లన్నింటిమీద కస్టమ్సు డ్యూటీ వసూలు చేస్తారు.

కొన్ని సరుకులమీద విలువనుబట్టి కాకుండా సంఖ్యను బట్టి, తూకాన్నిబట్టి సుంకం విధిస్తారు. సరుకుల విలువను బట్టికూడా కొన్ని సుంకాలు విధిస్తారు. టారిఫ్‌ల విషయంలో జరిగినట్లే విమర్శ కస్టమ్సు డ్యూటీలకు కూడా వర్తింపచేయవచ్చు.

# 1. ఆర్థిక ప్రణాళికలు

ప్రతి దేశంలోనూ ఈనాడు మూడు పద్ధతులలో ఆర్థిక పురోభివృద్ధికి కృషి జరుగుతున్నది. దీనిలో ఒకటి కేపిటలిస్టు పద్ధతి. కొన్ని సందర్భాలలో దీనినే వ్యక్తిగత వ్యాపారం అని పిలుస్తారు. దీనిలో ఆర్థిక స్వాతంత్ర్యానికి పూర్తి అవకాశం వుంటుందని ఈ పద్ధతిని సమర్థించేవారు చెబుతారు.

రెండు సోషలిజం. దీనినే సంఘపరమైన లేక జాతీయావసరమైన వ్యాపారం అని అనవచ్చు. సాంఘిక శ్రేయస్సును దృష్టిలో వుంచుకొని, ఉత్పత్తి–పంపిణీ–వినియోగాలను క్రమబద్ధం చేయడానికి ప్రణాళికలు రూపొందించడాన్ని సోషలిజం అంటారని కూడా ఆర్థికరంగానికి సంబంధించినంతవరకు ఒక నిర్వచనంగా చెప్పుకోవచ్చు.

మూడు సమష్టిపద్ధతి. అంటే వ్యక్తిగత వ్యాపారానికి, సంఘపరమైన వ్యాపారానికి కొన్ని హద్దులు ఏర్పరచి, పరిమితమైన ప్రణాళికలు అమలుజరపడం. దీనినే "వికేంద్రీకరణ సహకార ఆర్థికవ్యవస్థ" అంటున్నారు.

నాల్గవ పద్ధతికూడా ఒకటి వుంది. అదే ఫాసిస్ట్ పద్ధతి. దీనికింద పరిశ్రమలు, సర్వీసులు, పూర్తిగా వ్యక్తుల స్వేచ్ఛకు వదలి, వారికి కావలసిన విధంగా కార్మికులను కట్టుదిట్టాలలో వుంచి, నిరంకుశాధికారాలను ప్రభుత్వం చెలాయిస్తుంది.

కేవలం ఆర్థిక విషయాలకు మాత్రమే పరిమితం చేసి, వీటిని ఇలా చెప్పడం జరిగింది. వీటికి సంబంధించిన, సాంఘిక రాజకీయ వ్యవహారాల ప్రసక్తి ప్రస్తుతానికి విస్మరించాలన వచ్చు. కాని వాస్తవానికి అది సాధ్యంకాదు. ఆర్థిక పరిణామాలను బట్టి – సాంఘిక వ్యవస్థ మారుతుంది. సాంఘిక స్థితిగతులను బట్టి రాజకీయ పరిణామాలు సంభవిస్తవి. కనక వీటి పరస్పర సంబంధాన్ని వేరుచేసి పరిశీలనలు సాగించడం సముచితం కాదు.

సోషలిజం, కేపిటలిజాలలో కూడా అనేక రకాలున్నవి. వాటి ప్రసక్తికూడా ఎత్తక కేవలం ఆర్థిక వ్యవస్థలో వీటిపాత్ర ఏమిటి? అనే సమస్యకు మాత్రమే ప్రస్తుతం హెచ్చు ప్రాధాన్యమివ్వాలి.

ఈ నాలుగు పద్ధతులలోను ప్రణాళికలకు ప్రాముఖ్యం హెచ్చు. అందులోను సోషలిస్టు పద్ధతిలో ఆర్థిక ప్రణాళికలకు సంబంధించినభాగం సమగ్ర స్వరూపం దాల్చింది. దీనిలో ప్రధానపరిశ్రమలు, సర్వీసులు ప్రభుత్వపరంగా వుండి, వాటి సక్రమ నిర్వహణకు తాను బాధ్యత వహించి, ఆదాయం కూడబెట్టడానికి, అనుభవించడానికి తగు ప్రణాళికను సోషలిజం అమలు జరుపుతుంది.

ఫాసిస్టు పద్ధతికూడా ఇలాగే చేస్తుంది. కాని దాని లక్ష్యం ఆర్థిక పురోభివృద్ధి మాత్రం కాదు. ప్రభుత్వానికి మిలిటరీబలం చేకూర్చడమే దాని లక్ష్యం. యుద్ధసంబంధమైన పరిశ్రమల వ్యాప్తికి హెచ్చు అవకాశం, సౌకర్యం ఇది కల్గిస్తుంది.

ఇంక సమష్టి పద్ధతి (మిక్సెడ్ సిస్టం) అని పిలిచిన దానిలో సమగ్రమైన ప్రణాళిక అనేది వుండదు. కాని అనేక రకాల ప్రణాళికలు పరిమితంగా అమలు జరప బడుతవి. సమగ్రమైన ప్రణాళిక లక్షణాలు కనిపిస్తవి. ఆర్థిక సంపదల సంపూర్ణ వినియోగం, వానిని సాంఘిక శ్రేయస్సుకు వినియోగించగల విధానాలుకూడా ఉంటవి. వీనిలో తాత్కాలిక ప్రణాళికలు, దీర్ఘకాల ప్రణాళికలు కూడా వుంటవి.

ఇంక కేపిటలిజంలో (వ్యక్తిగత వ్యాపారంలో) ప్రణాళిక అనేదే వుండదు. స్వలాభం, స్వార్థం అనే వాటిది అగ్రస్థానం. దీనిలోనే వ్యక్తివికాసం, సాంఘికాభివృద్ధికి హెచ్చు అవకాశం వుందంటారు. ప్రభుత్వం వీటి విష యంలో జోక్యం తగదని హెచ్చరిస్తారు.

ప్రపంచం మొత్తంమీద ఆర్థిక ప్రణాళికల ధోరణి ప్రస్తుతానికి పైవిధంగా వుందని మొత్తంమీద చెప్పకో వచ్చు.

ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన "ప్రణాళిక"— ఉదాహరణకు సోషలిస్టు వ్యవస్థకు సంబంధించిన ప్రణాళిక; ఫాసిస్టు వ్యవస్థకు సంబంధించిన ప్రణాళిక — అనేది "పద్ధతుల"ను చెప్పుతుంది కాని "అవసరం" ఏమిటో పేర్కొనదు. విభిన్న లక్ష్యాలతో ప్రణాళికలు తయారు చేయవచ్చు. యుద్ధం, మిలిటరీ విజయాలు లక్ష్యంతో, ఫాసిస్టు ప్రణాళికలు అమలు జరుగుతవి. అయితే తమ ప్రజల అభివృద్ధిని — కొన్నివర్గాలే కావచ్చు — కూడా

వారు కోరతారు. అలాగే అభ్యుదయాన్ని కోరే సోషలిస్టు ప్రణాళికలను కూడా అవసరమైనప్పుడు యుద్ధావసరాలకు అనుగుణంగా మార్పుచేస్తారు. దేశశ్రేయస్సు, ఆత్మరక్షణ దృష్ట్యా దీనికి పూనుకుంటారు. దీనికి సోవియెట్ యూనియన్ ఉదాహరణ.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం అన్ని దేశాల ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నం కావడంతో, ఆర్థిక ప్రణాళికలను కొన్ని లక్ష్యాలతో సాంఘిక వ్యవస్థను మార్పుచేయడానికిగాను అమలుపరచి తీరాలనే చర్చ ప్రారంభమైంది. 1917 వరకు ఈచర్చలు తీవ్రంగా కొనసాగినవి. ఆతరువాత రష్యాలో విప్లవం జయంపొంది, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ స్థాపించబడి, అది ఫలప్రదం కావడంతో ప్రణాళికలు లేక ప్లానింగ్ అనేది అన్ని దేశాలకూ "ఫ్యాషన్" అయింది. దీనితోపాటు లిబరల్ సోషలిజం, డెమొక్రాటిక్ సోషలిజం అనే పదాలు కూడా వ్యాప్తిలోనికి వచ్చినవి. వీనితోపాటు పరిశ్రమలు జాతీయంచేయడం (నేషనలైజేషన్); సంఘపరం చేయడం (సోషలైజేషన్) అనే నినాదాలుకూడా హెచ్చినవి.

కొన్ని పరిశ్రమలు, సర్వీసులను సంఘపరం చేసి, సోషలిజస్థాపన జరిగిందంటున్నారు. రైల్వేలు, విద్యుచ్ఛక్తి, రోడ్డురవాణాలు మొదలగువానికి కార్పొరేషన్‌లు ఏర్పరచి, ఇదికూడా ప్లానింగేనని కొన్ని ప్రభుత్వాలు చెప్పక తప్పని పరిస్థితులు ఏర్పడినవి. దీనికి అమెరికా, బ్రిటన్‌లు ఉదాహరణలు.

ప్లానింగ్‌కు సంబంధించిన ఈ "గందరగోళం"లో ఏది ప్లానింగ్ ? అసలు ప్లానింగ్ అవసరమా ? అసలు దాని అవసరం ఏమిటి ? అనే సందేహాలు రాగలవు.

ఈ సందేహాలకు ఒక ఆర్థికశాస్త్రజ్ఞుడు ఇలా సమాధానం చెప్పాడు :—

"ప్లానింగ్ అనేది జాతీయ ఆర్థికదృక్పథాన్ని సూచిస్తుంది. భవిష్యత్తులో సాంఘిక అవసరాలు ఏమి టనేది వర్తమానకాలంలోనే నిర్ణయిస్తుంది. దీనిలో వ్యక్తులు, వారి శక్తులు, ఆస్తులు తగిన పాత్రను నిర్వహిస్తవి. వీటికి తగినట్లు ప్రభుత్వాధికారం నిర్వహింపబడుతుంది. సర్వజనామోదకరమైన లక్ష్యాల సాధనకే ప్లానింగ్ అవసరమౌతుంది. ప్రతి పౌరుడు స్వార్థత్యాగం చేయాలని, ప్రభుత్వంమీద భక్తిప్రపత్తులు కలిగివుండాలని అప్పుడే ఆ లక్ష్యసాధన సుసాధ్యమని అది చెబుతుంది."

కనక ఆర్థిక ప్రణాళికలు (1) జాతీయ ఆర్థిక దృక్పథాన్ని సూచించాలి. (2) సర్వజనామోదకరమైన లక్ష్యాలను కలిగివుండాలి. (3) ప్రజల శక్తిసంపదల వినియోగానికి అవకాశాన్ని కలిగించాలి. (4) ప్రజల మన్నన పొందిన ప్రభుత్వం వీటిని అమలుపరచడానికి పూనుకోవాలి.

ప్రణాళికల ప్రకారం ఆర్థిక పురోభివృద్ధిని సాధించాలంటే ముఖ్యంగా అయిదు సమస్యలను సమన్వయపరచుకోవాలి. ఇవి చాలా చిక్కులతో కూడిన సమస్యలు. లక్ష్యాలను దృష్టిలో వుంచుకొని సౌష్టవమైన సాంఘిక రాజకీయ

ప్రాతిపదికలతో వాటిని సమన్వయపరచని సందర్భంలో ప్రమాదం తప్పదు.

ఈ అయిదు సమస్యలు ఏవంటే :—

(1) డెమోక్రాటిక్ కంట్రోల్. (2) మానవ సౌజన్యంతో వ్యవహార నిర్వహణ, (3) వివిధరకాల ప్రోత్సాహాలు, (4) దేనిని ఎప్పటికి ఎలా పూర్తిచేయాలనే ఏర్పాటు, (ప్రయారిటీల పద్ధతి), (5) విదేశాల సహాయం పొందడానికి — కనీసం వారిని ఆకర్షించడానికి — ప్రయత్నించడం.

## 2. ప్రణాళికల ఆవశ్యకత

అస్వస్థతగా వుంటేనేగాని డాక్టరు దగ్గరికి పోవాలనే కోర్కె అసలు పుట్టదు.

అలాగే మన ఆర్థిక జీవితంలో "లోటు" వున్నదని గ్రహించగలిగినప్పుడే ప్లానింగ్ సమస్యలపైకి ఆలోచనలు పోతవి.

మనకు ప్రకృతిసంపద అపారంగా వున్నదని, అశేష ప్రజానీకం బీదతనంలో వున్నదని మరొకరు ఇంక మనకు చెప్పవలసిన పనిలేదు. మన ఆర్థిక వ్యవస్థలో ఎక్కడో లోపం వుందని విదేశ నిపుణులు ధృవపరచవలసిన అవసరం అంత కంటె లేదు.

యుద్ధఫలితంగా ప్రజాభిప్రాయం దృష్టి అనేక ఆర్థిక సమస్యలమీద కేంద్రీకరింపబడింది. "మనదీ శక్తిగల

దేశం'' అని ఆర్థికంగా ప్రపంచానికి ఋజువుచేయగలగడం అందరి దృష్టిపై ఆకర్షించింది. యుద్ధంవల్ల అనేక చెడులు సంభవించినా, మనకుమాత్రం ఒకవిధంగా అది లాభం చేసిందనవచ్చు. అదేమంటే దేశం పారిశ్రామికాభివృద్ధి.

గత నూరు సంవత్సరాలుగా ఇండియాలో జరిగినది పారిశ్రామికాభివృద్ధా? లేక వాణిజ్యాభివృద్ధియా? అనే వివాదం ఆర్థికవేత్తల వాదోపవాదాలకు మాత్రమే పరిమితం చేసి, మొత్తంమీద మన దేశంలో కొన్ని పరిశ్రమలు అభివృద్ధిలోకి వచ్చినమాట నిజం అని మనం విశ్వసింపవచ్చు.

యుద్ధావసరాలనుబట్టి ఈ పరిశ్రమలు పెరిగినవా? లేక ప్రజల అవసరాలకు అనుగుణంగా అభివృద్ధి చెందినవా? అనేది కూడా ఆర్థిక గ్రంథాలలో ఒక వివాదాస్పదమైన సమస్యకింద చర్చలలో వుంది. ఈ విషయాన్ని కూడా ఆర్థికవేత్తల చర్చలకు మాత్రమే పరిమితంచేసి, యుద్ధావసరాలనుబట్టి కొంతవరకు పరప్రభుత్వావసరాలనుబట్టి మరి కొంతవరకు మనదేశంలో పరిశ్రమలు అభివృద్ధి చెందినవనే నిర్ణయానికి మనం రావచ్చు.

ఇదివరలో యుద్ధావసరాలనుబట్టి పరిశ్రమలు పెంపొందితే ఇప్పుడు యుద్ధం లేదుకదా? పరప్రభుత్వావసరాలను బట్టి వెనక వీటి అభివృద్ధి జరిగితే ఇప్పుడు పరప్రభుత్వం లేదుకదా? కనక ఇప్పుడు ఏమిటిచేయాలి— అనేది మరొక పెద్ద ప్రశ్న. దీనినే ఆర్థిక నిపుణుల పదజాలంలో వివరించాలంటే, యుద్ధకాలంనాటి ఆర్థిక వ్యవస్థను శాంతి కాలానుగుణ్యంగా మార్పుచేయడం అంటారు. రాజకీయవేత్తల మాటలలో

చెప్పాలంటే ప్రజావసరాలకు అనుగుణంగా పారిశ్రామికాభివృద్ధిని క్రమబద్ధం చేయడం అని చెబుతారు. ఇంక ప్రభుత్వ నిర్వాహకుల మాటలలో ''ప్లానుల ప్రకారం లేదా ప్రణాళికల ప్రకారం పరిశ్రమల అభివృద్ధి'' అంటారు.

పై మూడు వర్గాలవారు చెప్పే సమాధానం లక్ష్యం ఒక్కటే. అది పరిశ్రమలు ప్రజావసరాలకు అనుగుణంగా అభివృద్ధిచేసి తీరాలి అని. అయితే ఆర్థిక వేత్తల ధోరణిలో, సాధన సాధ్యాలను గురించి ప్రసక్తి హెచ్చుగా కనిపిస్తుంది. రాజకీయనాయకులు లక్ష్య నిర్వచనానికి హెచ్చుప్రయత్నం చేస్తారు. ఇంక ప్రభుత్వ నిర్వాహకులు సత్వర విజయాలను దృష్టిలో వుంచుకుంటారు.

ప్రజలకు సంబంధించినంతవరకు ఆర్థిక రంగంలో సత్వర విజయాలు కావాలి. లక్ష్యం ఏమిటో, ఎలాంటి సాంఘిక వ్యవస్థ రూపొందగలదో సుస్పష్టం కావాలి. ఇంక శక్తినిబట్టి వ్యవహరించడానికి సాధన సాధ్యాలను ముందుగానే తెలుసుకొనడం మంచిది కూడా.

ఇంతకీ ప్రస్తుతం మనం సరిదిద్దుకొనవలసిన లోపాలు ఏమిటి ?

అపారమైన సహజ సంపదలు వున్నా "అనుభవించ" లేక పోతున్నాం. అనుభవించ గలిగిన "తాహతు" వున్నా, దానిని "పెంచు"కొనలేక పోతున్నాం. పెంచుకొనగలిగిన శక్తి సంపదలు వున్నా "ఉపయోగించు" కొనలేక పోతున్నాం. ఉపయోగించుకొనగలిగిన "అవకాశాలు వున్నా" వాటిని అందుకొనలేక పోతున్నాం.

అందుకొన లేకపోడానికి గల "అవరోధాలను" అధిగమించలేక పోతున్నాం. కనకనే ఆర్థిక ప్రణాళికలు అవసరమైనవి.

భౌగోళికంగా అపారమైన సహజ సంపదలు మన దేశానికి సిద్ధించినవి. వాటిని అనుభవించలేక పోవడానికి ఒక కారణం ఇంతవరకూ బానిసత్వం. ఇక వాటిని అనుభవించగలిగిన "తాహతును" పెంచుకొనలేక పోవడానికి పెద్ద అవరోధంగా వుండి ఇప్పుడుకూడా తగిన అవకాశాలు లేకుండా చేస్తున్న మన ఆర్థిక వ్యవస్థ రెండవ కారణం.

అయితే మన ఆర్థిక వ్యవస్థ ఎలాంటిది.

ఇందుకు కొంతమంది ప్రముఖుల అభిప్రాయాలు పేర్కొనడం సముచితం :– శ్రీ ఎ. ఆర్. దేశాయ్ :

"స్వయంపోషకమైన గ్రామీణ వ్యవస్థ ఇండియా ఆర్థిక వ్యవస్థలో ప్రధాన ప్రాతిపదికగా కొన్ని యుగాలవరకు నిలిచివుంది. ఎన్ని రాజకీయ సంచలనాలు, మత విప్లవాలు, ప్రాంతీయ యుద్ధాలు సంభవించినా, బ్రిటిష్‌వారు కాలుపెట్టే వరకు ఆ వ్యవస్థ కొద్ది మార్పులతో అలాగే నిలిచివుంది. రాజ్యాలు పుట్టినవి. సామ్రాజ్యాలు గతించినవి. కాని దానిలో మార్పు లేదు."

ఆ గ్రామీణ ఆర్థిక వ్యవస్థను గురించి కారల్ మార్క్స్ ఇలా అన్నాడు :–

"ఈ చిన్న పురాతన భారతీయ గణాలు శ్రామిక విభజన ప్రాతిపదికగా సమష్టి యాజమాన్యంకింద భూములు

కలిగి సేద్యం చేస్తూ, చేతిపనుల నిర్వహణతో కాలం గడిపేవి. ప్రతి గణం తనకు కావలసినది తాను ఉత్పత్తి చేసుకొనే స్వసంపూర్ణ భాగంగా వుండేది. వీరు ఉత్పత్తి చేసిన వస్తువులు ముఖ్యంగా సొంత ఉపయోగానికి మాత్రమే ఉద్దేశింపబడేవి.

''అవి మార్పిడికి తగిన సరుకులుగా ఉత్పత్తి జరిగేవి కావు. సాంఘిక ఉపయోగానికి పోగా మిగిలినవి మాత్రమే సరుకులకింద వినియోగింపబడేవి. ఇలా మిగులు తేలిన వాటిలో హెచ్చుభాగం "శిస్తుకింద" ప్రభుత్వం బొక్కసానికి చేరడం చిరకాలంగా జరుగుతున్నది. దేశంలోని ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధంగా ఈ సంఘాలు వుండేవి. రాజకీయంగా ఎన్ని మార్పులు జరిగినా ఈ సంఘాలలోని ఆర్థిక ప్రాతిపదికలు మాత్రం చెక్కుచెదరకుండా వుండేవి"

ఇంక బ్రిటిష్‌వారు వచ్చిన తరువాత వీని స్థితిని మిస్టర్ డి. హెచ్. బుచనన్ ఇలా వర్ణించాడు :

" వస్తూత్పత్తికి కావలసిన ముడిసరుకు లన్నీ కలిగిన దేశం ఇది. అయినా దాదాపు ఒక శతాబ్దంపాటు ఫ్యాక్టరీల సరుకులను విపరీతంగా దిగుమతి చేసుకుంటూ, విదేశాలలో ఏనాడో స్థాపించబడిన చిన్న చిన్న పరిశ్రమలను ఇప్పుడు నెలకొల్పుకొన్నది. ముడిపత్తి, ముడి జనపనార, సులభంగా లభ్యమగు బొగ్గు, మేలురకం ఇనుప ఖనిజాలు; చేయదగిన పని లేక ఆకలితో బాధపడే హెచ్చు జనాభా; మూలుగు తూవున్న వెండి బంగారం; ప్రపంచానికి విపరీతమైన పెట్టుబడి పెడుతున్న బ్రిటిష్ ప్రభుత్వం పరిపాలన. అన్ని దేశాల

లోనూ బ్రిటిష్ పతాకంకింద వ్యాప్తిచెందుతున్న తెల్ల ధనికులు; దేశంలోనే సరుకుల అమ్మకానికి తగిన పెద్ద మార్కెట్. ఇన్ని సౌకర్యాలుండి ఒక శతాబ్దం గడిచినా, ఇండియా తన జనాభాలో నూటికి ఇద్దరికి మాత్రమే ఫ్యాక్టరీలలో పని చూపిస్తున్నది. దేశం అంతా వ్యవసాయక దశలోనే వుంది. ప్రజలంతా వ్యవసాయం మీదనే బ్రతుకుతున్నారు."

ఇక మన వ్యవసాయ పరిస్థితిని గురించి రాయల్ కమీషన్ ఇలా తీర్పు చెప్పింది :

"భారతదేశంలో రైతు కష్టించి పనిచేసేది లాభంకోసం కాదు. ప్రతిఫలాపేక్షతో కూడా కాదు. కేవలం బ్రతుకుకోసం; పొట్టకోసం పనిచేస్తాడు. వ్యవసాయం మీదనే హెచ్చు జనాభా ఆధారపడి వుండటం; చేయదగిన పని మరొకటేదీ దొరకక పోవడంతో, రైతు తప్పనిసరిగా; ఎక్కడబడితే అక్కడ, ఎన్ని షరతులకు కష్టాలకు అయినా లోబడి, ఆహారోత్పత్తి చేయక తప్పడంలేదు. ఆస్తి ఋణదాత చేతులలోనికి పోకుండా ఆతనికి రక్షణ కలిగించే శాసనం లేదు. కాపాడదగిన ఏ భూస్వామ్యరక్షణ చట్టం లేదు. పొట్ట నింపుకోవాలంటే భూమి కావాలి. భూమి కావాలంటే ఋణదాతను బ్రతిమలాడాలి—చివరకు తలను కూడా తాకట్టు పెట్టాలి."

పోతే, యుద్ధాత్పూర్వం మన పరిశ్రమలను గురించి "వాడియా అండ్ మర్చెంట్స్" చేసిన ప్రకటన ఇది :

"ప్రభుత్వ రక్షణకింద పెంపొందిన పరిశ్రమలవల్ల జాతీయాదాయం అదనంగా పెరిగిం దనడానికి వీలులేదు. ఈ పరిశ్రమలు దేశానికి కావలసిన సరుకులు సప్లయిచేసి, అద్యతన భావిలో స్వయంపోషకం చేకూర్చగలవని ఆశించ తగిన అవకాశాలు లేవు. కనక మనకు కావలసిన సరుకుల దిగుమతికి మన వస్తువుల అమ్మకానికి కూడా విదేశాలపై మనం ఆధారపడక తప్పదు. అంతేకాదు, నూతన పరిశ్రమల స్థాపనకు అవసరంగా కావలసిన యంత్ర సామాగ్రుల కోసం కూడా మనం విదేశాలమీద ఆధారపడవలసిందే."

ఇది మన ఆర్థికవ్యవస్థ. ఇదీ మనదేశ ఆర్థికదుస్థితి. దీనినుంచి బయటపడటం ఎలాగ అనే ప్రశ్నకు "ఆర్థిక ప్రణాళికలు అమలుజరపడం" అనేదే ఈనాడు అందరూ చెబుతున్న సమాధానం. దీనినే ప్లానింగ్ అంటున్నారు.

ఇక్కడ ప్లానింగ్ అంటే ఒక లక్ష్యసాధనకు పని చేయడం. ఒక ఆదర్శసిద్ధికి జాతీయశక్తు లన్నింటిని కేంద్రీక రింపచేయడం అన్నమాట.

ఒక ప్రణాళిక ప్రకారం ఆర్థికవ్యవస్థను మార్పుచేయా లంటే, ఆర్థిక రంగానికి సంబంధించిన ఉత్పత్తి, వినియోగం, పంపిణీ మొదలగువానిపై పూర్తి కంట్రోల్ అమలుజరగాలి; వ్యక్తిగత వ్యాపారంలోని కష్టనష్టాలు, కేపిటలిజంలోని ఒడుదుడుకుల ఫలితంగా ఆర్థిక ప్రణాళికలను ఎన్ని చిక్కులకు లోబడి అయినా అమలుజరపడం సముచితమని ప్రజలు

కోరుతున్నారు. ఇందులో వారు ఉద్దేశిస్తున్నది అధిక సంఖ్యాకులకు సుఖం చేకూరడమే.

ఈ సందర్భంలోనే ఆర్థిక ప్రణాళికలు అమలు జరపడాన్ని గురించిన మూడు ప్రముఖ వాదనలను కూడా తెలుసుకోనడం సముచితం.

కేపిటలిస్టుల వర్గానికి చెందినవారు "భద్రతను" గురించి ప్రస్తావిస్తారు. అంటే కొన్ని ప్రత్యేక వసతులు, గుత్తాధి కారాలతో ప్రణాళికలు అమలు జరపాలని వీరి వాదన. ఇదే జర్మనీలో జరిగింది.

బ్రిటన్, అమెరికా వంటి ధనిక దేశాల సహాయంతో బడుగు దేశాల ఆర్థిక పునర్నిర్మాణ ప్రణాళికలు అమలు జరగాలని కోరేవారు కొందరు. ఇదే ట్రూమన్ చతుస్సూత్ర ప్రణాళికగా ప్రచారంలోకి వచ్చింది.

ఇంక మూడవ వర్గంవారు సాంఘిక శ్రేయోభిలాషులు. సాంఘిక సంపద చాలవరకు సరిసమానంగా అందుబాటు కావడానికి. ఆర్థిక సంపద పంపిణీ ప్రాతిపదికలు మార్పు కావాలని వీరు కోరతారు. వారినే డెమొక్రాటిక్ సోష లిస్టులు అంటారు.

మన దేశంలో చాలా కాలం నుంచి జాతి ఆర్థిక భవితవ్యంపై ఆలోచనలు జరుగుతున్నవి. ప్లానింగ్‌కు సంబం ధించిన మొదటి పునాది పండిట్ నెహూ్రా అధ్యక్షతను కాంగ్రెసుపార్టీ ప్లానింగ్ కమిషన్ స్థాపనతో పడింది.

తరువాత కొందరు పారిశ్రామికవేత్తలు, వణిక్ప్రముఖులు కలిసి, ఒక ప్రణాళిక ప్రచురించారు. దానిని బొంబాయి ప్రణాళిక అన్నారు. ఆ తరువాత ఎం. ఎన్. రాయ్ వర్గానికి చెందినవారు ప్రజాప్రణాళిక అనేదానిని ప్రచురించారు. ఇంక వ్యక్తిగతంగా శ్రీ ఎమ్. విశ్వేశ్వరయ్య, ప్రొఫెసర్లు మర్చెంట్ అండ్ వాడియా, సర్. ఆర్దేషర్ దలాల్ మొదలగు ప్రముఖులు కూడా ఆర్థిక ప్రణాళికల ఆవశ్యకతను గురించి ప్రచారం చేశారు. పైన వివరించిన మూడు ధోరణులు వీరిలో అస్పష్టంగా కానవచ్చేవి కూడా.

ఆర్థిక ప్రణాళికల ద్వారా మనం సాధించవలసిన విషయాలను గురించి అనేకమంది అనేక విధాలుగా చెబుతున్నారు.

వ్యవసాయం, పరిశ్రమలు అభివృద్ధిచేసి, విద్యాభివృద్ధిని సాధించి, పన్నుల విధింపుద్వారా జాతీయాదాయం అన్నివర్గాలకు సమానంగా పంపిణీ అయేటట్టు చూడాలనే వారు కొందరు.

దేశంలో ఉత్పత్తులు పెంచి, విదేశ మార్కెట్లలో విక్రయించి, ప్రణాళికలకు కావలసిన పెట్టుబడులకు సొమ్ము సేకరించాలనేవారు మరికొందరు.

వస్తువుల పంపిణీ, వాటి వినియోగంలోనే అసలు లోటు వుంది. కనక ఆ విషయాలకే ప్రణాళికలు పరిమితం కావాలనేవారు ఇంకా కొందరు.

ఇలా ఏ వర్గంవారు ఆ వర్గ ప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని పలువిధాలుగా ఆర్థిక ప్రణాళికలకు నిర్వచనం చెప్పడం కద్దు.

వివిధదేశాల అనుభవాలను బట్టి ఆర్థిక ప్రణాళికల ద్వారా ప్రభుత్వం సాధించవలసిన సమస్యలు ఇవి అని పేర్కొనడంకంటె, ప్రభుత్వం ఉద్దేశించవలసిన లక్ష్యాలు ఇవి అని నిర్దేశించడం సముచితమని ఆధునిక రాజకీయవేత్తల అభిప్రాయం.

ప్రతి ప్రభుత్వం ఉద్దేశించవలసిన లక్ష్యాలుగా ఈ క్రిందివాటిని పేర్కొంటున్నారు.

(1) ప్రతివారికి జీవించడానికి హక్కు (2) ప్రతి ఒక్కరికి పనిచేయడానికి హక్కు (3) ప్రతివ్యక్తికి అనుభవించడానికి అవకాశం.

వీటిని రాజకీయ లక్ష్యాలకింద జమకట్టి, ప్రాథమిక పౌరస్వాత్వాలలో అవి ప్రధానమైనవని నిర్ధారణ చేశారు.

ఇంక ఆర్థిక లక్ష్యాలుగా (1) జాతీయాదాయం పెంపొందించడం (2) జీవనప్రమాణం హెచ్చుచేయడం అని నిర్ణయించారు. మన దేశాన్ని దృష్టిలో వుంచుకొని వీటినే ఇలా వివరించవచ్చు.

"ఆర్థిక పురోభివృద్ధిద్వారా ప్రజల జీవన ప్రమాణం హెచ్చించడం; భవిష్యత్తుమీద విశ్వాసం కలిగించడం; రోడ్ల నిర్మాణం; మోటారు రవాణా సౌకర్యాలద్వారా దేశంలో రవాణా సదుపాయాలు పెంపొందచేయడం; కుటీర

పరిశ్రమలు అభివృద్ధిచేసి, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి ద్వారా గ్రామజీవితాన్ని ఆధునిక దృక్పథంలోనికి మార్చడం; చివరకు వ్యవసాయ సరుకుల అమ్మకానికి దేశంలో మార్కెట్ వసతులు హెచ్చుచేయడం.''

ఇందుకే ఇండియా ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలను అమలు జరుపుతున్నది.

# 3. విభిన్న ఆర్థిక వ్యవస్థలు

విభిన్నాభిప్రాయాలను కలిగివుండటం మానవ నైజం. అయినప్పుడు, ఏది ఆదర్శనీయమైన ఆర్థిక వ్యవస్థ అనే దానిని గురించి ఏకాభిప్రాయం లేకపోవడంలో ఆశ్చర్య మేమీ లేదు.

నేటి ఆర్థిక వ్యవస్థను, నేటి ఆర్థికవ్యవహారాలను గురించి పరిశీలనలుచేసి చర్చకు పూనుకొనడానికి ముందు శాస్త్రీయ దృక్పథం, సహనభావం అనేవానికి బాగా అలవాటు పడాలి.

ప్రతి ఆర్థిక వ్యవస్థలోనూ విమర్శించతగిన విషయాల తోపాటు ప్రశంసించదగిన సంగతులున్నవి. కనక ఒక దేశం ఆర్థికవ్యవస్థను మార్పుచేయడానికి, సంస్కరణలను ప్రవేశ పెట్టడానికి ముందు, అసలు దానిలోని లోటుపాట్లను పరి శీలించాలి. 19వ శతాబ్దంనుంచి ముఖ్యంగా గత 20 సంవత్స రాలనుంచి, ఆర్థిక వ్యవస్థలో మార్పులు తీసుకొనిరావడానికి సంబంధించిన అనేక "వాదనలు" (ఇజాలు) ప్రచారంలో

వున్నవి. వాటినిగురించి సంగ్రహంగా ముందు తెలుసు కుందాం.

## కేపిటలిజం

కేపిటలిజంలో వ్యక్తిగత వ్యాపారానికి పూర్తి ప్రోత్సాహం వుంటుంది. ఆర్థిక రంగం యావత్తు "వ్యక్తిగత వ్యాపారానికి" వదలివేస్తారు. "లాభాలు" తీయాలనే దృష్టితో డబ్బుగల వ్యక్తులు పరిశ్రమలు నడుపుతారు. అనేకమంది వ్యక్తులు తమ సహజశక్తులు అభివృద్ధి చేసుకొనడానికి, పెక్కు అవకాశాలను అందుకొని పైకి రావడానికి ఏదో ఒక రూపంలో "సర్వీసు" చేయడానికి, వీలు కలుగుతుందని కేపిటలిజాన్ని బలపరచేవారు వాదిస్తారు.

పరిశ్రమల అభివృద్ధికి "పోటీ" అనేది అవసరమని, అప్పుడే సక్రమమైన ధరలకు నాణ్యంగల సరుకుల ఉత్పత్తి జరుగుతుందని, అది సంఘ శ్రేయస్సుకు అత్యవసరమని కూడా వారు చెబుతారు.

కొత్త పరిశోధనలు చేస్తూ నూతన విధానాలు కని పెట్టడం అనేది వ్యక్తికి అవకాశాలు కలిగించడం మీాద ఆధారపడి వుంటుందని నాగరికత వ్యాప్తికి ఇది ఆయువు పట్టని అంటారు.

దీనివల్ల కొంతమంది వ్యక్తులు దేశంలోని సంపదను తమ కంట్రోల్‌లో వుంచుకొని, సాంఘికంగాను, రాజకీయంగాను పెత్తనం చెలాయించగలరనే విమర్శ వుంది.

ఒకరి కొకరు పోటీపడి, జాతీయ సంపదను దుర్వినియోగం చేయగలరని, చౌకగా సరుకులు తయారు చేయడానికిగాను కార్మికుల వేతనాలు తగ్గించడం, లేదా కొత్త యంత్రాలను ప్రవేశపెట్టి కొంతమందిని పనులనుంచి తగ్గించి వేస్తారనే ఆరోపణకూడా వుంది.

డబ్బుగలవారంతా మంచి లాభాలు తీయడానికి అవకాశం గల పరిశ్రమలలోనే పెట్టుబడులు పెట్టడానికి సిద్ధపడడంవల్ల కొన్నిరకాల పరిశ్రమలు మాత్రమే హెచ్చుగా అభివృద్ధి జరిగి మరికొన్ని పరిశ్రమలు అసలు ప్రారంభం కాకపోవడం, ప్రారంభింపబడినా వెనకబడి వుండడం తథ్యమని చెప్పడం కద్దు.

## సోషలిజం

కేపిటలిజాన్ని విమర్శించేవారు, సోషలిజం కోరతారు. కేపిటలిజంలోని "దౌర్భాగ్యాలకు" విరుగుడు సోషలిజం అని ఈనాడు హెచ్చు ప్రచారం జరుగుతున్నది.

దేశంలోని అన్ని పరిశ్రమలను సమన్వయ పరచి, ప్రభుత్వం నాయకత్వాన, సాంఘిక శ్రేయస్సు లక్ష్యంగా వానిని నిర్వహింపజేయడాన్ని సోషలిజం అంటారు.

సోషలిజంలో ఉత్పత్తిసాధనా లన్నీ ప్రభుత్వం ఆధ్వర్యంకింద వుంటవి. కనక "పోటీ" అనే దానికి దానిలో స్థానం లేదు. "అధిక లాభాలు తీయడం" అంటూ వుండదు.

ఒక్కొక్క వ్యక్తి ఆదాయం, అతని "అవసరాలకు" మించినదిగా వుండకూడదనేది కూడా సోషలిజంలో ప్రధాన సూత్రం.

సోషలిస్టు వ్యవస్థలో ప్రతి ఒక్కరికి "పని" వుంటుంది. వేతనాలు హెచ్చుగా వుంటవి. పని గంటలు తక్కువగా వుండి, కార్మికుల శ్రేయస్సు ప్రధాన లక్ష్యంగా వుంటుంది కూడా.

ఆర్థిక "జాడ్యాలకు" సోషలిజం మాత్రమే ''సర్వరోగ నివారిణి'' కాదని విశ్వసించేవారు. సోషలిజంలో ''వ్యక్తి అభిరుచులకు" ప్రోత్సాహం వుండదని విమర్శిస్తారు. పరిశ్రమలలో ప్రభుత్వం పెత్తనం వున్నప్పుడు ''మూక'' స్వభావం పెరుగుతుందని, "వ్యక్తిత్వం" అనేది పూర్తిగా నశిస్తుందని చెబుతారు.

ప్రకృతిసిద్ధంగా వ్యక్తులలో భుజబలం, మేధాశక్తి, మొదలగువానిలో భేదాలు వుండి తీరగలవు. కనక అందరూ ''ఒక మూసలోనే'' వ్యవహరించాలనడం, అసలు వ్యక్తిత్వాన్నే శంకించడం కాగలదని, అందరూ సమష్టిక్షేమం లక్ష్యంగా వ్యవహరించగలగడమనేది మానవ నైజానికే విరుద్ధమని, "స్వ" లేకుండా ఎవరూ పనిచేయరనికూడా వీరు విమర్శిస్తారు. అయితే కేపిటలిజంలోని లోపాల సంస్కరణకు సోషలిజం చక్కని మార్గమని మాత్రం అంగీకరిస్తున్నారు.

## కమ్యూనిజం

రైల్వేలు, పెద్ద పరిశ్రమలు మొదలగునవి ప్రభుత్వం అధికారంకింద వుండాలని, కేవలం నిత్యజీవితావసర వస్తువులలో వ్యాపారం మాత్రమే వ్యక్తుల నిర్వహణకు వదలివేయాలని సోషలిజం చెబుతుంది.

ఇంక కమ్యూనిజం, జాతీయసంపద యావత్తు ప్రజల "స్వంతం"గా వుండి దాని యాజమాన్యంకిందనే నిర్వహింపబడాలని చెబుతుంది. వ్యక్తులందరూ సాధ్యమైనంత వరకు సమాన ఫాయాలో వుండటానికి కమ్యూనిజం ప్రయత్నిస్తుంది. సహకార, సమష్టి విధానాలు ప్రభుత్వ ప్రణాళికలు అనేవి కమ్యూనిజంలో ప్రధానపాత్ర వహిస్తవి.

కేపిటలిజంలోగల "మంచి" అంతా కమ్యూనిజంలో "కొరవ"గా వున్నదనేది కమ్యూనిజాన్ని గురించిన ప్రధాన విమర్శ. కేపిటలిజానికి ఉదాహరణ అమెరికాను, కమ్యూనిజానికి నిదర్శనంగా రష్యాను ఉదాహరిస్తారు.

## ఫాసిజం

కేపిటలిజంలో వలె వ్యక్తిగత వ్యాపారానికి ప్రభుత్వం పూర్తి ప్రోత్సాహం యిస్తుంది. అయితే, దానిలో సాంఘిక శ్రేయస్సును గుర్తించక, "ప్రభుత్వ భద్రతకు" హెచ్చు ప్రాధాన్యం వుంటుంది. వ్యక్తి జీవితం, జాతి శ్రేయస్సుకంటె ప్రభుత్వ భద్రత ప్రధానంగా పరిగణించబడుతుంది. ప్రభుత్వానికి ఉపయోగపడటానికి సంబంధించినంత వరకు వ్యక్తి "అనామకుడు."

ఫాసిజం, వ్యక్తిగత వ్యాపారాన్ని ప్రోత్సహించినా, వ్యక్తి యిష్టం వచ్చినచోట వ్యాపారాన్ని ప్రారంభించడానికి అవకాశ మివ్వదు. ప్రభుత్వం నిర్దేశించినచోటనే పరిశ్రమలను నెలకొల్పాలి.

ఫాసిస్టు వ్యవస్థలో ప్రజల అవసరాలనుబట్టి కాకుండా ప్రభుత్వానికి కావలసిన పరిశ్రమలకు ముఖ్యంగా ఆయుధ నిర్మాణ పరిశ్రమలకు హెచ్చు ప్రాధాన్యం యివ్వబడుతుంది.

స్థూలంగా చూస్తే, ఈనాడు ప్రచారంలోవున్న ఆర్థిక వ్యవస్థల స్వరూపం ఇంతే.

# 4. మిశ్రమ ఆర్థిక వ్యవస్థ

మనకు ఎలాంటి ఆర్థిక వ్యవస్థ వుండాలని ప్రశ్నించుకున్నప్పుడు సోషలిజమా, కమ్యూనిజమా అనే రెండు పదాలు వెంటనే స్ఫురణకు రాగలవనడంలో సందేహంలేదు.

కమ్యూనిజం అంటే ప్రపంచం మొత్తంమీద రాజకీయ దృక్పథంతో జరుగుతున్న వ్యతిరేక ప్రచారం మనకు భీతి కలిగిస్తున్నది. జాతీయంగా సోషలిజాన్ని గురించి జరుగుతున్న వాదోపవాదాలు మనకు తికమక కలిగించగలవు.

దీని ఫలితంగా ఎలాంటి ఆర్థిక వ్యవస్థ కావాలనే దాన్ని గురించి ఊహించుకొన లేనంతటి ఆందోళన సాంఘిక జీవితంలో కనిపిస్తుంది.

అయినా మన నాయకులు మాత్రం పదేపదే మనకు కావలసింది మిశ్రమ ఆర్థిక వ్యవస్థ - మిక్సెడ్ ఎకానమీ అని నొక్కి వక్కాణిస్తున్నారు.

కమ్యూనిజం, సోషలిజాన్ని గురించి జరిగినంత వివరణ మిశ్రమ ఆర్థిక వ్యవస్థను గురించి జరగలేదు.

కమ్యూనిజంవల్ల కలిగించబడిన భయం, సోషలిజం మీాద ఏర్పరచబడిన అనుమానాలు కారణంగా మన దృష్టి, ఆసియా దృష్టి — బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజిలెండు. స్కాండినేవియా దేశాల ఆర్థికవ్యవస్థల వైపుకు మరలింది.

ఈ దేశాలలో గమనార్హమైన విషయాలు రెండున్నవి.

ఒకటి :—వాటి పారిశ్రామిక జీవితంలో స్వల్పభాగం మాత్రమే జాతీయం చేయబడడం. ఇదైనా సహకారోద్యమం ఆధిపత్యాన వుండటం.

రెండు :— రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందిన మనకు ఆర్థిక ప్రజాస్వామ్యంలో అనుభవం లేకపోవడంవల్ల ఆ దేశ ప్రభుత్వాల తీరు నచ్చడం.

వ్యక్తిత్వం, పార్లమెంటరీ సాంప్రదాయం, పౌరసత్వాలు, మత స్వాతంత్ర్యం మొదలగు విషయాలలో గట్టిపట్టుదల చూపుతున్న మనకు, ఆర్థిక రంగంలో వీటికిగల స్థానాన్నికూడా గుర్తించలేకపోవడంతో చిక్కులు మరింత హెచ్చినవి. అంటే రాజకీయ ప్రజాస్వామ్యంలో ఆర్థిక

సమత్వానికి గల స్థానం ఇంకా మనదృష్టిని ఆకర్షించడం లేదు. అందువల్లనే ఆర్థికరంగంలో జరుగుతున్న ప్రతి ఆందోళనకు రాజకీయపు ముసుగు తగిలించి, ఆర్థిక సమానత్వానికి పరోక్షంగా వ్యతిరేకప్రచారం చేయబడుతున్నది.

అదీకాక, నేటి మన ఆర్థిక వ్యవస్థలో ఏర్పడిన చిక్కుల పరిష్కారానికి అధికోత్పత్తి, కష్టపడి పనిచేయడం, అత్యవసరమని చెప్పబడుతున్నది. అంటే ఉత్పత్తులను గురించి శ్రద్ధ వహిస్తున్నారే కాని, వాని ఫలితాలను అనుభవించడాన్ని గురించి యింకా హెచ్చు శ్రద్ధ చూపడంలేదు.

కనక మిశ్రమ ఆర్థిక వ్యవస్థ అనేది—ఉత్పత్తులకు సంబంధించినదే కాని—పంపిణీ వ్యవహారాలకు సంబంధించినది కాదేమో నని కొందరు అనుమానిస్తున్నారు.

మిశ్రమ ఆర్థిక వ్యవస్థను గురించి పరిశీలించడానికి ముందు కొన్ని ప్రధాన విషయాలను గుర్తుంచుకోవాలి.

1. ఏవిధమైన మూఢ విశ్వాసానికి లోనుగాకుండా, పరిశీలనలు జరిపి, ప్రధానావసరాలకు అధిక ప్రాముఖ్యమివ్వడం.

భౌగోళికంగా మనదేశం పెద్దది. అన్ని రకాలుగాను వివిధ రంగాలలో విభిన్న రీతులలో ప్రయోగాలు చేసి చూడటానికి అవకాశం వుంది.

దేశంలో పారిశ్రామిక విప్లవం ప్రారంభదశలో వుంది. ఈనాడు మనను ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి

ఒక మార్గంగా పరిశ్రమలను జాతీయం చేసినంత మాత్రాన ఏ సమస్య సమగ్రంగా పరిష్కారం కాదు. కావడంలేదు.

2. ఆర్థిక విషయాలలో మహాత్మాగాంధీ అభిప్రాయాలకు రాజకీయంగా ఏర్పడిన పునాదులను గుర్తించడం (పరిశ్రమలలో అధికారాల వికేంద్రీకరణ).

3. పరిశ్రమలలో ప్రభుత్వం జోక్యాన్ని తగ్గిస్తూ, కార్మికులకు వాని నిర్వహణలోనూ, వాని ఫలితాలను అనుభవించడంలోనూ హెచ్చుపాలు వుండేటట్టు చూడటం.

4. కార్మికులకు దూరంగావుండి వ్యవహారాలు చేసుకోవాలనే దృక్పథానికి పారిశ్రామికులు స్వస్తిచెప్పి, కార్మికులను విశ్వసించి, వారి అభిమానం పొందడానికి ప్రయత్నించడం. (ఇదే పారిశ్రామిక ప్రజాస్వామ్యం.)

5. యాజమాన్యం ఎవరిది ? మేనేజిమెంటు ఎవరిది ? అనే సమస్యలమీద కాకుండా సాంఘిక శ్రేయస్సు ప్రధానంగా ఎవరి "కంట్రోలు" అమలు జరుగుతున్నదనే దానికి ప్రాధాన్య మివ్వడం.

ఈ అభిప్రాయాలు ప్రాతిపదికగా తీసుకొని ఆలోచిస్తే మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో మూడుతరగతు లుండగలవని తలంచవచ్చు.

ఒకటి : ఇప్పటికిగల కొన్ని పరిశ్రమలను జాతీయం చేయడం.

అంటే కీలక పరిశ్రమలను ప్రధాన పరిశ్రమలను జాతీయం చేయాలని ముందుగా అమోదించవలసిన అవసరం

లేకుండా పరిస్థితులనుబట్టి ఏది కీలక పరిశ్రమ, ఏది ప్రధాన పరిశ్రమ ? — అనేది నిర్ణయించుకొని అవసరమైన సందర్భాలలోనే ఆ యా పరిశ్రమలను జాతీయం చేయడం.

అయితే ఇలా చేయడానికి ముందు ఒక పరిశీలన సంఘం నిష్పాక్షికంగాను బహిరంగంగాను దర్యాప్తులు కొనసాగించి తగిన సూచనలు చేయవలసి వుంటుంది.

రెండు : కొత్తరంగాలలో ప్రభుత్వ ప్రవేశం.

ఇవి కొత్త పరిశ్రమలు కావచ్చు. ఇప్పటి పరిశ్రమలు లోనే అదనపు ఏర్పాట్లు కావచ్చు. ప్రయివేటు వ్యాపారం తాహతుకుమించిన అదనపు పరిశ్రమలు కావచ్చు.

దీనివల్ల ప్రభుత్వం గుత్తాధికారం వుండదు. ప్రయివేటు పరిశ్రమ, ప్రభుత్వ పరిశ్రమ మామూలుగా పోటీ చేసుకొన వచ్చు. దీనివల్ల కలిగిన అనుభవంలో పరిశ్రమలను పూర్తిగా జాతీయం చేయడానికి పూనిక చూపవచ్చు.

మూడు : వ్యక్తిగత వ్యాపారానికి అవకాశం.

వ్యక్తిగత వ్యాపారం కూడా "ప్రజోపయోగకరమైన వ్యవస్థగా" గుర్తింపబడుతున్న ఈ రోజుల్లో, వ్యక్తి ఆధిపత్యంకింద వుండే పరిశ్రమలపై ప్రభుత్వం సాధ్యమైనంత తక్కువ "కంట్రోలు" అమలు జరపుతూ పూర్తి ప్రోత్సాహం యివ్వవలసి వుంటుంది. ఆర్థిక సహాయం, సాంకేతిక సహాయం, ప్లానులను సమన్వయ పరచడంలో సలహాలు

ప్రయివేటు పరిశ్రమలకు అత్యవసరంగా కావాలి. ఈవిధంగా కొంత ప్రయివేటు వ్యాపారం, కొంత ప్రభుత్వ వ్యాపారంతో ప్రణాళికాబద్ధంగా ఏర్పరచుకొన్న దానినే మిశ్రమ ఆర్థిక వ్యవస్థ అంటున్నారు.

# 1. లిబరలిజం - దాని చరిత్ర

నవయుగోదయం ఫలితంగా ప్రపంచ భూస్వామిక యుగం సంకెళ్ళనుంచి తప్పించుకొని, స్వేచ్ఛావాయువులు పీల్చ నారంభించింది. శాస్త్రీయ పరిశోధనలు, కొత్త దేశాలు కనిపెట్టడం, వైజ్ఞానిక రంగంలో నూతనమైన ఆలోచనా ధోరణి, నవమానవునికి కొత్త రూపం కల్పించినవి.

అంతవరకు పరిమిత ప్రాంతాలలో మాత్రమే వర్తక వ్యాపారాలకు అలవాటుపడిన వాణిజ్యవేత్తలు, వర్తక ప్రముఖులు దూరప్రాంతాలతో వాణిజ్య సంబంధాలు నెలకొల్పుకొనడం ప్రారంభించారు. కొత్తగా కనుగొన్న అమెరికా, నూతన రహదారి మార్గాలు కనుగొన్న ఇండియా ప్రపంచ వాణిజ్య విప్లవానికి కారణమైనవి.

వీరి వర్తక వ్యాపారాల స్వేచ్ఛకు భూస్వామిక యుగం లోని ప్రధాన శక్తులు అవరోధం కలిగించినవి. అందులోను మతం, మతసంస్థలు హెచ్చు చిక్కులు కలిగించినవి.

ఇదే సమయంలో భూస్వాములకు, నూతన రాజరికానికి మధ్య, అధికారాల పరిమితులను గురించిన తగాదా కూడా ప్రారంభమైంది. పరిస్థితులను బట్టి, పరస్పర లాభం కోసం, నూతన రాజరికవాదులు వర్తక వ్యాపార వర్గాలు చేతులు కలపడంతో క్రమక్రమంగా భూస్వామిక యుగం తన శక్తిని కోల్పోయింది. సంఘంలో భూస్వాముల పలుకుబడి తగ్గి వ్యాపారస్తులు, వాణిజ్యవేత్తలు, డబ్బు పెట్టుబడి పెట్టగలవారి పలుకుబడి హెచ్చింది.

ఈ పోరాటంలో పాత సాంఘిక వ్యవస్థపై నూతన వర్గాలు ఉపయోగించిన ఆయుధమే లిబరలిజం. తన అధికారాలను సుస్థిరం చేసుకోనడానికి నూతన సాంఘిక వర్గాలు ప్రచారం చేసిన తత్వమే లిబరలిజం.

సాంఘికకట్టుబాట్లు, నైతిక ప్రయోజనాలు, పేరుతో భూస్వామికయుగంలో బ్యాంకర్ మీద, వర్తకునిమీద, పారిశ్రామికునిమీద, అనేక నిర్బంధాలు, ఆంక్షలు ప్రయోగింపబడినవి. వ్యక్తి అభిరుచి, వ్యక్తిగత చర్యలు అనేవి కొంత వరకు అణచివేయబడినవి. అందువల్ల ప్రారంభంలో లిబరలిజం వాదన ఇలా వుండేది.

"నిరంకుశాధికారానికి వ్యతిరేకంగా రక్షణ; అందరికీ సమానంగా వర్తించే న్యాయశాస్త్రం; వాక్, సభా స్వేచ్ఛ, ఆలోచనలపై, విశ్వాసాలపై నిబంధనల తొలగింపు, ప్రత్యేక వర్గ సదుపాయాలు రద్దు."

"ఎవరి తరహాకు వారిని వదిలివేస్తే సాంఘిక పురోభివృద్ధి సాఫీగా వుండగలదు." ఇది అప్పటి నూతన సాంఘిక వర్గాల విప్లవ ప్రబోధం.

ఈ సూత్రాలు ఆధారంగా 15వ శతాబ్దంలో, మధ్య తరగతిగా వున్న వర్తక వ్యాపార వర్గాలు, భూస్వామిక యుగంపై కత్తికట్టడానికి నూతన రాజరికంతో ఏకమైనవి. కాని 17వ శతాబ్దానికి రాచరికవాదాన్నికూడా అదుపులో పెట్టడానికి పూనుకొన్నవి. అప్పటి డచ్, ఇంగ్లండుల చరిత్ర దీనికి నిదర్శనం.

16 వ శతాబ్దం చివరదశలో గాని లిబరలిజం ప్రధాన సూత్రాల దిగ్విజయానికి అనువగు పరిస్థితులు ఏర్పడలేదు.

పారిశ్రామిక విప్లవంవల్ల యూరపియన్ సాంఘిక వ్యవస్థలో పెద్ద మార్పు వచ్చింది. పరిశ్రమలలో, వ్యాపారం వల్ల, బ్యాంకింగ్ వల్ల డబ్బు సంపాదించుచున్న వారి సంఖ్య పెరిగింది. వీరందరూ ప్రత్యేక వర్గంగా ఏర్పడి ఆర్థిక స్వాతంత్ర్యం కోసం, వ్యక్తి స్వాతంత్ర్యం కోసం పోరాటాలు ప్రారంభించారు. దీనికి ఉదాహరణ ఫ్రెంచి విప్లవం.

ఈ పోరాటం జయం పొందిన తరువాత లిబరలిజం ప్రాతిపదికలు ఇలా మార్పు చెందినవి.

సివిల్ స్వాతంత్ర్యం (చట్టరీత్యా వివాద పరిష్కారం) ఫిస్కల్ స్వాతంత్ర్యం (పన్ను చెల్లించనిదే ప్రాతినిధ్యం లేక పోవడం) వ్యక్తిగత స్వాతంత్ర్యం (వాక్, సభా ఆలోచనా స్వాతంత్ర్యం); సాంఘిక స్వాతంత్ర్యం (ప్రత్యేకవర్గ సదుపాయాలు రద్దుకావడం) ఆర్థిక స్వాతంత్ర్యం (వర్తక వ్యాపారాలపై నిబంధనలు తొలగించబడి, స్వేచ్ఛగా వాణిజ్యానికి అవకాశం;) గృహస్వాతంత్ర్యం, (భార్యకు భర్తకు పిల్లలకు హక్కులు) స్వయం నిర్ణయాధికారం (స్థానికం; జాతీయం) అంతర్జాతీయ స్వాతంత్ర్యం (యుద్ధప్రమాద నివారణ).

అనుభవంమీదగాని మానవులు ఆలోచనలు మార్చుకొనరు. 19 వ శతాబ్దం తుదిని, మానవాభ్యుదయానికి సాంఘికంగా అవరోధాలు తొలగించడమే కాక, సమష్టిగా కూడా కొన్ని అవకాశాలు కలిగించడం అవసరమని

లిబరలిజం గుర్తించింది. దాని ఫలితంగా (1) వైద్య సౌకర్యాలు, విద్యాసదుపాయాలు. (2) సాంఘిక భద్రతకు ఏర్పాట్లు (3) శ్రమ ఫలితంగా ఉత్పత్తి జరిగిన సంపదలో వాటా మాత్రమే కాక, దాని యాజమాన్యానికి కూడా అవకాశం వుండాలనే వాదన ప్రారంభమైంది.

అయితే ఉత్పత్తిసాధనాలను జాతీయం చేయాలనే సోషలిస్ట్ పద్ధతులను అంగీకరించక, వ్యక్తి స్వాతంత్ర్యానికి, ఆత్మగౌరవానికి వాని ప్రాబల్యానికిగాను "ఆస్తి హక్కు" అనేది వున్నప్పుడే సాంఘిక పురోభివృద్ధి సుసాధ్యమని లిబరలిజం వాదించింది.

యూరపు – అమెరికా ఆసియాలలోని సాంఘిక–రాజకీయ పద్ధతులలో లిబరలిజం, పూర్తి మార్పులు తెచ్చింది. వ్యక్తి పునరుద్ధరణ, ప్రజాప్రభుత్వం, వ్యక్తిగత వ్యాపార స్వాతంత్ర్యం, అంతర్జాతీయత అనేవి దీని ఫలితాలని చెప్ప వచ్చు. చివరకు న్యూడీల్ (అమెరికాలో) వార్ సోషలిజం (రష్యాలో) కూడా దీనిలో భాగాలే.

లిబరలిజం ఇంతటి మహోన్నతాశయాలు కలదైనా, ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం ఏర్పడిన సమస్యలను అది పరిష్కరించలేక పోయింది. ఉత్పత్తి సాధనాలపై వ్యక్తి యాజమాన్యం, దానికి సంబంధించిన ఆర్థిక సిద్ధాంతాలను అది కాదనలేక పోవడమే దానికి కారణం. సాంఘిక శ్రేయస్సు సాధనకు, వ్యతిగతమైన చర్యలపై దానికి హెచ్చు విశ్వాసం వున్నందున సాంఘికాభున్నతి కవరోధంగా వుండే కొన్ని వర్గాల ప్రాబల్యాన్ని అది తగ్గించలేక పోయింది.

అందువల్లే అది కొల్పిన ప్రభుత్వాలు పలుకుబడి కలిగిన కొన్ని వర్గాల ప్రభుత్వాలుగా రూపొందినవి. వాటినుంచి కేపిటలిజం అభివృద్ధిచెంది అతివాద జాతీయవాదం సహాయంతో ప్రపంచం మొత్తంమీద ఆర్థిక రంగంలో పోటీలు పెట్టి, ఇంపీరియలిజంను వ్యాపింప చేసింది. ప్రపంచంలో నిరంతర యుద్ధ వాతావరణాన్ని సృష్టించింది :

లిబరలిజం ప్రధాన సిద్ధాంతాల ఫలితంగా, నవనాగరికతకు జీవనాడు లనదగిన ఆర్థిక వ్యక్తిత్వం (కేపిటలిజం) రాజకీయ వ్యక్తిత్వం (బూర్జువా ప్రజాస్వామికం) అనే రెండు కొత్త వ్యవస్థలు ప్రచారంలోకి వచ్చినవి. జాతీయాభ్యుదయానికి, స్వాతంత్ర్య రక్షణకు ఇవి రెండూ అత్యవసరమని కొందరు ఆర్థిక శాస్త్రజ్ఞులు వాదించడం కద్దు.

కాని ఆర్థికాభ్యుదయం ప్రజాస్వాతంత్ర్యం అనేవి నామమాత్రం కావడంతో ఈ రెండు వ్యవస్థలు తమ ప్రతిష్టను కోల్పోయినవి.

కేపిటలిజంవల్ల "కలవారు" "లేనివారు" అనే భేదం ఏర్పడి వారి మధ్య నిరంతర సంఘర్షణ ప్రారంభమైంది.

బూర్జువా ప్రజాస్వామికం ధనం కలవారు తమ ప్రతిష్టను, పలుకుబడిని పెంచుకొనడానికి కావలసిన రాజకీయ ప్రయోజనాలు పొందడానికి సహాయం చేసింది.

దీనితో ఆర్థిక అసమానత్వం, రాజకీయ పక్షపాతం అనేవి ఏర్పడి సోషలిజం, కమ్యూనిజం, ఫాసిజం పుట్టుకకు కారణమైనవి.

# 2. కేపిటలిజం - దాని లోపాలు

ప్రతి సంఘంలోను పరిష్కరించవలసిన ఆర్థిక సమస్యలు మూడు రకాలుగా వుంటవి.

(1) సంఘంలో వాడకానికి ఏరకం వస్తువులు ఎంత మేరకు ఉత్పత్తిచేసి, సంఘం ఉత్పాదక శక్తులను పెంపు చేయాలి ? (2) కావలసిన వస్తువుల ఉత్పత్తికి ఏ పద్ధతులు అవలంబించాలి ? (3) ఉత్పత్తి జరిగిన మొత్తం సరుకులలో సంఘంలోని ప్రతి ఒక్కరికి ఎంత భాగం అందాలి ?

ప్రతి యుగంలోను, అన్ని సంఘాల ఆర్థిక సమస్యలు ఇదే ప్రాతిపదికలో వున్నా సాంఘిక, వైజ్ఞానిక పరిస్థితులను బట్టి, వాటి పరిష్కార మార్గాలు మారుతూ వచ్చినవి.

మనతరంలో ధరలు పెరుగుదల తరుగుదల ద్వారా వ్యక్తి అభిరుచి వ్యక్తంచేయబడి, ఏ తరగతి వస్తువులు ఎంతగా ఉత్పత్తికావాలనే విషయం నిర్ణయమౌతున్నది. సరుకుల ఉత్పత్తికి ఎంత తక్కువ ఖర్చు కాగలదనే దానిని బట్టి ఉత్పత్తి పద్ధతి అవలంబించబడు తున్నది. ఆస్తినిబట్టి కాయకష్టాన్నిబట్టి, ఆదాయాలు నిర్ణయింపబడి, ఎవరి శక్తికొలది వారు ఆదాయం ప్రాతిపదికగా సంఘం మొత్తం మీద ఉత్పత్తి జరుగుతున్న సరుకులను అనుభవిస్తున్నారు.

ఒక్కమాటలో చెప్పుకోవాలంటే ధరల తారతమ్యాన్నిబట్టి ప్రధాన ఆర్థిక సమస్యల పరిష్కారం జరుగుతున్నది.

ఈ ధరల తారతమ్యం కూడా కొన్ని సంఘాలలో స్వేచ్ఛగా, పరిస్థితులనుబట్టి అమలు జరుగుతున్నది. కొన్ని చోట్ల కంట్రోల్ చేయబడి, అవసరాలకు అనుగుణంగా మార్చబడుతున్నది.

ధరల తారతమ్యానికి స్వేచ్ఛవుండే సంఘంలో కొనేవారికి, అమ్మేవారికి మాత్రమే కాక, కొనేవారిలోనూ, అమ్మేవారిలోనూ కూడా అంతరంగికమైన పోటీ వుంటుంది. కొనేవారు, అమ్మేవారి సంఖ్యాబలాన్నిబట్టి కూడా ఈ పోటీ మారుతూ వుంటుంది. ఇదికూడా ప్రయివేటు వ్యాపారానికి వ్యక్తిగతమైన ఆస్తికి అవకాశం వున్నప్పుడే సుసాధ్యం.

ఇలా ఉత్పత్తి రంగంలో వ్యక్తిగతమైన ఆస్తికి వ్యాపార రంగంలో ప్రయివేటు వ్యాపారానికి అవకాశం వుండి, ధరల తారతమ్యం ప్రకారం ప్రధాన ఆర్థిక వ్యవస్థలు పరిష్కరింపబడే వ్యవస్థను కేపిటలిజం అన్నారు.

15 వ శతాబ్దంనుంచి 18 వ శతాబ్దంవరకు దీని అభివృద్ధికి కారణాలు రెండు. ఒకటి : ఆస్తిగల వర్తకవర్గం. వీరివల్ల కేపిటలిజాన్ని బలపరచే న్యాయశాస్త్రం ఏర్పడింది. రెండు : నిర్మతతత్వం (సెక్యులరిజం). దీనివల్ల కేపిటలిస్టు నైతిక సిద్ధాంతాలు బయలుదేరినవి. మధ్యయుగంలో క్రైస్తవ పీఠాల ప్రాబల్యం భూస్వాముల పలుకుబడిపై సాగిన వ్యతిరేక ప్రచారం, (రినైజాన్సు ఉద్యమం) పారిశ్రామిక విప్లవం కేపిటలిజానికి సహాయమైనవి.

కేపిటలిజం అభివృద్ధిని రెండు తరహాలుగా విభజించారు. ఒకటి : కమ్మర్షియల్ కేపిటలిజం, (వర్తక వాణిజ్యాభి

వృద్ధి), రెండు : ఇండస్ట్రియల్ కేపిటలిజం (పారిశ్రామికాభి వృద్ధి.)

కమ్మర్షియల్ కేపిటలిజం వల్ల ఇండస్ట్రియల్ కేపిట లిజానికి కావలసిన రాజకీయమైన ఆర్థికమైన పునాదులు గట్టిపడుతవి. వర్తక వ్యాపారాలలో సంపాదించిన ధనం భారీ పరిశ్రమలు నెలకొల్పడానికి ఉపయోగించ బడుతుంది. ఈనాడు ఇండియాలో కమ్మర్షియల్ కేపిటలిజం మాత్రమే వ్యాప్తిలో వుంది. లాభమే ప్రధానంగా వర్తక వాణిజ్యాలు జరుగుతున్నవి.

కేపిటలిజంలో ఆస్తి అనేది కొందరి అధికారంలో మాత్రమే వుంటుందని, "వంశపారంపర్యపు హక్కు"ల ప్రాబల్యం పెరిగి, అధిక సంఖ్యాకులు, జీవనభృతికోసం అల్పసంఖ్యాకులైన ఆస్తిపరుల దయాధర్మం మీద ఆధారపడి వుండవలసి వస్తుందనే విమర్శ మొదటిది.

ఉపయోగం, అవసరం అనే దృష్టితో కాకుండా, లాభం, అమ్మకం అనే ప్రాతిపదికపై వస్తూత్పత్తి జరిగి, అవకాశాన్నిబట్టి హెచ్చు ధరలకు కొనుగోలుదారులకు అమ్మజూపడమనేది కేపిటలిజాన్ని గురించిన రెండవ విమర్శ.

ఆర్థికంగా సంఘంలో అనిశ్చిత పరిస్థితి ఏర్పడి నిరుద్యోగం, బీదతనం, అధికసంఖ్యాకులు నిత్యం ఒకరిమీాద ఆధార పడవలసిన "కరువు" పరిస్థితులలో జీవిస్తూ వుంటారనేది మూడవ విమర్శ.

కేపిటలిజంలో ప్రధానమైన ఈ లోపాల పరిష్కారానికి సోషలిజం ఒక మార్గమనేది ఒక సూచనమాత్రమే కాక, అది కొందరి విశ్వాసంగా వుందికూడా. వారి వాదన ఇది :

ఆదాయాలలో విపరీతమైన తేడాలవల్ల సాంఘికమైన అవకాశాలలో వర్గప్రాబల్యంవల్ల కొనుగోలుదారులకు సమానావకాశాలు కేపిటలిజంలో వుండనందున, వీటిని సాధించడం అత్యవసరం.

అందరికీ పని లభింపజేసి సుస్థిరమైన ఆర్థికవ్యవస్థ కేపిటలిజంలో వుండదు. కనక దానిని సాధించాలి.

ప్రకృతి సంపదలు అందరూ చక్కగా ఉపయోగించడానికి వీలు లేకపోగా ఆర్థికాభ్యుదయంకోసం జరిగే ఉత్పత్తిలో ఖర్చు తగ్గింపు ప్రయత్నాలు జయంపొందడం సమాజ క్షేమం దృష్ట్యా కేపిటలిజంలో అసాధ్యం. కనక వానిని సుసాధ్యం చేయాలి.

కేపిటలిస్టు వ్యవస్థవల్ల సంఘంలో పాదుకొనిపోయిన (1) వ్యక్తిగత ఆస్తి (2) ఆస్తి వారసత్వం (3) ప్రయివేటు వ్యాపారం (4) మార్కెట్‌లో పోటీ అనే "ప్రత్యేక సంస్థలు" సాంఘిక ప్రయోజనాన్ని ఆశించే ప్రతి సంస్కరణను వ్యతిరేకిస్తున్న ఫలితంగా "అధిక సంఖ్యాకులను ఆర్థికంగా మంచి జరగడం"కోసం కేపిటలిజానికి స్వస్తి చెప్పాలి.

కేపిటలిజంలోని ఈ లోపాలను వాదనలో అంగీకరించడం జరిగినా కేపిటలిస్టు వ్యవస్థ సంస్కరింపబడే "పంథా"ను గురించి మాత్రం ఏకాభిప్రాయం కుదరలేదు.

రాజకీయంగా కక్షలు పెంచుకొన్న పార్టీలు వాటి లక్ష్యా లను సవరించి, తమ విమర్శకు పాత్రమైన వ్యవస్థలనే తిరిగి సమర్థిస్తున్నవి. దీనినే విభిన్న రాజకీయ పార్టీల విరుద్ధ ఆర్థిక వైఖరులు అంటున్నారు.

ఎవరి వైఖరి ఎలా వున్నా కేపిటలిజం అనేది చారిత్ర కంగా పతనంకాక తప్పదని ఒక సిద్ధాంతాన్ని ప్రచారం చేసినవాడు కారల్ మార్క్స్. తన సిద్ధాంతాన్ని వివరిస్తూ "కేపిటల్" అనే ఒక గ్రంథాన్ని వ్రాశాడు. ఆర్థిక శాస్త్రంలో, నూతన ఆలోచనా ధోరణికి ఇది ఆదిగ్రంథం.

# 3. ఇంపీరియలిజం - దాని వ్యాప్తి

"మన సరుకులు కొనడానికి తగిన డబ్బు మన ప్రజలకు లేనప్పుడు ఆ సరుకులను విదేశాలలో అమ్ముకొందాం." ఇది అన్ని దేశాలలోని వర్తక వాణిజ్య వేత్తలు ఎల్లప్పుడూ చేసే వాదన. అంతేకాదు, తమ దేశంనుంచి ఎంత హెచ్చుగా సరుకులు ఎగుమతి జరిగితే అంత లాభం కలదని చెప్పేవారు కూడా వారిలో వున్నారు.

స్వదేశంలో ప్రజలు బీదలుకనక విదేశాలలో సరుకు అమ్ముకుందామనే యోచనేకాని, స్వదేశానికి కావలసిన యంత్రపరికరాల దిగుమతికిగాను ఇలా చేద్దామనేది వారి మాటలల్లో కనిపించదు.

"మన సరుకులు ఎవరు కొంటారు ?" అనే ప్రశ్నకు వారికి సులభంగాతట్టిన పై సమాధానం ఫలితంగా రాగల చిక్కుల సంగతి కూడా వారికి అవసరం లేదు. అందువల్లనే తమ మిగులు సరుకులు అమ్మజూపడానికిగాను ప్రపంచంలో మార్కెట్లను కనిపెట్టడానికి ముందుగా బయలుదేరతారు. తమవద్ద విపరీతంగా నిల్వలోవున్న మోటారుకార్లు, తేయాకు, రబ్బరు, బట్టలు, వినోదవస్తువులు, విదేశస్థులకు అమ్మి సొమ్ము చేసుకుంటారు.

ఇలా సంపాదించిన లాభాలతో ఏవో పరిశ్రమలు నెలకొల్పి, యంత్ర పరికరాలు, చిన్నచిన్న యంత్రాలు, యంత్రభాగాలు, రైళ్ళు, విద్యుచ్ఛక్తి మిషన్లు వుత్పత్తి చేయడానికి పూనుకుంటారు. వీటినే ఉత్పత్తి సాధనాలు అంటారు. కాలం గడచినకొలది కొనుగోలు వస్తువులలో (బట్టలు, రేడియోలు, ఆహార పదార్థాలు) ఉత్పత్తి తగ్గి, ఉత్పత్తి సాధనాల (యంత్రాలు, రైళ్ళు వగైరాలు) తయారీకి ప్రాధాన్యం హెచ్చుతుంది. బ్రిటన్, అమెరికా దేశాల పారిశ్రామిక చరిత్ర ఇందుకు ఉదాహరణ.

ఈ యంత్రాల ఖరీదు హెచ్చుగా వుంటుంది. బీద దేశాలకు వీటిని కొనగల శక్తి ఎక్కడనుంచి వస్తుంది ? ఇండియా, ఆఫ్రికావంటి దేశాలకు మాత్రమే వీటి అవసరం హెచ్చుగా ఉంటుంది. తగినంతగా ఆర్థిక స్థోమత లేని ఈ దేశాలకు ఇతర పారిశ్రామిక దేశాలు తమ అవసరం

కొద్దీ అప్పులు పెట్టడానికి పూనుకుంటవి. దీనినే విదేశాలలో "పెట్టుబడులు" లేదా "పెట్టుబడుల ఎగుమతి" అంటారు.

కనక విదేశాలలో మార్కెట్ల సంపాదన ప్రయత్నం మూడు దశలుగా పరిణామం చెందుతుం దన్నమాట. (1) కొనుగోలు సరుకుల ఎగుమతి (2) ఉత్పత్తి సాధనాల ఎగుమతి (3) పెట్టుబడుల ఎగుమతి, విదేశాలలోనే పరిశ్రమలను నెలకొల్పడం : అంటే రైల్వే యింజనులు, విద్యుచ్ఛక్తి యంత్రాలు "అరువుగా" యివ్వడమే కాక బట్టల మిల్లులు, గనులు, తేయాకుతోటలు వగైరాలు కొని "సొంతంగా" నడుపుకొనడం జరుగుతుందన్నమాట.

ఇలా వచ్చిన విదేశస్థులు తమ దేశంలోని "ఆర్థిక వ్యవస్థనే" విదేశాలలో కూడా నెలకొల్పడానికి పూనుకుంటారు. దీనికి ఆసియా, ఆఫ్రికా దేశాల చరిత్ర చక్కని ఉదాహరణ.

మన సరుకులు ఎవరు కొంటారు ? అనే ప్రశ్నకు ఆర్థిక సంబంధమైన సమాధానాన్ని పొందాయి కాని, రాజకీయ సంబంధమైన పరిణామాలు కూడా చూస్తే దీని విషమ ఫలితాలు మనకు అర్థం కాగలవు.

పైన వివరించిన నాలుగు దశల తుది ఫలితానికి రాజకీయశాస్త్రం ఒక పేరు పెట్టింది. అదే "ఇంపీరియలిజం."

కొనుగోలు సరుకులు ఎగుమతిచేసే దశలో సరుకు "అమ్మకం" ప్రధానమేకాని విదేశాలలో "పెత్తనం సంపాదిద్దాం" అనే ఆలోచన వుండదు. కాని ఉత్పత్తి సాధనాలు,

పెట్టుబడులు ఎగుమతి చేసేటప్పుడు ధోరణి మారుతుంది. "మనసొమ్ము ఏమౌతుందో ?" అనే ఆందోళన ఈ దశలో ప్రారంభమౌతుంది. పెట్టిన అప్పుపై "వడ్డీ" చెల్లింపబడక పోవచ్చు ? దేశంలో విప్లవంవచ్చి "తన కంపెనీ" నాశనం కావచ్చు ? మరొక దేశం యుద్ధానికి వచ్చి జయం పొంది, "నా" ఆస్తిని స్వాధీనం చేసుకొనవచ్చు ? ఇలాంటి అను మానాలు కూడా కనిపిస్తవి.

విదేశాలలో సొంతంగా కంపెనీలు పెట్టి వ్యాపారం నడిపే దశలో (చివరిదశలో) దేశీయ "కార్మికుల" అవసరం వుంటుంది. విదేశాలలో పెట్టుబడి పెట్టిన సొమ్ము ఎప్పటి కప్పుడు తిరిగి తీసుకొనడానికి అవకాశం వుండదు. కనక ఆ యా ప్రాంతాలలో రాజకీయాధిపత్యం సంపాదించడం అవసరమౌతుంది. తూర్పు ఇండియా కంపెనీ తన జీవితాన్ని ఇలాగే ప్రారంభించి, ఇండియాను "స్వాహా" చేసింది.

మరొక కారణంవల్ల కూడా రాజకీయాధికారం సంపాదించవలసి వస్తుంది. దేశీయులు తప్పనిసరిగా విదేశ కంపెనీలలో పనిచేసేటట్టు చూడడానికి, వారిపై దేశీయ ప్రభుత్వం పన్నులు విధించాలి. ఇతర దేశస్థులు కాని, కంపెనీలుగాని పోటీకి రాకుండా వుండాలి. ఇన్ని కారణాల వల్ల విదేశాలపై రాజకీయాధికారం సంపాదించడం, దానిని సుస్థిరం చేసుకొనడం జరుగుతుంది. దీనికే మరొక పేరు "కలోనియలిజం" ఆఫ్రికా ఖండం దీనికి ఉదాహరణ.

ఇది కేవలం ఊహాచిత్రం కాదు. 50 సంవత్సరాల కింద ప్రారంభమై నేటికీ జరుగుతున్న "బడుగుదేశాల దోపిడీ" చరిత్ర ఇది.

ఈ శతాబ్దారంభం వరకు బానిస దేశాలలో "ఈ దోపిడి" అవిచ్ఛిన్నంగా సాగింది. ప్రపంచంలో "కాళీ"గా వున్న ప్రాంతాలు ఇక లేకపోయినవి. 1914 నాటికి "కొన్ని సామ్రాజ్యాలు" విపరీతంగా పెరిగి ప్రతి దేశంలోనూ "ఇరుగు పొరుగు"వారైనారు.

అయినా "మన సరుకులు ఎవరు కొంటారు ?" అనే ప్రశ్నతో ఆ సామ్రాజ్యాల వర్తక వాణిజ్య వేత్తలు ఆలోచనలు ప్రారంభించారు. వీరి ఆలోచనలు ఫలించడానికి ప్రపంచంలో "కాళీగా"వున్న ప్రాంతాలు లేవు గదా : ఇంక వీరిలో వీరికి సంఘర్షణలు ప్రారంభమైనవి. వీనికే "ప్రపంచ మహాయుద్ధాలు" అని పేరు పెట్టారు.

1918 తో ఈ సంఘర్షణ నిలిచిపోయింది. కొన్ని సామ్రాజ్యాలు "పోటీ" నుంచి తప్పుకొన్నవి. ఆనాటినుంచి వీటి స్థానంలో మిగిలినవాటి వ్యాప్తి ప్రారంభమైంది. చివరకు 1939 లో మరొకసారి ఢీకొన్నవి. తిరిగి ఢీకొనడానికి యిప్పుడు సిద్ధపడుతున్నవి కూడా.

మన సరుకులు ఎవరు కొంటారు ? అనే ఆలోచన ఫలితంగా ప్రారంభమైనవే ఈ యుద్ధాలు. "కేపిటలిస్టు దేశాలలో ప్రజల కొనుగోలు శక్తిని పెంపొందింప జేయుడానికి ఇంపీరియలిస్టు విధానాలు అవలంబించిన ఫలితమే ఈ ప్రపంచ యుద్ధాలు."

# 4. ఫాసిజం - దాని పుట్టుక

"దేశంలో గత ఏడాదికంటె ఉత్పత్తి ఎక్కువగానే సాగింది. అయినా పరిస్థితులను బట్టి మనం ఇంకా కొన్ని చిక్కులను ఎదుర్కొనవలసి వున్నది. ప్రజలంతా ఇంకా త్యాగం చేయడానికి సిద్ధపడాలి."

ఈ మాటలు లేకుండా అన్ని దేశాలనాయకులందరూ, అది ఏసభ అయినా, తమ ఉపన్యాసాలను పూర్తిచేయడం లేదు.

కార్మికులు కష్టపడుతున్నారు. అధికోత్పత్తి సాగుతున్నది. కాని వారికి పొట్ట గడవడంలేదు. మరి అధికంగా ఉత్పత్తిచేసిన ఫలితం ఏమిటి?

దేశంలో అధికంగా జరిగిన ఉత్పత్తులు విదేశాలకు "ఎగుమతి" జరుగుతున్నవి. విదేశాలకు జరిగే ఈ ఎగుమతులు "ఇంపీరియలిజం" పుట్టుకకు కారణమై, వివిధ దేశాల మధ్య సంఘర్షణకు దారితీస్తూ ప్రపంచ యుద్ధాలు తెచ్చిపెడుతున్నవని చరిత్ర చెబుతున్నది. చరిత్ర ఇంకా ఇలా చెబుతున్నది కూడా:

"సంపదలు వున్నా సౌఖ్యంగా జీవించడానికి అవకాశం లేనందున "యజమానుల" కోసం పోరాటం సాగించడానికి వ్యతిరేకించదలచిన కార్మికులు సంఘాలు ఏర్పరచుకుంటున్నారు. ట్రేడ్ యూనియన్లు, సహకార సంస్థలు, రాజకీయ పార్టీలుగా ఇవి ఒక ఉద్యమంగా అభివృద్ధి చెందుతున్నవి.

" ఈ ఉద్యమాల ఫలితంగా హెచ్చు వేతనాలు, తక్కువ పనిగంటలు, పనిలో సౌకర్యాలు, తదితర ఆర్థిక సదుపాయాల కోసం కార్మికులలో ఆందోళన బయలుదేర డంతో యజమానులకు స్వేచ్ఛ లేకుండా పోవడమే కాక, వారికోసం త్యాగాలు చేయడానికి కార్మికులు వ్యతిరేకించడం జరిగింది.

"దీనిని యజమానులు సహించలేక పోయారు. తమ కోసం తమ లక్ష్యాల సంసిద్ధికోసం ప్రజలంతా త్యాగాలు చేయక తప్పదని వారి వాదన. దీనితో ప్రజలకు స్వతంత్రాభి ప్రాయాలు కలిగించే సంస్థలపై యజమానులు, పాలకులతో కలిసి కత్తికట్టారు. మొదటి ప్రపంచ యుద్ధానంతరం జర్మనీలో దీనికి నాందిప్రస్తావన జరిగింది.

"ప్రజా సంస్థలు – వాటి ప్రచారం అనేదికూడా కొన్ని దేశాలలోని అధికారవర్గాలకు కంటకప్రాయ మైంది. " జీవితాలను త్యాగం చేయం డని'' తమ ప్రజలను ఎప్పటికైనా కోరక తప్పదని వీరికి తెలుసు. "ఇలా త్యాగం చేయవలసిన అవసరం ఏమి'' టనే ప్రశ్న ప్రజల మనస్సులలో కలిగితే వారు అసలు త్యాగం చేయరని కూడా వారికి తెలుసు. ఈ అనుమానాలు అసలు కలగకుండా చేయడానికి ఉద్భవించిన నూతన నిరంకుశాధికారమే "ఫాసిజం.'' యుద్ధ సందర్భంలోనే కాక శాంతి సమయంలో కూడా దేశాన్ని " మిలిటరీ మయం" చేయడం దీని ప్రధాన లక్ష్యం.

ముందుగా దేశంలో సమ్మె చేయడానికి హక్కు లేకుండా చేస్తుంది ఫాసిజం. ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని

ఛిన్నాభిన్నం చేయడమే కాక సమ్మె చేయడం "శాసన విరుద్ధం" అని ప్రకటిస్తుంది. దీనితో యజమానులను "కాదనడానికి" "బేరం సాగించడానికి" కార్మికులకు అవకాశం లేకుండా పోతుంది.

ఫాసిస్టు దేశాలలోని చరిత్ర ఈ విషయాలను ధృవ పరుస్తున్నది. సమ్మెచేసే హక్కు రద్దు అయిన వెంటనే, కార్మిక సంఘాలు, వాటి అనుబంధ సంస్థలు, రాజకీయ పార్టీలు నామరూపాలు లేకుండా పోయి, ప్రజాస్వామికానికి ప్రాణ మనదగిన పౌరస్వాతంత్ర్యం నామమాత్ర మౌతుంది. యజమానుల పెత్తనం అవిచ్ఛిన్నంగా సాగిపోతుంది."

కనక దేశీయ యజమానులు ప్రపంచంలో మార్కెట్ల సాధనకు సాగించే కృషికి సహాయం చేయగల ప్రభుత్వ వ్యవస్థను ఈ విధంగా నెలకొల్పి, తమ లక్ష్యాలను సిద్ధింప చేసుకుంటారు. దీనికే మరొక పేరు ఫాసిజం.

ప్రజల హక్కులు, స్వాతంత్ర్యాలను పరిమితం చేయ డానికి ఫాసిజం కేవలం "తుపాకుల" మీదనే ఆధారపడదు. ఆధునిక ప్రచార సాధనా లన్నింటిని ప్రజలపై ఉపయో గిస్తుంది. ప్రజల ఆలోచనాశక్తిని కూడా తనకు "బానిసగా" చేసుకొనడానికి పూనుకుంటుంది.

వాస్తవిక పరిస్థితులు ప్రజాసముదాయానికి అర్థం కాకుండా చేయబడతవి. రకరకాల సిద్ధాంతాలు, వాదనలు ప్రచారంలోకి వస్తవి. కొన్ని జాతులు (జర్మనీలో యూదులు) లేదా కొన్ని రాజ్యాల "కుట్ర" వల్ల ప్రజలకు ఈ కష్టాలు

సంభవించినవని "ఉద్రేకాలు" రెచ్చగొడతారు. అప్పుడు "మీకు తోచినవిధంగా" చేయమని ప్రజలను "రంగంలోకి" ఉరికిస్తారు.

ఇందులో ఒక భాగమే దేశంలోని వైజ్ఞానిక శక్తులపై దండయాత్ర. జర్మనీలో నాజీలు అధికారానికి వచ్చిన వెంటనే అనేక గ్రంథాలను బహిరంగంగా బజార్లలో తగలబెట్టారు. నాటితోనే జర్మన్ పురాతన నాగరికతకు స్వస్తి జరిగింది.

నాగరిక లక్షణ మనదగిన సుఖజీవితానుభూతిని ఫాసిజం అంగీకరించదు. "యుద్ధసన్నద్ధ స్థితి"లో వుండాలని ప్రజలను అది కోరుతుంది.

అవసరాలను తగ్గించుకోనమని, ప్రభుత్వ భద్రతకు ప్రాధాన్య మివ్వాలని, ఎన్ని చిక్కులు వచ్చినా భరించడానికి తగుశక్తిని సమకూర్చుకోవాలని ప్రబోధం చేస్తుంది.

అయితే, రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిజం సర్వనాశనం చేయబడింది కనక వాటిని గురించి ఇంకా ఆలోచన దేనికనే అనుమానం కొందరికి రావచ్చు.

ఫాసిజం అనేది ఒక్క జర్మనీ, ఇటలీలకు పరిమితమైనదే కాదు. ఏదో ఒక కాలంలో హఠాత్తుగా ప్రపంచానికి పట్టిన జాడ్యం కూడా కాదది. "అభ్యుదయకరమైన ఆర్థిక వ్యవస్థను నెలకొల్పడానికి అవరోధాలు హెచ్చిన విషమ ఫలితమే ఫాసిజం" ఏ దేశంలోనైనా అది అవతరించగలదు.

# 5. సోషలిజం - దాని లక్షణాలు

సోషలిజం వస్తే అందరి ఆస్తులు తీసుకుంటారటగా ?

ఇది చాలా చిన్నప్రశ్న అయినా అమాయకమైన ప్రశ్న అని చెప్పక తప్పదు.

వ్యక్తిగతమైన ఆస్తి అనేది రెండు రకాలు. ఒకటి : ఉత్పత్తిసాధనకు సంబంధించినది. ఉదాహరణ : ఫ్యాక్టరీలు, గనులు, భూములు. రెండు : కొనుగోలు సరుకులకు చెందినది. ఉదాహరణ : తిండిగింజలు, వస్త్రాలు, మోటారుకార్లు, తోటలు వగైరాలు. మన నిత్యావాడకానికి, మన అవసరాలకు సంబంధించినవన్నీ ఈ తరగతికిందికి చేరుతవి.

ఈ రెండురకాల ఆస్తులను చేర్చి ఒకే అర్థంలో వాడుకొనడంతో, అసలు చిక్కు ఏర్పడింది. అయితే ఈ రెండు రకాల ఆస్తులను విడదీయడానికి ఒక సూత్రం వుంది.

ఉత్పత్తికి సాధనమైన ఆస్తివల్ల ఆదాయం వస్తుంది. రెండవ దానివల్ల ఆదాయం రాదు.

ఒక మోటారు కంపెనీలో అయిదువేల రూపాయల విలువగల షేర్లు మనకు వున్నవనుకుందాం. వాటిమీద మనకు ఆదాయం వస్తుంది. అదే విలువగల ఒక మోటారుకారు వుంటే, అది మన వాడకానికి ఉపయోగిస్తుంది. కాని, ఇతరులనుంచి అంతే ఆదాయాన్ని తీయడానికి ఉపకరించదు. కేపిటలిస్టు వ్యవస్థలో ఇలా వుందనుకుందాం. ఇంక సోషలిస్టు

వ్యవస్థలో జరిగే దేమంటే, మోటారుకార్ల వాడకాన్ని పెంచడానికిగాను ఆ కార్ల కంపెనీని కొందరి సొంత ఆస్తిగా రద్దుచేయడం జరుగుతుంది.

అంటే కొద్దిమంది చేతులలోగల ఉత్పత్తికి సాధన మైన ఆస్తులను స్వాధీనం చేసుకొని, అందరి అధికారంకింద అందరికి పని లభించి న్యాయమైన ఫలితం ముట్టేటట్టు నిర్వహణ జరుగుతుంది.

ఇలా స్వాధీనం చేసుకున్న ఆస్తులన్నింటిని ఏమి చేస్తారనే అనుమానం వెంటనే కలుగుతుంది. ప్రభుత్వం స్వాధీనంలో వుంచుకొని, దాని అధికారులచేత నడిపిస్తుందా? ఇదే చాలామందికి సోషలిజం అంటే కలిగే అభిప్రాయం. కాని, వాస్తవం దీనికి విరుద్ధంగా వుంది.

ఉత్పత్తికి సాధనాలైన ఆస్తులన్నింటిమీద, సోషలిజం, ప్రాజాపత్యం కలిగిస్తుంది. అంతమాత్రంతో ఇవన్నీ ప్రభుత్వం సొంతం కావాలని లేదు. దేశంలోని పెద్ద పరిశ్రమలు—రైల్వేలు— తప్పకుండా ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రభుత్వం యాజమాన్యంకిందనే వుంటవి. ప్రజాప్రతినిధులతో నియమింపబడిన సంస్థలతో మరికొన్ని నిర్వహింపబడతవి.

స్థానికాధికార సంస్థలు — పురపాలక సంఘాలు, పంచాయితీలు, జిల్లాబోర్డులు—నడపగలిగిన స్థానిక సంబంధమైన చిన్న పరిశ్రమలు అనేకం వుంటవి.

ఉత్పత్తి వ్యవహారాలలో సహకార పద్ధతిని కొందరు కలిసి సమష్టిగా ఆస్తి యాజమాన్యాన్ని కలిగివుండ

టానికి అవకాశం వుంటుంది. వ్యవసాయం దీనికి చక్కని ఉదాహరణ.

కనక కేపిటలిజంలో ఎన్ని రకాలుగా వర్తక వాణిజ్యాలు జరగగలవో సోషలిజంలో కూడా అవే రకాలు వుంటవి. కాని వాటి నిర్వహణపద్ధతి మాత్రం భేదిస్తుంది.

అలా అయితే మరొక అభ్యంతరం చెప్పడం కద్దు. " ఆఫీసర్లతో " పరిపాలన చేయిస్తారా? అనేదే అది.

ఆఫీసర్లు అంటే, అధికారులు. పరిపాలనా నిర్వాహకులు, మానేజర్లు, గుమాస్తాలు అనే అర్థంలో ఆ మాట వాడితే, సోషలిజంలో కూడా ఇలాంటివారు వుండక తప్పదని చెప్పవలసి వుంటుంది. అయితే వీరు తక్కువ సంఖ్యలో వుంటారు. అనేక కంపెనీలు కొందరికి యిస్తున్నట్టు వేల కొలది జీతాలు ముట్టచెప్పడం జరగదు. వారికి ఆఫీసర్లు అనే నామకరణం కూడా వుండదు: హుందాతనంకోసం పని వున్నా లేకపోయినా, సిబ్బందిని పోషించడం జరగదు. కాగా ప్లాను ప్రకారం ఉత్పత్తి జరుగుతుంది. ప్లాను ప్రకారం ఉత్పత్తి అంటే ఏమిటి?

ఏమిటి ఉత్పత్తి చేయాలి? ఎందుకు ఉత్పత్తి చేయాలనే ప్రశ్నలకు సమాధానమే ప్లాను ప్రకారం ఉత్పత్తి అనేది. దీనికిగాను ఒక ప్లానింగ్ కమిషన్ వుంటుంది. ఏరకం సరుకులు ఏ మేరకు ఉత్పత్తి జరగాలనేది నిర్ణయించడమే వీరి ప్రధాన కర్తవ్యం. ఇందులోనే ప్రజల అవసరాల పరిగణన, దేశంలోని ఉత్పత్తి శక్తుల అంచనా జరుగుతుంది. ఆ తరువాత వీటి సమన్వయ విధానం నిర్ణయింపబడుతుంది.

ఇలా కేపిటలిజంలో చేయగూడదా? అనే అనుమానం కలుగుతుంది. ఇలా చేయవచ్చు. కాని లాభాలు తీయడం అనేది దానిలో ప్రాధాన్యం వహిస్తుంది. సోషలిజంలో ప్రజల "అవసరాలకు" ప్రధాన స్థానం వుంటుంది.

కనక ఈనాడు "సొంతం" అనేది లేనివారికి, సోషలిస్టు వ్యవస్థలో సొంతమని భావింపతగిన ఆధారాలు కలుగుతవి. ఒక్కొక్కరు సాధించిన ఫలితాలు సమష్టిగా అనుభవించడానికి అవకాశం కలుగుతుంది. అయితే "వేతనాలు" హెచ్చుగా వుంటవా? అని ఎవరైనా అడగవచ్చు.

కేపిటలిస్టు వ్యవస్థలో కార్మికుడు చేసేపనికి, పొందే ఫలితానికి సంబంధం వుండదు. కాని సోషలిస్టు వ్యవస్థలో పనినిబట్టి ఫలితం అనుభవించడం వుంటుంది: పడిన కష్టానికి తగిన ఫలితం అనేది సోషలిస్టు వ్యవస్థలో మూడు రకాలుగా కార్మికులకు అందుతుంది.

ఒకటి: కూలిగా ముట్టే మామూలు సొమ్ము. రెండు: సాంఘిక వేతనం. ఉదాహరణ: రవాణా వసతులు, విద్యా వైద్య సౌకర్యాలు, భీమా సౌకర్యాలు, వినోదం ఏర్పాట్లు. వీటికిగాను ప్రతి కార్మికుని వేతనంనుంచి కొంత వసూలు జరుగుతుంది. ఇలా చేర్చిన మొత్తం సంఘం మొత్తంమీద ఏర్పాట్లకు వినియోగించ బడుతుంది. మూడు: భవిష్యత్తులో సుఖపడటానికి తగిన ఆధారాలు. ఇది రెండు రకాలు. ఒకటి యిప్పటి సదుపాయాలను పెంచుకోవడం; రెండు: భవిష్యత్తు

కోసం కొత్త యేర్పాట్లు చేసుకోనడం. దీనినే ఆర్థిక పరిభాషలో పరిశ్రమలలో పెట్టుబడి అంటారు.

అయితే ఈ విషయంలో కేపిటలిజానికి సోషలిజానికి భేదం యేమిటి ?

కేపిటలిజంలో ఆదనంగా వచ్చిన లాభాలు కొందరి వ్యక్తుల సొంత ఆస్తి కాగలవు. దీనిని వారు పెట్టుబడిగా వినియోగించవచ్చు, వినియోగించక పోవచ్చు. అది వారి యిష్టానిష్టాలమీద ఆధారపడి వుంటుంది. దీనికి శాసనరీత్యా రక్షణ కూడా ఏర్పరచబడుతుంది. సోషలిస్టు వ్యవస్థలో అలా జరగదు. అదనంగా వున్న ప్రతి దమ్మిడీ అధికోత్పత్తి సాధనాలకు రిజర్వు చేయబడుతుంది. దాని ద్వారా కొత్త పరిశ్రమలు నెలకొల్పబడి కొత్త ఉద్యోగాలు, అదనపు వస్తువులు, పెక్కు అవకాశాలు కలిగించబడతవి. ఇలాగే చేయాలని ప్రభుత్వం శాసిస్తుంది.

అధికోత్పత్తి జరిగినకొలదీ వేతనాలు పెరుగుతవని అంటున్నారు కదా. అందరికీ సమానంగా వేతనాలు యిస్తారా ? అని ప్రశ్నించవచ్చు. ఎప్పటికీ ఇలా జరగదు. వ్యక్తికివుండే పనితనం, తెలివితేటలనుబట్టి మాత్రమే వేతనాల పరిమితి ఆధారపడి వుంటుంది. సోషలిజంలోకూడా వేతనాలు అందరికీ సమానంగా వుండవని స్పష్టంగా చెప్పవచ్చు.

అయితే కేపిటలిజంకంటే సోషలిజంలో గొప్ప ఏమున్నది ? అని కొందరు వెంటనే పెదవి విరుస్తారు.

ఇలా కేపిటలిజంలో చేయగూడదా ? అనే అనుమానం కలుగుతుంది. ఇలా చేయవచ్చు. కాని లాభాలు తీయడం అనేది దానిలో ప్రాధాన్యం వహిస్తుంది. సోషలిజంలో ప్రజల "అవసరాలకు" ప్రధాన స్థానం వుంటుంది.

కనక ఈనాడు "సొంతం" అనేది లేనివారికి, సోషలిస్టు వ్యవస్థలో సొంతమని భావింపతగిన ఆధారాలు కలుగుతవి. ఒక్కొక్కరు సాధించిన ఫలితాలు సమష్టిగా అనుభవించడానికి అవకాశం కలుగుతుంది. అయితే "వేతనాలు" హెచ్చుగా వుంటవా? అని ఎవరైనా అడగవచ్చు.

కేపిటలిస్టు వ్యవస్థలో కార్మికుడు చేసేపనికి, పొందే ఫలితానికి సంబంధం వుండదు. కాని సోషలిస్టు వ్యవస్థలో పనినిబట్టి ఫలితం అనుభవించడం వుంటుంది: పడిన కష్టానికి తగిన ఫలితం అనేది సోషలిస్టు వ్యవస్థలో మూడు రకాలుగా కార్మికులకు అందుతుంది.

ఒకటి: కూలిగా ముట్టే మామూలు సొమ్ము. రెండు: సాంఘిక వేతనం. ఉదాహరణ: రవాణా వసతులు, విద్యా వైద్య సౌకర్యాలు, భీమా సౌకర్యాలు, వినోదం ఏర్పాట్లు. వీటికిగాను ప్రతి కార్మికుని వేతనంనుంచి కొంత వసూలు జరుగుతుంది. ఇలా చేర్చిన మొత్తం సంఘం మొత్తంమీద ఏర్పాట్లకు వినియోగించ బడుతుంది. మూడు: భవిష్యత్తులో సుఖపడటానికి తగిన ఆధారాలు. ఇది రెండు రకాలు. ఒకటి ఇప్పటి సదుపాయాలను పెంచుకోవడం; రెండు: భవిష్యత్తు

కోసం కొత్త యేర్పాట్లు చేసుకొనడం. దీనినే ఆర్థిక పరిభాషలో పరిశ్రమలలో పెట్టుబడి అంటారు.

అయితే ఈ విషయంలో కేపిటలిజానికి సోషలిజానికి భేదం యేమిటి?

కేపిటలిజంలో అదనంగా వచ్చిన లాభాలు కొందరి వ్యక్తుల సొంత ఆస్తి కాగలవు. దీనిని వారు పెట్టుబడిగా వినియోగించవచ్చు, వినియోగించక పోవచ్చు. అది వారి యిష్టానిష్టాలమీద ఆధారపడి వుంటుంది. దీనికి శాసనరీత్యా రక్షణ కూడా ఏర్పరచబడుతుంది. సోషలిస్టు వ్యవస్థలో అలా జరగదు. అదనంగా వున్న ప్రతి దమ్మిడీ అధికోత్పత్తి సాధనాలకు రిజర్వు చేయబడుతుంది. దాని ద్వారా కొత్త పరిశ్రమలు నెలకొల్పబడి కొత్త ఉద్యోగాలు, అదనపు వస్తువులు, పెక్కు అవకాశాలు కలిగించబడతవి. ఇలాగే చేయాలని ప్రభుత్వం శాసిస్తుంది.

అధికోత్పత్తి జరిగినకొలదీ వేతనాలు పెరుగుతవని అంటున్నారు కదా. అందరికీ సమానంగా వేతనాలు యిస్తారా? అని ప్రశ్నించవచ్చు. ఎప్పటికీ ఇలా జరగదు. వ్యక్తికివుండే పనితనం, తెలివితేటలనుబట్టి మాత్రమే వేతనాల పరిమితి ఆధారపడి వుంటుంది. సోషలిజంలోకూడా వేతనాలు అందరికీ సమానంగా వుండవని స్పష్టంగా చెప్పవచ్చు.

అయితే కేపిటలిజంకంటే సోషలిజంలో గొప్ప ఏముంది? అని కొందరు వెంటనే పెదవి విరుస్తారు.

ఇలా కేపిటలిజంలో చేయగూడదా? అనే అనుమానం కలుగుతుంది. ఇలా చేయవచ్చు. కాని లాభాలు తీయడం అనేది దానిలో ప్రాధాన్యం వహిస్తుంది. సోషలిజంలో ప్రజల "అవసరాలకు" ప్రధాన స్థానం వుంటుంది.

కనక ఈనాడు "సొంతం" అనేది లేనివారికి, సోషలిస్టు వ్యవస్థలో సొంతమని భావింపతగిన ఆధారాలు కలుగుతవి. ఒక్కొక్కరు సాధించిన ఫలితాలు సమష్టిగా అనుభవించడానికి అవకాశం కలుగుతుంది. అయితే "వేతనాలు" హెచ్చుగా వుంటవా? అని ఎవరైనా అడగవచ్చు.

కేపిటలిస్టు వ్యవస్థలో కార్మికుడు చేసేపనికి, పొందే ఫలితానికి సంబంధం వుండదు. కాని సోషలిస్టు వ్యవస్థలో పనినిబట్టి ఫలితం అనుభవించడం వుంటుంది: పడిన కష్టానికి తగిన ఫలితం అనేది సోషలిస్టు వ్యవస్థలో మూడు రకాలుగా కార్మికులకు అందుతుంది.

ఒకటి: కూలిగా ముట్టే మామూలు సొమ్ము. రెండు: సాంఘిక వేతనం. ఉదాహరణ: రవాణా వసతులు, విద్యా వైద్య సౌకర్యాలు, భీమా సౌకర్యాలు, వినోదం ఏర్పాట్లు. వీటికిగాను ప్రతి కార్మికుని వేతనంనుంచి కొంత వసూలు జరుగుతుంది. ఇలా చేర్చిన మొత్తం సంఘం మొత్తంమీద ఏర్పాట్లకు వినియోగించ బడుతుంది. మూడు: భవిష్యత్తులో సుఖపడటానికి తగిన ఆధారాలు. ఇది రెండు రకాలు. ఒకటి యిప్పటి సదుపాయాలను పెంచుకోనడం; రెండు: భవిష్యత్తు

కోసం కొత్త యేర్పాట్లు చేసుకోవడం. దీనినే ఆర్థిక పరిభాషలో పరిశ్రమలలో పెట్టుబడి అంటారు.

అయితే ఈ విషయంలో కేపిటలిజానికి సోషలిజానికి భేదం యేమిటి?

కేపిటలిజంలో అదనంగా వచ్చిన లాభాలు కొందరి వ్యక్తుల సొంత ఆస్తి కాగలవు. దీనిని వారు పెట్టుబడిగా వినియోగించవచ్చు, వినియోగించక పోవచ్చు. అది వారి యిష్టానిష్టాలమీద ఆధారపడి వుంటుంది. దీనికి శాసనరీత్యా రక్షణ కూడా ఏర్పరచబడుతుంది. సోషలిస్టు వ్యవస్థలో అలా జరగదు. అదనంగా వున్న ప్రతి దమ్మిడీ అధికోత్పత్తి సాధనాలకు రిజర్వ్ చేయబడుతుంది. దాని ద్వారా కొత్త పరిశ్రమలు నెలకొల్పబడి కొత్త ఉద్యోగాలు, అదనపు వస్తువులు, వెక్కు అవకాశాలు కలిగించబడతవి. ఇలాగే చేయాలని ప్రభుత్వం శాసిస్తుంది.

అధికోత్పత్తి జరిగినకొలదీ వేతనాలు పెరుగుతవని అంటున్నారు కదా. అందరికీ సమానంగా వేతనాలు యిస్తారా? అని ప్రశ్నించవచ్చు. ఎప్పటికీ ఇలా జరగదు. వ్యక్తికివుండే పనితనం, తెలివితేటలనుబట్టి మాత్రమే వేతనాల పరిమితి ఆధారపడి వుంటుంది. సోషలిజంలోకూడా వేతనాలు అందరికీ సమానంగా వుండవని స్పష్టంగా చెప్పవచ్చు.

అయితే కేపిటలిజంకంటే సోషలిజంలో గొప్ప ఏముంది? అని కొందరు వెంటనే పెదవి విరుస్తారు.

ఈ ప్రశ్న అడిగేవారికి కొన్ని విషయాలు ముందు నచ్చచెప్పాలి.

తెలివిగలవారికి ఎక్కువ జీతం, తెలివి లేనివారికి తక్కువ జీతం చెల్లించడానికి సోషలిస్టులు అభ్యంతరం చెప్పరు. కాగా ఏమీ పనిచేయనివారికి అధిక వేతనాలు కేపిటలిస్టులు యిస్తారని మాత్రమే అంటారు. పనినిబట్టి వేతనం యివ్వరని మాత్రమే విమర్శిస్తారు.

అంటే ఇతరులను చేసే "దోపిడికి", హెచ్చుపనికి తక్కువవేతనం చెల్లించే పద్ధతికి మాత్రమే వ్యతిరేకిస్తారన్న మాట. కనక ఇతరుల కష్టార్జితంమీద బ్రతికే విధానాన్ని సోషలిజం రద్దుచేస్తుం దన్నమాట. ఆర్థికంగా సమానత్వ స్థాపనకు ముందుగా సోషలిజం ప్రయత్నిస్తుంది.

అయితే మానవ నైజానికి ఇది విరుద్ధమని నిందించడం జరుగుతుంది. దానికి సమాధానం మనకు మనమే ఆలోచించుకోవాలి.

పడిన కష్టానికి తగినట్టు కూలి యివ్వడం మానవ నైజానికి విరుద్ధమా? పని పరిమితినిబట్టి వేతనం పెంచడం అభివృద్ధిమార్గం కాదా? ఇలా చేయడం కష్టపడి పనిచేయడానికి ప్రోత్సాహం కలిగించదా? హెచ్చుపని చేసేవారికి తక్కువ జీతం, తక్కువ పని చేసేవారికి ఎక్కువ జీతం యివ్వడం మానవనైజం కాగలదా? జీవితం అంతా కష్టపడి పని చేసినా పొట్ట పోషించుకొనలేని స్థితిలో వుండడం మానవ ప్రవృత్తికి విరుద్ధం కాదా? కొంతమందిని మాత్రమే ఎప్పుడూ సోమరిపోతులుగా పోషించడం న్యాయమా? అన్నవస్త్రాలు

లేక చచ్చేవారు చస్తుంటే వున్న అన్నవస్త్రాలను దాచి పెట్టడం, లేక ధ్వంసం చేయడం మానవత్వమా?

సోషలిజం అనేది ఆర్థిక జీవితాన్ని ఒక పద్ధతిలో నడిపించే విధానం మాత్రమే. కేపిటలిజంలో కొద్దిమంది యజమానులుగా వుంటే, సోషలిజంలో ఉత్పత్తి సాధనాలపై అందరూ యాజమాన్యం కలిగి వుంటారు. ఇలా చేయడంవల్ల నిరుద్యోగం, వస్తువులకొరత, పనిలేకపోవడం, ఇంపీరియలిజం, యుద్ధం అనే ఆర్థిక జాడ్యాలకు స్వస్తి జరుగుతుంది.

సోషలిజం అనేది ఒక ఊహాలోకం కాదు. సోషలిస్టు వ్యవస్థ స్థాపనతో, ప్రజలు హఠాత్తుగా వీరులుగాను మహా ఋషులుగాను మారిపోరు. సహజంగా మానవులవలెనే వుంటారు. మానవ సహజమైన అభిప్రాయభేధాలు, తగాదాలు విభిన్న దృక్పధాలు, విరుద్ధలక్ష్యాలు కలిగి వుంటారు. మనుగడ కోసం ప్రకృతితో కలిసి పోరాడతారు. దీనిలో ప్రతి ఒక్కరికి సోషలిజం చక్కని అవకాశం కలిగిస్తుంది. ఈ పోరాటంలో ఈతిబాధలకు తావు లేకుండాచేసి, పోరాటం సాగించే శక్తిని పెంపొందిస్తుంది. జీవితంలో నిత్యం కనిపించే లోటు పాటులను సాధ్యమైనంతవరకు తగ్గిస్తూ పోతుంది. జీవితానుభూతిని అధిక సంఖ్యాకులకు సుసాధ్యం చేస్తుంది.

# 6. కమ్యూనిజం - దాని మూలసూత్రాలు

అభ్యుదయకరమైన అనేక ఆదర్శాలను కలిగివుండటం నాగరికతకు ప్రధాన లక్షణం. వాటిని ఎవరు గుర్తించినా, ఎవరు గుర్తించకపోయినా, అన్ని యుగాలలోనూ, మానవులు తాము విశ్వసించిన ఆదర్శాలను అంటిపెట్టుకొని వున్నందునే ప్రపంచ చరిత్ర ఇంతగా పెరిగింది.

ప్రపంచ చరిత్రలో ప్రధానపాత్ర నిర్వహించిన ఆదర్శాలను తరచి చూస్తే, ఆ కాలంనాటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులతో వాటికి సన్నిహిత సంబంధం వున్నట్లు స్పష్టపడుతుంది. కనకనే ఒకనాటి రాజకీయ ఆదర్శాలు, ఆనాటి ఆర్థిక, సాంఘిక పరిస్థితులకు ప్రతిబింబాలుగా వుంటవి.

సాంఘిక, రాజకీయ పరిస్థితుల ఫలితంగానే నూతనాదర్శాలు అనేవి రూపొందుతవి! ఇలా ఏర్పడిన ఆదర్శాలు ఒక లక్ష్యసాధనకు ముడిపెట్టడానికి వీలైనంతటి దృఢత్వాన్ని పొందినప్పుడు వర్తమాన సాంఘిక వ్యవస్థలో అపూర్వమైన మార్పులు తీసుకొని రాగలవు. ఫ్రెంచి విప్లవ చరిత్ర దీనికి నిదర్శనం.

కనక కొన్ని ఆదర్శాలను కలిగివుండి, వాటి సాధనకు కృషిచేయడం ద్వారా తన పరిసరాలను మార్పు చేసుకొనడానికి మానవుడు సాగించే కృషినే సాంఘిక విప్లవం అన్నారు. అయితే ఆదర్శాలను వ్యాఖ్యానించడంలోను, వాటి సాధనకు అవలంబించవలసిన విధానాలను గురించి విభిన్న దృక్పథాలు కలవారు వున్నప్పుడే శాస్త్ర పరిజ్ఞానం

పెరుగుతుంది. అందువల్లనే రాజకీయాదర్శాలలో అతివాద, మితవర్గా లంటూ బయలుదేరినవి. కొన్ని, "కొత్తను" సృష్టించడానికి "పాతను" "ధ్వంసం" చేయాలంటే, మరి కొన్ని "నిర్మాణాత్మకంగా మార్పులు" తీసుకొని రావాలని కోరుతవి. ఇందులో "ధ్వంసాన్ని" కోరే రాజకీయాదర్శం కమ్యూనిజం. నిర్మాణాత్మకమైన మార్పులు తీసుకొనిరావా లనేవి లిబరలిజం సోషలిజం వగైరాలు.

కమ్యూనిజం ప్రచారానికి మూలపురుషుడు కారల్ మార్క్సు. ఈయనకు పూర్వం మరొక రూపంలో ఈ ఆదర్శాలను ప్రబోధించినవారిలో సర్ థామస్ మోర్, బాబూఫ్, లిలియంగాడ్విన్, సైంట్ సిమ్మన్, ఫోరర్, రాబర్ట్ ఓవెన్, లూయీ బ్లాంక్, ప్రౌధన్, బకునిన్, క్రోపా ట్కిన్ మొదలగువా రున్నారు. ఒకే ఆదర్శాన్ని విభిన్న దృక్పథాలలో వీరు ప్రచారం చేశారు. కాని, చివరకు కారల్ మార్క్సు సిద్ధాంతాలు కమ్యూనిజంగా చరిత్రలో స్థిరపడిపోయినవి.

జర్మనీలోని వివిధ రాష్ట్రాలలోని నిరంకుశాధికారులు తమ బలదర్పాలను కోల్పోతున్న కాలమది; ఫ్రాంసులో బూర్జువా రాజరికం ధ్వంసం చేయబడిన రోజులవి; హాబ్స్ బర్గ్ సామ్రాజ్యాన్ని విప్లవజ్వాలలు చుట్టుముట్టిన తరుణమది; అప్పుడు కారల్ మార్క్సు సిద్ధాంతీకరించిన విషయాల సంగ్రహ స్వరూపం ఇది :—

(1) చారిత్రక భౌతికవాదం :— ప్రతి చారిత్రాత్మక యుగంలోనూ ఆనాటికి గల ఉత్పత్తి విధానాలు, మారకం

పద్ధతి, అవి ప్రాతిపదికగా రూపొందిన సాంఘిక వ్యవస్థనుబట్టి మాత్రమే ఆ తరానికి సంబంధించిన రాజకీయ, వైజ్ఞానిక చరిత్రను చెప్పడానికి వీలు కలుగుతుంది.

(2) వర్గకలహం :— భూమిని సమష్టి యాజమాన్యం కింద వుంచుకొనే ప్రాథమిక తెగల వ్యవస్థ విచ్ఛిన్నమైన నాటినుంచి, ప్రారంభమైన మానవ చరిత్ర అంతా దోపిడి చేసేవారికి, దోపిడి చేయబడేవారికి, పాలకులకు, పాలితులకు మధ్య జరిగే వర్గకలహాల చరిత్ర మాత్రమే.

(3) అదనపు విలువ :— ఒక వస్తువు ఉత్పత్తి చేయడంలో కష్టపడిన కార్మికునికి చెల్లించే కూలికి, చెలామణిలో ఆ వస్తువుకు వచ్చే వాస్తవమైన ధరకు, మధ్యగల తేడాను అదనపు విలువ అంటారు. ఈ అదనపు విలువలను కేపిటలిస్టులు స్వాహా చేస్తారు. వీరు ఇలా అన్యాయంగా స్వాహా చేయకుండా చేయడమే కమ్యూనిస్టుల ప్రధాన కర్తవ్యం.

(4) కేపిటలిజం అవలక్షణాలు :— సంపద యావత్తు కొందరి చేతులలో కేంద్రీకరింపబడి, గుత్త వ్యాపార సంస్థల ప్రాబల్యం పెరగడం, మధ్యతరగతులతో సహా ప్రజలలో అధిక సంఖ్యాకులు కటిక బీదరికం అనుభవిస్తూ, కాయకష్టం చేసుకొనేవారుగా మారిపోవడం; కొన్ని సంవత్సరాల కొకదఫా ఆర్థికమాంద్యాలు; జాతీయ కేపిటలిజం పోటాపోటీలతో పెరిగి, పరస్పర విరుద్ధమైన ఆర్థికమైన, రాజకీయమైన, ఇంపీరియలిజంగా రూపొందడం.

(5) ఇలాంటి పరస్పర విరుద్ధాలతో కూడిన వ్యవస్థను హింసాపూరితంగా "నిర్మూలించి" వర్గాలు లేని, వ్యక్తిగత

ఆస్తులకు అవకాశం లేని, నూతన సాంఘిక వ్యవస్థను కార్మిక నియంతృత్వం కింద ముందు నెలకొల్పాలి.

(6) వర్గాలు, వ్యక్తిగత ఆస్తిలేని వ్యవస్థ ఏర్పడిన వెంటనే కార్మిక నియంతృత్వం పోవడమే కాక, సర్వాధి కారాలతో కూడిన అధికారం చెలాయించే "ప్రభుత్వం" అనేదే అవసరంలేకుండా మాయమైపోతుంది.

(7) ఉత్పత్తి సాధనాలు సమష్టి అధికారంకింద వుండి, ప్రభుత్వం ఆధ్వర్యంకింద సాంఘిక సదుపాయాలకు చెందిన పనులు హెచ్చుగా జరుగుతూ, వికేంద్రీకరణ ప్రాతిపదికగా, క్రమక్రమంగా కమ్యూనిస్ట్ వ్యవస్థ ఏర్పడుతుంది.

(8) చివరకు "ప్రతి ఒక్కరినుంచి వారి శక్తికొలది, ప్రతిఒక్కడూ తన అవసరాన్నిబట్టి" అనేది సంఘజీవితంలో ప్రధాన సూత్రంగా వుంటుంది.

(9) చివరిదశలో సమాన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కలిగిన ప్రపంచ వ్యవస్థలో శాంతి సుహృద్భావాలతో స్త్రీ పురుషులు జీవనయాత్ర సాగిస్తారు.

కారల్ మార్క్స్ అంచనా ప్రకారం, ఆయన విశ్వ సించిన ఈ ఆదర్శాలు ముందుగా కార్యరూపం పొందవల సింది జర్మనీలో. కాని, ఆయన సూత్రాలకు ఒక స్వరూపం కలిగింది జారిస్ట్ రష్యాలో. ఆయన జోస్యం ప్రకారం, వర్గాలు, వ్యక్తిగత ఆస్తిలేని వ్యవస్థ సోవియట్ యూని యన్‌లో ఏర్పడినా, "ప్రభుత్వం" అనేదాని అవసరం అక్కడ లేకుండా పోలేదు సరికదా, నానాటికి దాని "బలగం"

పెరుగుతున్నది. వర్గకలహాలు పెరుగుతున్నకొలది కేపిటలిజం బలహీనపడకపోగా, ప్రపంచం మొత్తంమీదనే కేపిటలిజం, దాని చివరిదశల పెరుగుదలలో మార్పులు వచ్చినవి. కనక కారల్ మార్క్స్ ఆదర్శాలు అభ్యుదయకరమైనవే అయినా, ఆయన అంచనాలలో కొన్ని తప్పులు, ఈ తరంలో కనిపించడమే కాక, ఆయన ఆదర్శాల సాధనలో కూడా కొన్ని వైపరీత్యాలు పెరిగినవి.

అయినా సాంఘిక విప్లవాన్ని కోరేవారు కొందరు 1848 లో కారల్ మార్క్స్ చెప్పిన ఈ సూత్రాలే నేటికీ అనుసరణీయమైనవిగా విశ్వసిస్తున్నారు. ఆ విశ్వాసాలకు రాజకీయ స్వరూపం కలిగించడంలో కొందరు వేసిన తప్పటడుగులు ఫలితంగా, అసలు సాంఘికవిప్లవం కోరడమే కమ్యూనిజంగా నేడు ఆపాదింపబడడం అన్యాయమనక తప్పదు.

# 7. ప్రజాస్వామ్యం - దాని అర్థం

మానవజాతి సుదీర్ఘ చరిత్రలో అనేకరకాల ప్రభుత్వాలు రూపొందినవి. ఈ ప్రభుత్వ వ్యవస్థ లన్నింటిలోనూ పలుకుబడి కలిగిన కొందరు, స్వలాభంకోసం ప్రజల నందరినీ తమ అదుపాజ్ఞలలో వుంచుకొనడం అనేది సర్వత్రా చెల్లుబాటైనది. కాని దీనికి విరుగుడుగా రూపొందిన ఆధునిక రాజకీయ వ్యవస్థ ప్రజాస్వామ్యం.

విజ్ఞాన పిపాసులైన అధిక సంఖ్యాకులు సంఘ సంబంధమైన వ్యవహారాలలో జోక్యం కలిగించుకొనడానికి సంసిద్ధులైనప్పుడు సక్రమ పద్ధతిని పరిపాలన కొనసాగడమే ప్రజాస్వామ్యం. పరిపాలనకు బాధ్యత వహిస్తున్న అధికారవర్గాలను శాంతియుతంగా పదభ్రష్టులను చేయడానికి, ప్రజల మేలుకోసమే పరిపాలన కొనసాగించాలని ఒత్తిడి చేయడానికి పూర్తి స్వేచ్ఛ ఒక్క ప్రజాస్వామిక వ్యవస్థలో మాత్రమే ప్రజలకు వుంటుంది.

ప్రజాస్వామ్య ప్రభుత్వ వ్యవస్థలో వ్యక్తులకు సర్వస్వాతంత్ర్యాలు వుంటవి. స్వాతంత్ర్యం శూన్యమైనప్పుడు మానవులు బాధ్యతలు గుర్తించిన పౌరులుగా గాని, ఆదర్శసాధనాపేక్షులైన వ్యక్తులుగాగాని రూపొందరు. సముచిత విజ్ఞానం, స్వాతంత్ర్యావకాశాలు కలుగజేసినప్పుడు వ్యక్తులు తమ సహజ శక్తులను అభివృద్ధి చేసుకొనడానికి గల పరిస్థితులను సద్వినియోగం చేసుకొనగలరు కూడా. ప్రపంచం మొత్తంమీద సహనభావం కొరవడడం, జాతి విద్వేషం, రాజకీయ అవినీతి ప్రబలడంవల్లను, పౌర బాధ్యతల పట్ల అధిక సంఖ్యాకులు అలసత్వం చూపుతున్న ఫలితంగాను, అసలు ప్రజాస్వామ్యానికి భవిష్యత్తు కలదా అనే ప్రశ్న నేడు సర్వత్రా వినిపిస్తున్నది.

పదిమంది కలిసి ప్రభుత్వం అనేదాన్ని స్థాపించుకొనడం ప్రారంభించిన నాటినుంచి ప్రభుత్వానికి, దానిలోని పౌరులకు వుండవలసిన సంబంధాలను గురించి రెండు విభిన్నాభిప్రాయాలు ప్రచారంలోనికి వచ్చినవి. వ్యక్తికంటె

ప్రభుత్వమే గొప్ప అనేది ఒక అభిప్రాయం. ప్రభుత్వం కంటె వ్యక్తి గొప్ప అనేది రెండవ అభిప్రాయం.

మొదటి అభిప్రాయం ప్రకారం సంఘంలో ఒక సభ్యుడుగా మాత్రమే వ్యక్తి జీవించాలి. సంఘాభిప్రాయాలకు దాసుడై, సంఘ శ్రేయస్సుకోసం కృషిచేస్తూ, సంఘసేవలో ప్రాణత్యాగం చేయడానికి కూడా సిద్ధపడాలి. సంఘంలో తనకు ప్రత్యేకత కలదని నిరూపించడానికి ప్రయత్నించ కూడదు. వ్యక్తికి సంబంధించిన ప్రతి విషయంలోనూ జోక్యం కలిగించుకోడానికి సంఘానికి అధికారం కలదు. సంఘ ప్రసక్తి లేని ప్రత్యేక జీవిత మనేది వ్యక్తికి ఏమాత్రం లేదు. ఇలాంటి వ్యక్తుల సమూహంకంటె (అదే సంఘం) ప్రభుత్వమే గొప్పది. సంఘంలోనివారికి ఎన్ని కష్టనష్టాలు వచ్చినా, ఈ ప్రభుత్వాన్ని మాత్రం కాపాడుకుంటూ పోక తప్పదు. ప్రభుత్వమే సంఘం; సంఘమే వ్యక్తి.

ఇలాంటి వాదనను నియంతృత్వమని, ఫాసిజమని అంటున్నారు.

ప్రభుత్వంకంటె వ్యక్తి గొప్ప అనే రెండవ వాదన ప్రకారం వ్యక్తికోసమే ప్రభుత్వనిర్మాణం జరుగుతుంది. ప్రజలకు సేవచేయడం మినహా ప్రభుత్వానికి మరితర పని లేదు. ప్రభుత్వ వ్యవస్థను ప్రజలు మార్చగలరు. అవసర మైతే దీనికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయగలరు. వ్యక్తికి ప్రైవేటు జీవితం, పబ్లిక్ జీవితం అనేవి వేర్వేరుగా వుంటవి. ఇతరులకు హాని కలిగించనంతవరకు వ్యక్తి ప్రయివేటు జీవి తంలో ప్రభుత్వం జోక్యం కలిగించుకొనకూడదు. అందరి

హక్కుల పరిరక్షణకు పరిమితమైన వాటిలో మినహా, ప్రభుత్వం జోక్యం కలిగించుకోనడానికి వీలులేని కొన్ని రక్షణలు వ్యక్తులకు వుంటవి.

1,600 సంవత్సరం నుంచి ప్రారంభమైన ఈ అభిప్రాయాలు ప్రజాస్వామిక ప్రభుత్వ వ్యవస్థగా నేడొక సుస్థిర స్వరూపం దాల్చినవి.

ప్రజాస్వామిక వాదులకు శాసనం అనేది ప్రధానం. ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకున్నవారు తమ చిత్తం వచ్చినట్టుగాక సర్వజనామోదకరమైన కొన్ని సిద్ధాంతాలకు అనుగుణంగా వ్యవహరించాలనడమే దీని పరమావధి. దీని ప్రకారం ప్రభుత్వాధిపతి శాసనం ప్రకారం పరిపాలన చేస్తాడు. కాని, శాసనం చేయలేడు. శాసనం అనేదాన్ని ప్రజలు తమ ప్రతినిధులద్వారా రూపొందింప జేస్తారు. దీనినే ఇంగ్లీషులో "రూల్ ఆఫ్ లా" అన్నారు.

నియంతృత్వ పరిపాలనలో ప్రజలకు శాసననిర్మాణాధికారం వుండదు. నియంత యిష్టానుసారం శాసన నిర్మాణం జరుగుతుంది. వాటిని ప్రజలు కాదనడానికి వీలుండదు. తన అభీష్టాలను ప్రజలచే అమోదింపజేయడానికి నియంత తన సర్వాధికారాలను ఉపయోగిస్తాడు. ఇందులోనూ మిలిటరీ అధికారాలను విపరీతంగా వినియోగిస్తాడు.

ప్రజాస్వామ్యంలో ప్రభుత్వానికి ఇలాంటి అధికారం వుండదు. శాంతి సమయంలో మిలిటరీ బలప్రయోగం ప్రజాస్వామ్య విరుద్ధంగా భావించబడుతుంది. అధిక సంఖ్యాకుల అభీష్టానికి విరుద్ధంగా ఏ ప్రజాస్వామిక ప్రభుత్వం ఎలాంటి

శాసనాన్నీ అమలుపరచలేదు. ప్రజలు కాదన్న శాసనాలు చేసిన ప్రభుత్వం తిరిగి అధికారంలోకి రాగల ఆశలు వుండవు.

నియంతృత్వ వ్యవస్థలో ప్రజలు ప్రభుత్వానికి సేవ చేయడానికి అనువుగా శాసన నిర్మాణం జరుగుతుంది. ప్రభుత్వం గుర్తించక తప్పని వ్యక్తిగతమైన హక్కులు అనేవి వుండవు. ప్రభుత్వ చర్యలకు వ్యతిరేకంగా వ్యక్తికి న్యాయస్థానాల రక్షణ వుండకపోగా వ్యక్తిని అదుపాజ్ఞలలో పెట్టడానికిగాను ప్రభుత్వానికి అవి సహాయం చేయగలవు.

ప్రజాస్వామిక వ్యవస్థలో వ్యక్తి హక్కుల రక్షణకు శాసన నిర్మాణం జరుగుతుంది. వ్యక్తి హక్కులకు భంగం కలిగించే ప్రతి విషయంలోనూ ప్రభుత్వం అడ్డుగా నిలుస్తుంది. ఒకవేళ ప్రభుత్వంగాని, సంఘంలోని కొందరుగాని, వ్యక్తి హక్కులను కాదంటున్నప్పుడు న్యాయస్థానాల రక్షణ వుంటుంది. తగిన ప్రభుత్వ శాసనం లేనప్పుడు న్యాయస్థానాలకు శిక్షాధికారం వుండదు. నేరం చేసినప్పుడు కూడా అది చట్టవిరుద్ధం కానంతవరకు ప్రభుత్వం శిక్షించడానికి అధికారం వుండదు. కనుక ప్రజాస్వామ్య వ్యవస్థలో శాసన నిర్మాణాధికారం ప్రజా ప్రతినిధుల చేతులలో వుంచబడి, శాసనం అనేది ప్రజాసేవకు ఉద్దేశించబడిన ఆయుధంగా వుంటుంది.

# 8. ప్రభుత్వాలు - పార్టీలు

ప్రతినిధులద్వారా స్వపరిపాలన కొనసాగించుకొనే పద్ధతి ప్రజాస్వామ్యంలో మొదటి మెట్టు. మెజారిటీ వోటు ప్రకారం తమ ప్రతినిధులను ప్రజలు ఎన్నుకుంటారు. ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తూ, ఆ ప్రతినిధులు ప్రభుత్వంగా ఏర్పడి పరిపాలన కొనసాగిస్తారు.

ప్రజాస్వామ్యంలో మెజారిటీ పరిపాలన సాగుతుంది. మైనారిటీల విమర్శనకు, ఒక ప్రతిపక్షంగా వ్యతిరేకించడానికి గల అవకాశాలమేరకు మాత్రమే మెజారిటీల పరిపాలన జరుగుతుంది. అధికారంలోవున్న పార్టీ పాలనలో లోపాలను ప్రజలకు వివరించి చెప్పడమే మైనారిటీ పార్టీల ప్రధాన కర్తవ్యం.

ప్రజాస్వామ్యంలో ప్రభుత్వాధిపతిగా ఒకరు ప్రజలందరి చేత ఎన్నుకొనబడతారు. ఈయనను ప్రెసిడెంట్ అంటారు. ఈయన కేవలం నామమాత్రాధికారిగా వుంటారు. ఈయన పేరుమీద పరిపాలన యావత్తూ సాగుతుంది. ఇంక ప్రజా ప్రతినిధులలో అధికసంఖ్యాకుల అభిమానాన్ని చూరగొన్న వ్యక్తి ప్రధానిగా పరిపాలన చేస్తాడు. ప్రధాని, ప్రెసిడెంట్ సమష్టిగా, ప్రజలందరికీ ప్రాతినిధ్యం వహించాలి. కాని ఒక పార్టీ వ్యక్తులుగా వ్యవహరించరాదనేది ప్రజాస్వామ్యం ప్రధాన లక్షణం.

ప్రజా ప్రతినిధుల ప్రభుత్వం నెలకొన్న తరువాత, కొన్ని లక్ష్యాలు, ఆదర్శాల సాధనకు అది పూనిక చూపడం ప్రజాస్వామ్యంలో రెండవ మెట్టు.

విభిన్నాదర్శాలను సమన్వయం చేసి, వాటి కార్యాచరణకు తగు అవకాశాలు కలిగించడాన్ని స్వపరిపాలన అన్నారు; ఈ విభిన్నాదర్శాలలో (1) వ్యక్తికి గౌరవం (2) సమానత్వం (3) స్వేచ్ఛ (4) విభిన్నత్వంలో ఏకత్వం అనేవి ప్రధానమైనవిగా నిర్ణయించి ప్రజాస్వామ్యంలో వాటికి విశిష్ట స్థానం కలదని నిరూపించడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

(1) వ్యక్తికి గౌరవం—వ్యక్తి జీవితం పరిమితమైనది. ఇతరుల లక్ష్యసాధనకు ఒక బొమ్మగా వ్యక్తిని ఉపయోగించరాదు. సుఖజీవితానుభూతికి తగిన అవకాశాలు వ్యక్తికి కలిగించాలి. స్వశక్తినిబట్టి వ్యక్తి కొనసాగించుకొనే కృషిలో ప్రోత్సాహం కలిగించాలి. తనకంటె తన సంతతి సంతోషంగా బ్రతకడానికి వ్యక్తిజరిపే పోరాటంలో కల అవరోధాలను సాధ్యమైనంతవరకు తొలగించాలి. అనుభవంతో కూడిన వ్యక్తి అభిప్రాయాలను, సూచనలను ప్రభుత్వం గుర్తించాలి.

వ్యక్తి గౌరవ సిద్ధాంతాన్ని ఆమోదించడంతో అనేక రకాల సంస్కరణలకు ప్రభుత్వం పూనుకొనవలసి వుంటుంది. ఇందులో పని గంటల నిర్ణయం; పనిచేయు పరికరాల అభివృద్ధి; కనీసవేతనాలు; అంగవైకల్యం కలవారికి ఆసరా

యివ్వడం; పని లేనివారికి పని చూపడం మొదలగునవి; ఇవి చాలా అవసరమని ఈ కాలపువారి వాదన.

(2) సమానత్వం — విద్యను బట్టి, వంశాన్ని బట్టి, కులాన్ని బట్టి, హోదానుబట్టి, ధనాన్ని బట్టి, పాక్షికరదృష్టి ప్రభుత్వానికి వుండరాదు. వోటు వేయడానికి, విద్యాభ్యాసానికి; న్యాయస్థానాలలో, ప్రభుత్వ సంస్థలలో అభిప్రాయాల వివరణకు, తగు ప్రాతినిధ్యం వహించడానికి; వినోద సౌకర్యాలు, వైద్య సదుపాయాలు, సమంగా అనుభవించడానికి; ప్రభుత్వ పదవులు స్వీకరించడానికి పౌరులందరికీ సమానావకాశాలు వుండాలి.

ఈ సూత్రాన్ని ఆమోదించిన ఫలితంగా ఉచితవిద్యా వైద్య సౌకర్యాలు ఏర్పరచడం; ప్రత్యేక సంఘాలుగా ఏర్పడడానికి సమ్మతించడం. ఆర్థిక జీవితాన్ని కంట్రోల్ చేయడం, ప్రభుత్వోద్యోగాలకు పరీక్షలు, వయోజను లందరికీ వోటింగ్ హక్కు కలిగించడం, అనేవి ప్రభుత్వాల కనీస ధర్మాలుగా ఎంచబడుతున్నవి.

(3) స్వేచ్ఛ—ప్రతివ్యక్తి తనకు తోచినట్లు చేయడమనేది స్వేచ్ఛ కాదు. ఇలా జరిగినప్పుడు బలంగలవాడిదే రాజ్యం అనే వాదనకు ప్రాబల్యం హెచ్చుతుంది. ఇతరులకు హానికలగనంత వరకు అందరికివలెనే తన కృషి తాను కొనసాగించుకుంటూ పోవడమే స్వేచ్ఛగా పరిగణించారు. అధికారాన్ని నిరంకుశంగా ఉపయోగించడంపై తిరుగుబాట్లు చెలరేగిన ఫలితంగా ఈ స్వేచ్ఛావాదనకు పలుకుబడి హెచ్చింది.

ఈ వాదన ఫలితంగా వాక్, సభా, పత్రికా, సమావేశ స్వాతంత్ర్యాలు, అభిప్రాయ స్వాతంత్ర్యం, విశ్వాస స్వాతంత్ర్యం అనేవి ప్రభుత్వాలు గుర్తించినవి. వీటినే పౌరస్వాతాలు అన్నారు. పౌరస్వాత్వాలకు పూర్తి రక్షణ కలిగించడం ప్రజాస్వామ్య ప్రభుత్వం ప్రధాన లక్షణం.

(4) విభిన్నత్వంలో ఏకత్వం— మానవుడు సాంఘిక జీవి. సమూహంలో సభ్యుడుగా వుండి దానిచేత ఆమోదించ బడి, దాని కార్యక్రమాలలో పాల్గొని, దాని లక్ష్యసిద్ధిలో తగినపాలు పంచుకోన కోరతాడు. సమూహంలో కలిసి పోయి, సమూహమే తా ననుకొని, దాని కార్యసిద్ధికి గర్వ పడుతాడు. అంతటితో సంఘాన్ని కాదనలేని స్థితిలో సంఘ భక్తుడై పోతాడు.

అయితే నియంతృత్వంలో వ్యక్తికి అభిప్రాయ స్వాతంత్ర్యం నిరుత్సాహపరచబడుతుంది. ప్రజాస్వామికంలో అది ప్రోత్సహించబడుతుంది. మతవిశ్వాసాలలో, అభిప్రాయ ప్రకటనలో, ఆలోచనా ధోరణులలో, విభిన్నత్వాన్ని ప్రోత్సహిస్తూ, సాంఘిక శ్రేయస్సు, భద్రత అనే ఏకత్వాన్ని సాధించడానికి ప్రజాస్వామ్య ప్రభుత్వాలు కృషిచేస్తవి.

ఇన్ని విశిష్ట లక్షణాలతో, ప్రజాస్వామ్య ప్రభుత్వం అనేది ఏర్పడినా, అది ప్రజాప్రభుత్వం కాలేని ఉదాహార ణాలు కలవు. తామే ఎల్లప్పుడూ అధికారంలో వుండిపోయే తీరుగా, ప్రభుత్వ యంత్రాన్ని ఎలా ఉపయోగించేదీ, తమ ప్రతిష్ఠ పెరగడానికి ప్రభుత్వ వ్యవహారాలను ఎలా నిర్వహిం

చేదీ, కొంతమందికి మాత్రమే సంబంధించిన రహస్యంగానే వుంచివేయడం జరుగుతున్నది.

ఈ లోపానికి గల కారణాలు — ఒకటి: పరిపాలకులు చేస్తున్నది ఏమిటో ప్రజలకు పూర్తిగా వివరించి చెప్పక పోవడం. రెండు: అధికారాలను నిర్వహించే ఉద్యోగులు, తమ ఆలోచనలతో ఏకీభవించేవారితోను, తమకు యిష్టమున్నవారితోను మాత్రమే సంప్రతించడం.

కనకనే ప్రజాస్వామ్య ప్రభుత్వానికి కిందవి ప్రధాన లక్షణాలుగా నిర్ణయించడం జరిగింది.

1. దేశ వ్యవహారాలలో జోక్యం కలిగించుకొని మంచి చెడ్డలను చర్చించగల చైతన్యం ప్రజలకు కలిగించాలి. 2. ప్రభుత్వం ఏమి చేస్తున్నదీ ప్రజలకు పూర్తిగా ఎప్పటికప్పుడు చెప్పడం. 3. వాక్ సభా స్వాతంత్ర్యాలు. 4. వయోజనుడై మంచినడత కలిగిన ప్రతి వ్యక్తికి వోటు వేయడానికి హక్కు. 5. ప్రభుత్వవిధాన నిర్ణేతలు అప్పుడప్పుడు ఎన్నికలలో అభ్యర్థులుగా నిలబడడం. 6. వ్యక్తుల పౌరస్వత్వాలకు న్యాయస్థానాల పరిరక్షణ.

## రాజకీయ పక్షాలు

అన్ని దేశాలలోనూ ప్రభుత్వ వ్యవహారాలలో భాగస్వాములు కాగలిగినవారందరూ, అనేక సమస్యల మీద విభిన్నాభిప్రాయాలు కలిగివుంటూ ఏదో ఒక రాజకీయపార్టీలో సభ్యులుగా చేరడం ద్వారా తమ అభి

ప్రాయాలను సువ్యక్తం చేస్తున్నారు. అనేక అభిప్రాయాలకు ఒకరూపం కలిగించి, ప్రజలు వారి అభీష్టాన్నిబట్టి వానిని అంగీకరించడానికి సంసిద్ధులను చేయడమే రాజకీయ పార్టీల ప్రథమ ప్రయోజనం.

ఏక రాజకీయ లక్ష్యాలను సాధించడానికి కొందరు కలిసి మెలిసి పనిచేసుకొనే వ్యవస్థను రాజకీయ పార్టీ అన్నారు. వీరు అనేక ప్రచార సాధనాలను ఉపయోగిస్తారు. ప్రభుత్వ పదవులకు అభ్యర్థులను నిలబెట్టి ఎన్నిక జరిపిస్తారు. పార్టీ లక్ష్యాల సంసిద్ధికి శాసనాలు రూపొందింప జేస్తారు.

ప్రజాస్వామ్యంలోనూ, నియంతృత్వంలోనూ పార్టీల పద్ధతికి ఎక్కడా సామ్యంలేదు. నియంతృత్వ ప్రభుత్వంలో ఒకే ఒక పార్టీ వుంటుంది. అది నియంతకు సేవచేస్తూ, అతని అభిప్రాయాల చెల్లుబాటుకు కృషిచేస్తుంది. దీనిలో సభ్యులుగా చాలా కొద్దిమంది మాత్రమే వుండి పెద్ద పలుకుబడిని సంపాదిస్తారు. ప్రజాస్వామ్యంలో కనీసం రెండు పార్టీలు వుంటవి. మైనారిటీ పార్టీ ప్రభుత్వాధికారాన్ని చేజిక్కించుకొనలేక పోయినా, మెజారిటీ పార్టీ ప్రభుత్వాన్ని అదుపాజ్ఞలలో వుంచుతుంది.

నియంతృత్వ వ్యవస్థలో, నియంతపట్ల గల భక్తి ప్రపత్తులనుబట్టి పార్టీ సభ్యుల ఎన్నిక జరుగుతుంది. పార్టీ నాయకుని వ్యతిరేకించనంతవరకు మాత్రమే సభ్యులుగా వుండటానికి వీలుంటుంది. ప్రజాస్వామ్యంలో వయోజనులందరూ తమకు విశ్వాసంకల ఏ పార్టీలోనైనా చేరవచ్చు.

లేదా వైదొలగవచ్చు. పార్టీ నాయకునిపై తమకు విశ్వాసం లేనప్పుడు ఆయనను పదభ్రష్టుని చేయవచ్చుకూడా.

నియంత పరిపాలనలో రాజకీయ విధానాల నిర్ణయం ఒకరు లేక ఇద్దరు వ్యక్తులద్వారా జరుగుతుంది. పార్టీ సభ్యులు, ప్రభుత్వాధికారులు వానికి తలొగ్గి, వాటిని కార్యాచరణలో పెట్టి జయం కలిగించడం మినహా కాదన డానికి వీలుండదు. ప్రజాస్వామ్యంలో మెజారిటీ పార్టీలోని అధిక సంఖ్యాకులచే రాజకీయ విధానాలు రూపొందించ బడగా, వానిని సభ్యుల సమ్మతి ప్రకారం పార్టీ నాయకుడు అమలుజరిపించవలసి వుంటుంది.

నియంత పరిపాలనలో, ప్రభుత్వాధికారానికి ప్రజలు తలొగ్గాలని రాజకీయ పార్టీ ప్రచారం చేస్తుంది. ప్రజా స్వామ్యంలో అధికారంలోవున్న పార్టీ మినహా, మిగిలిన పార్టీలన్నీ ప్రభుత్వాన్ని విమర్శిస్తూ వుంటవి. ప్రభుత్వ విధానాలలో మార్పులు కోరతవి. ప్రభుత్వ వ్యవహారాలలో ప్రజలు అప్రమత్తులుగా వుండాలని హెచ్చరిస్తవి. వ్యక్తి అభిప్రాయాలకు విలువకలదని ప్రజలకు నచ్చచెబుతవి. అయితే పార్టీ ఎంత పెద్దదిగా వుంటే, దానిలోని సభ్యు లంతా ఆమోదించే సూత్రాలు అంత తక్కువగా వుంటవి. అందువల్ల మెజార్టీ పార్టీలోని కొందరు, మైనారిటీ పార్టీతో చేరి ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకొనడం కూడా కద్దు.

అవి ఎలాంటివి రాజకీయ పార్టీలు అయినా క్రింది విధులను నిర్వహిస్తవి. (1) అధికార పదవులకు అభ్యర్థులను

నిలబెట్టడం (2) పార్టీ ప్రచార నిర్వహణ (3) తన ఆదర్శాలను ప్రజలచేత ఆమోదింపచేయడం (4) అధికారానికి వచ్చినప్పుడు ప్రభుత్వ యంత్రాన్ని పూర్తిగా స్వాధీనం చేసుకొనడానికి సర్వసన్నాహాలు చేసుకొనడం (5) పార్టీ తరఫున ప్రజలకు అనేకరకాల సహాయం చేయడం.

ఈ విధమైన కార్యక్రమాలు నిర్వహించే పార్టీ నాయకులకు విపరీతమైన పలుకుబడి వుంటుంది. ప్రభుత్వాధికారంలో చేరగోరినవారందరూ వీరి సహాయం పొందక తప్పదు. వీరిద్వారా పదవులను అధిష్టించినవారు, చివరకు వీరి చిత్తంప్రకారం కొంతవరకైనా నడవక తప్పదు. దీనినే రాజకీయ అవినీతి అంటారు.

ఈ రాజకీయ అవినీతి రెండు రకాలుగా వుంటుంది. ఒకటి : సులభంగా ఏదో ఒక ఉద్యోగం పొందగోరేవారికి సహాయపడడం; రెండు : తమ వ్యాపారానికి లేక స్వార్థానికి తగిన పర్మిట్లు, లేదా ప్రభుత్వ శాసనాలు కావాలని ఒత్తిడి చేయడం; ఈ పరిస్థితులను చక్కబరచడానికిగాను ఎన్నికల పద్ధతి, ఆఫీసర్లుగా వుండటానికి అర్హతలు, పదవీ భ్రష్టులను చేయడానికి అవకాశాలు మొదలగు సంస్కరణలను ప్రవేశపెట్టారు.

అసలు రాజకీయ అవినీతి అనేది పెంపొందడానికి గల కారణాలు నాలుగు. (1) వోటుహక్కు కలవారందరూ ఎన్నికలలో పాల్గొనకపోవడం, వయోజనులందరికీ వోటు వుండకపోవడం. (2) అభ్యర్థి యోగ్యతనుబట్టి కాక పార్టీ,

పార్టీలోని కొందరు నాయకులపట్ల గల అభిమానాన్ని బట్టి వోట్లు వేయడం. (3) ప్రభుత్వాధికారాలు శాసన నిర్మాణ, కార్యనిర్వాహక, న్యాయనిర్వహణ అనే మూడు తరగతుల కింద విభజింపబడినా, ప్రభుత్వ వ్యవస్థలోని ఉపాంగాలలో (పంచాయతీలు, జిల్లా బోర్డులు, పురపాలకసంఘాలు, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు.) మధ్య బాధ్యతల విభజన స్పష్టంగా లేకపోవడంవల్ల, తప్పులకు తాము బాధ్యులము కాదని ఎవరికి వారు తప్పించుకొనడానికి అవకాశాలు హెచ్చుగా వుండటం. (4) స్వయం ప్రతిభావంతులైనవారు పార్టీ రాజకీయాలతో జోక్యం పెట్టుకొనకపోవడంతో, అనామకులైనవారు ఎక్కువగా ప్రజాప్రతినిధులై, అవినీతికి దాసులు కావడం.

కనక ప్రజాస్వామ్యంలో ప్రజలనుబట్టి ప్రభుత్వ వ్యవస్థ ఏర్పడుతుంది. ప్రజలు ఎంత చైతన్యంగా వుంటే ప్రభుత్వ వ్యవహారాలు అంత సక్రమంగా జరుగుతవి.

రాజకీయాలతో సంబంధం లేని ప్రజా సంస్థలద్వారా ప్రభుత్వ ధోరణిని మార్చడానికి మూడు అవకాశాలు కలవు. (1) ప్రతివ్యక్తి వోటింగ్‌లో పాల్గొనేటట్లు చేయడం (2) అధికార పదవులలో అర్హులైన వారిని జేర్పించడం (3) ప్రభుత్వం పేరుమీద జరిగే సప్లయిలు, ప్రభుత్వానికి కావలసిన అవసరాలను సేకరించే పద్ధతులను కట్టుదిట్టం చేయించడం.

అధికారానికి వచ్చిన మెజారిటీపార్టీ రాజకీయ అవినీతిని అరికట్టడానికి యివే చక్కని మార్గాలు కూడా.

## ఎ న్ని క ల ప ద్ధ తు లు

ఆచరణలో ప్రజాస్వామ్య సూత్రాలను క్రమబద్ధం చేయడాని ప్రజా ప్రతినిధుల ఎన్నికల పద్ధతిలో కాలాను గుణ్యంగా అనేక కట్టుదిట్టాలు జరుగుతూ వచ్చినవి.

ఇందులో ఎన్నికల ప్రచారం ఖర్చును పరిమితం చేసేది మొదటిది. ఎన్నికల ప్రచారంలో డబ్బు ఎవరు ఎక్కువగా ఖర్చు చేస్తే వారే గెలుస్తారనేది అందరికీ తెలిసిన విషయమే. దీనివల్ల డబ్బులేనివారు, ధనవంతులమీద ఆధారపడి ఎన్నికలలో నిలబడక తప్పడంలేదు. కొన్ని సందర్భాలలో ధనవంతులే పోటీకి నిలబడగల స్తోమత గల వారుగా వుంటున్నారు. అంతేకాదు. డబ్బులేనివారు, ధన వంతులవద్ద డబ్బు సహాయంపొంది, ఎన్నికలలో నెగ్గిన తరువాత ఈ ధనవంతులకు సహాయం చేయక తప్పడంలేదు. దానివల్ల రాజకీయ అవినీతి పెరుగుతున్నది. ఈ స్థితిని చక్కబరచడానికిగాను ఒక్కొక్క ప్రతినిధి ఎన్నికల ప్రచా రంలో ఇంతకు మించిన సొమ్ము ఖర్చు చేయరాదని శాసనాలు చేశారు. అయితే ప్రతినిధుల మిత్రులు ఎన్నికలకు చేసే ఖర్చులను పరిమితం చేయడానికి కూడా ఒక్కొక్క వ్యక్తి యిచ్చే విరాళాలకు హద్దులు ఏర్పాటుచేస్తూ అమెరికాలో శాసనాలు జరిగినవి.

ప్రతివోటరు ప్రతినిధి కాగలగడానికి వీలుగా, ఎన్ని కలో పోటీచేసే ప్రతి ఒక్కరిని గురించి ఒక్కొక్క పేజీ చొప్పున కొన్ని వేల కరపత్రాలను ప్రభుత్వం ఖర్చుమీద

అచ్చువేసి, వోటర్లకు విరివిగా పంచిపెట్టాలని, ఇలా చేయడం వల్ల ధనవంతులు కానివారికి కూడా ఎన్నికల ప్రచారం జరుగుతుందనే సూచనలు వున్నవి.

ఎన్నికల ప్రచారం ఖర్చుల తరువాత ఆలోచించవలసింది ప్రతినిధుల నామినేషన్. పార్టీనాయకుల అభిమానుల ద్వారా పోటీచేయు ప్రతినిధుల నిర్ణయమనేది ప్రతి రాజకీయ పార్టీలోనూ జరుగుతున్నది. దీనిలోని కుతంత్రాలను చక్కదిద్దడానికిగాను, ఒక ప్రాంతంలోని జనాభాలో, నిర్ణీత మైనంత మంది, ఒక అర్జీపై సంతకాలుచేసి, ప్రభుత్వానికి పంపించినప్పుడు, ఆ అర్జీలో సూచించబడిన వ్యక్తి పేరును బాలెట్ పత్రంమీద ప్రభుత్వం తప్పక ముద్రించవలసిన ఏర్పాట్లు చేశారు. అయితే వోటర్ల నిర్లక్ష్యం, అలసత్వంవల్ల ఈ పద్ధతి ద్వారా ప్రజలు తగిన ప్రయోజనం పొందక పోతున్నా, రాజకీయ నాయకుల కుతంత్రాలపై ఎదురుదెబ్బ తీయగల ఆయుధంగా ఇది ఓటర్లకు అందుబాటులో వుంచబడింది.

ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధి లేక ఒక ఆఫీసరు కొంతకాలానికి ప్రజల విస్వాసాన్ని కోల్పోయినా, అప్రతిష్ఠ కలిగించేటట్టు వ్యవహరించినా, ఆ ప్రతినిధి లేదా ఆఫీసరు, తిరిగి ఎన్నికకు నిలబడాలని కోరుతూ, నిర్ణీత సంఖ్యాకులైన ప్రజలు ప్రభుత్వానికి అర్జీపెట్టినప్పుడు, వారు రాజీనామా అయినా చేయాలి. లేదా కొత్త ఎన్నికలో తన పోటీదారుని ఓడించి తిరిగి నెగ్గనైనా నెగ్గాలి. దీనిని "రీకాల్" అంటారు.

ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులందరూ కలిసి ప్రభుత్వపాలకులను ఏర్పాటు చేసుకుంటారు. ఉదాహరణ: యూనియన్ ప్రెసిడెంట్. దీనినే ఎలెక్టరల్ కాలేజీ పద్ధతి అంటారు. ప్రజలలో పలుకుబడి లేకపోయినా, వివిధ రాష్ట్రాలనుంచి ఎన్నిక జరిగిన ప్రతినిధులలో పలుకుబడి కలవారు, ప్రెసిడెంట్ కావడానికి ఈ పద్ధతివల్ల అవకాశం కలుగుతున్నది. రాజకీయ పార్టీలకు ప్రయోజనకారిగా వున్న ఈ ఎలెక్టరల్ కాలేజీ పద్ధతి రద్దుకావాలని చెప్పేవారున్నారు.

ప్రభుత్వాధికారాలను స్వీకరించిన ప్రజాప్రతినిధులు, చిత్తంవచ్చినట్లు శాసనాలు, రాజ్యాంగ సంస్కరణలు తల పెట్టడానికి వీలులేకుండా చేయడానికి రెండు అధికారాలు ప్రజలకు కలుగజేయ బడినవి. ఇందులో ఒకటి: ఇనీషియేటివ్; రెండు: రిఫెరెండం.

మొదటిదాని ప్రకారం వోటర్లలో నిర్ణీత సంఖ్యాకులు, ఒక బిల్లుపై ప్రజాభిప్రాయం తీసుకోవాలని ప్రభుత్వానికి అర్జీ పెట్టుకున్నప్పుడు ఆ బిల్లును ఎన్నికలకు పెట్టవలసి వుంటుంది. అధిక సంఖ్యాకులు దానిని ఆమోదిస్తే, అది వెంటనే శాసన మౌతుంది. శాసనసభలు ఆమోదించలేని ప్రజలు కోరుతున్న బిల్లులకేగాక; రాష్ట్రం, జిల్లా, పురపాలక సంఘం, పంచాయతీలకు సంబంధించిన విషయాలకుకూడా ఇది వర్తింప జేయవచ్చు.

రెండవదాని ప్రకారం, ప్రభుత్వం ఒక శాసనం చేసినప్పుడు, దానికి తాము సమ్మతించబోమని నిర్ణీత సంఖ్యాకు

లైన వోటర్లు అర్జీ ద్వారా కోరగా, ఆ శాసనాన్ని వోటింగ్ కు పెట్టి, అధిక సంఖ్యాకులు ఆమోదించనప్పుడు దానిని రద్దు చేసుకుంటుంది. ఒక శాసనం చేసే బాధ్యతను స్వీకరించ డానికి ప్రభుత్వం యిష్టపడక ఆ శాసనంపై ప్రజాభిప్రాయం తీసుకోవాలనికోరి, ప్రజలు ఆమోదించడంతో యధాతథంగా శాసనం చేయడం కూడా జరుగుతుంది.

ఓటర్లకు కలిగించే ఈ రెండు అధికారాలను గురించి కూడా విమర్శన లున్నవి. ప్రతివిషయంలోనూ ఎన్నికల హడావిడి వుంటుంది. కనక ఏ ఒక్క సంస్కరణ ఆచరణ సాధ్యం కాకపోవచ్చు. ఎన్నికల ఏర్పాట్లతో ప్రభుత్వం సత మతం కావడంవల్ల ఇతరపనులు మూలపడవచ్చు; రాజకీయ శాంతి అనేది వుండక ఎప్పుడూ ఏదో ఒక ఆందోళన ప్రచారం, తప్పకపోవచ్చు; ఇవీ దీనిని గురించిన విమర్శనలు.

ప్రజాభిప్రాయం ఎన్నికలద్వారా నిరూపించడానికి గల ఏర్పాట్లలో ఈ విధంగా యిన్ని సంస్కరణలు ప్రవేశపెట్ట బడినా, ప్రజలు శ్రద్ధగా వోటింగ్ లో పాల్గొనప్పుడు వీటి ప్రయోజనం ఏమీ వుండదు.

ఓట్లువిషయంలో ప్రజలు అశ్రద్ధచూపడానికి కారణా లలో (1) వోటరుగా పేరు నమోదు చేయించుకోనడానికి గల తికమకలు (2) ఎన్నికల పద్ధతులు అర్థంకాని విధంగా వుండడం (3) ఎన్నికలవల్ల నిర్ణయం కాగల సమస్యలను గ్రహించలేకపోవడం (4) ప్రజల దృష్టిని ఆకర్షించే సమ స్యలు ఎన్నికలలో అప్రధానం కావడం (5) మన కెందు

కులే అనే ధోరణిలో ప్రజలు వుండటంవంటివి ప్రధానమైన వని పరిశీలనమీాద కనుగొనబడింది.

ఈ పరిస్థితులను కూడా సరిదిద్దడానికిగాను వోటింగ్ పద్ధతిలో కొన్ని సంస్కరణలు జరిగినవి. అందులో ఒకటి శాస్వతమైన రిజిష్టరు పద్ధతి. దాని ప్రకారం వోటరుగాచేరి, ఎన్నికలలో వోటువేసినవారి పేర్లతో శాశ్వత రిజిష్టరు ఏర్పాటు చేయడం. వోటరుగాచేరి, ఒక ఎన్నికలో వోటు వేయనప్పుడు, తిరిగి పేరును రిజిష్టరు చేయించుకొంటేనేగాని శాశ్వత రిజిష్టరులో పేరు చేర్చడం జరగదు.

బాలెట్ పత్రాలమీాద ఎక్కువమంది పేర్లు లేకుండా చేసి, ప్రధాన పోటీదార్లలో ఎవరికో ఒకరికి ప్రజలు సులభంగా వోటు చేసేటట్టు చిన్న బాలెట్ పత్రం ఏర్పాటు చేయడం మూడవ పద్ధతి.

సాధ్యమైనంతవరకు తక్కువసార్లు ఎన్నికలు జరిగేటట్టు శ్రద్ధవహించడం అయిదవ పద్ధతి. నియోజకవర్గాలను చిన్నవిగావుంచి, మైనారిటీలకు ప్రాతినిధ్యం వచ్చేటట్టు చూడడం. వయోజనులందరికీ వోటింగ్ హక్కు వుండేటట్టు చేయడం కూడా అవసరమే. "ప్రజాస్వామిక ప్రభుత్వంలో అధికార విధాన నిర్ణేతలు కొందరే అయినా, ప్రాతినిధ్యం వహించడానికి అందరికీ హక్కు వుంటుంది" అనే వాదనను అనుసరించి పై సంస్కరణలు వివిధ దేశాలలో జరిగినవి.

ప్రజాస్వామిక వ్యవస్థలో, రాజకీయ సంస్థల స్వరూపం దినదిన ప్రవర్ధమాన మౌతున్నది. కాని ఆర్థిక సాంఘిక

రంగాలలో కనిపించే అభ్యుదయ దృక్పథం, రాజకీయ విధానాలలో వుండడాన్ని కొన్ని వర్గాలు సహించలేక పోతున్నందునే ప్రజాస్వామ్యానికికూడా ప్రమాదాలు తప్పడం లేదు.

# 9. ప్రజలు - ప్రభుత్వ వ్యవస్థలు

"మంచి ప్రభుత్వం'' కావాలనేది చిరకాలంనుంచి ఒక రాజకీయ నినాదంగా వుంటున్నది. ప్రభుత్వం వ్యవహారాలు చౌకగా జరగాలని, పన్నులభారం తగ్గాలనేది "మంచి ప్రభుత్వా"నికి అర్థంగా చెబుతున్నారు. అయితే చౌకగా గృహనిర్మాణం సాగించాలని, వైద్య విద్యాసౌకర్యాలు కావాలని కొందరు కోరగా, ప్రభుత్వం "అసమర్థం" "లంచగొండి" అయినందున పరిపాలనా పద్ధతి సంస్కరింపబడాలనేవారు మరికొందరు వుంటారు.

అన్ని కాలాలలోనూ, ప్రభుత్వ వ్యవస్థను గురించిన ఈ విమర్శలను తట్టుకొనడానికి రెండు రకాలుగా సంస్కరణలు సాగుతున్నవి. అందులో ఎన్నికల పద్ధతి, ప్రజా ప్రతినిధుల అధికార పరిమితి, వోటింగు మొదలగువానికి సంబంధించినవి ఒకరకం; వీనిని గురించి ఇదివరకే వివరణ జరిగింది. శాసనసభలు, ఆఫీసర్ల నియామకం, వివిధశాఖల బాధ్యతల వర్గీకరణలను గురించి జరుగుతున్న సంస్కరణలు రెండవ రకం. దీనిని గురించికూడా టూకీగా తెలుసుకొనడం అవసరం.

ఏ పార్టీ అధికారంలోనికి వచ్చినా ప్రభుత్వోద్యోగాలలో, ఆ పార్టీల అభిమానుల ప్రతినిధులు క్రొత్తగా చేరడం లేదా పై హోదాలు పొందడం జరుగుతుంది. దీని వల్ల నిపుణులు కానివారు ప్రభుత్వ వ్యవహారాలను నడుపుతూ, తమకు తమపార్టీ ప్రభుత్వానికి అపఖ్యాతి తెస్తారు. అందువల్ల ఉద్యోగాలకు సంబంధించిన ప్రత్యేక పరీక్షలు, పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లు అమలులోనికి వచ్చినవి. ఒకరు ఒకదఫా ఉద్యోగిగా నియమించబడిన తరువాత వారికి ప్రభుత్వంలో శాసనరక్షణ వుంటుంది. కేవలం రాజకీయ కారణాలను పురస్కరించుకొని, వారిని కదిలించడానికి వీలు లేకుండా చేయబడింది.

ఆ తరువాత చెప్పుకొనదగింది ప్రభుత్వంలోని వివిధ శాఖల అధికారాల వర్గీకరణ. ప్రభుత్వంకింద దుబారాఖర్చు జరుగుతున్నదని, పనులు త్వరగా జరగడంలేదని, అవినీతి పెరిగిందనే విమర్శనలకు కారణమైన మూలలోపాలు ఇవి: (1) ఒకే సర్వీసును అనేక శాఖలు వేర్వేరుగా నిర్వహించడం (2) కేంద్రాధికారం అనేది నామమాత్రంగా వుండడం. (3) తప్పు జరిగినప్పుడు దానికి బాధ్యులెవ రనేది తేల్చడానికి అవకాశాలు వుండకపోవడం (4) రాజకీయ ప్రయోజనాలతో ప్రభుత్వం సర్వీసులలో కొందరు ఆఫీసర్లను జొప్పించడం (5) స్వతంత్రంగా అధికారాలు చెలాయించగల అధికారులు, ఆఫీసులు అనేకం వుండడం.

ఈ లోపాలను చక్కబరచడానికిగాను ప్రభుత్వ వ్యవస్థను రాష్ట్రం, జిల్లా, పురపాలక సంఘం, పంచాయతీ అనే

విభాగాలుచేసి, అధికారాలను అందరికీ పంచిపెట్టి వివిధ శాఖలకు సమన్వయం కలగజేసే కేంద్రాధికారం ఒకటి వుండాలనేది కొందరి సూచన. అంటే పంచాయతీ, పురపాలక సంఘం, జిల్లాబోర్డు, రాష్ట్ర ప్రభుత్వం అనే వాని పరిపాలనాధి కారాలపరిమితి స్పష్టీకరణ జరగాలనేది దీని అంతరార్థం. ఇందుకుగాను ప్రభుత్వంలోని కార్యనిర్వాహక శాఖలో సంస్కర ణలకు యిప్పుడు రకరకాల ప్రయత్నాలు జరుగుతున్నవి.

శాసనసభలకు సంబంధించిన సంస్కరణ కూడా దీనికిందనే చేరుతుంది. సభ్యులు ఎంత తక్కువగా వుంటే అంత మంచి దని సభాకార్యక్రమం అందరికీ సులభంగా అర్థం కావాలని, శాసనసభ సిబ్బందికింద ఖర్చు పెరగ కూడదని ప్రభుత్వ విధానాలకు, శాసనాలకు పూర్తి బాధ్యత తీసుకోవాలని, కమిటీలు అనేవి చాలా తక్కువగా వుండి, సభా కార్యక్రమం త్వరత్వరగా జరిగిపోయేట్టు చూడాలనే సూచనలు దీనికి సంబంధించినవే.

సిబ్బందికిందనే కాక ప్రభుత్వం జరిపే పనులకుకూడా ఖర్చు అనవసరంగా పెరుగుతున్నదనేది విమర్శమాత్రమే కాక కొన్ని ఉదాహరణలు కూడా వుంటవి. అలాగే ప్రభుత్వానికి కావలసిన వస్తువులు కొనడం, వాడడంలో కూడా లోపా లున్నవని చూపబడుతున్నవి. ఈ లోపాల సవరణకుగాను కంట్రాక్టుల పద్ధతిని కట్టుదిట్టం చేయడం అవసరమనే సూచన వచ్చింది.

అందువల్లనే రాజకీయ శాస్త్రజ్ఞులు ప్రజాస్వామ్యం అనేది ఒక పద్ధతికాక, అదొక వ్యవస్థ అని, మానవ శరీ

రాన్ని గురించి ఎంత శ్రద్ధ తీసుకోవాలో దానినిగురించి కూడా, అంతకు మించిన శ్రద్ధ తీసుకోవలసి వుంటుందని, ప్రజాస్వామ్యవాదులను హెచ్చరిస్తూ వుంటారు.

"రాజకీయ వ్యవస్థ అనేది ఒక యంత్రం మాత్రమే. జాతి శీల సంపదలు దానిని నడిపించే శక్తిని సమకూరుస్తవి. ఆ యంత్రం (రాజకీయ వ్యవస్థ) సంఘానికి ఉపయోగిస్తుందా లేక సంఘాన్ని నాశనం చేస్తుందా అనే విషయం దీనినిబట్టే ఆధారపడి వుంటుంది" అని డిజ్రేలీ ఒకప్పుడు చెప్పాడు.

## ప్రజాభిప్రాయం

ప్రభుత్వ వ్యవస్థలోనూ, ఎన్నికల విధానంలోనూ సంస్కరణలు జరిగినంతమాత్రాన ప్రజాస్వామ్యానికి భద్రత చేకూరదు. ప్రజాభిప్రాయాన్నిబట్టి ప్రజాస్వామిక వ్యవస్థలో పురోభివృద్ధి కనిపిస్తుంది. ప్రజలలో విభేదాలు హెచ్చి, పరస్పరం అనుమానాలు పెరిగినప్పుడు, క్రమశిక్షణ కలిగిన కొందరు చేరి, తమ చిత్తం వచ్చినట్లు పరిపాలన జరిపించగలరు.

అందరికీ సంబంధించిన ఒక సమస్యమీద అధిక సంఖ్యాకుల అభిప్రాయమే ప్రజాభిప్రాయమని చెప్పబడుతుంది. అది ఒక అభిప్రాయం మాత్రంగానే వుండక కార్యాచరణను కోరుతుంది. లేదా ప్రతిఘటన చూపుతుంది. ఒక విషయం జరిగితీరాలని అది కోరవచ్చు. అలా జరగరాదని కూడా పట్టు పట్టవచ్చు. ఇలాంటి ప్రజాభిప్రాయాలు "మితవాదం" "అతివాదం" అని రెండు రకాలుగా వుంటవి.

మార్పును వ్యతిరేకిస్తూ, పూర్వ సంప్రదాయాలకు ఆచారాలకు భిన్నం జరగరాదని కోరేది మొదటి రకానికి చెందినది. పదిమందితోపాటు ప్రతిఒక్కరూ నడిచి తీరా లనేదే దీని ప్రధాన ధోరణి. చివరకు ప్రభుత్వంకూడా వీరి అభిప్రాయాన్ని పరిమితంగానైనా గుర్తించక తప్పదు. దీనిని మనం మితవాద అభిప్రాయం అనవచ్చు.

పూర్వ పద్ధతులు, ఆచారాలలో మార్పులు కోరేది రెండవ రకానికి చెందిన ప్రజాభిప్రాయం. పాతపద్ధతులు సడలినప్పుడూ, నూతన పరిస్థితుల ప్రాబల్యం హెచ్చుతున్న ప్పుడూ, దీని ప్రాబల్యం హెచ్చుగా వుంటుంది. ఈ అతి వాదాభిప్రాయం ప్రారంభదశలో ప్రతివారిలో అసంతృప్తి తెచ్చి, ఒకరికొకరుగా "అది అలా జరగాలి ఇది ఇలా జరగాల"నే వాగాడంబరంగా కనిపిస్తుంది. ఇలాంటి వాదోప వాదాలు, చర్చలు, కొన్ని సంవత్సరాలవరకు సాగవచ్చు. ఈ సందర్భంలోనే, నాయకులనేవారు కొన్ని పరిష్కార మార్గాలను సూచిస్తారు.

ప్రజలు వీనిని ఆమోదించడం, లేదా నిరాకరించడం సంభవిస్తుంది. ఈ స్థితిలోనే నూతన నాయకత్వం ముందుకు రావచ్చు. ఆ తరువాత మెజారిటీ అభిప్రాయం అనేదానికి ఒక రూపకల్పన జరిగి, ప్రభుత్వశాసనాలు, కోర్టుతీర్పులు, ఆఫీసర్ల ప్రవర్తనలతో దాని ప్రాబల్యం గోచరమౌతుంది. మైనారిటీగా వున్నవారు కొందరు దీనిని కాదని తిరగ బడవచ్చు. లేదా ఆమోదించవచ్చు. స్వేచ్ఛగా వాదోప వాదాలకు అవకాశం వున్నప్పుడు, మెజారిటీ అభిప్రాయాన్ని

క్రమక్రమంగా గాని మైనారిటీ ఆమోదించదు. అప్పుడు దేశం ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చినట్టు పరిగణించ బడుతుంది.

ఒక్కొక్క సంఘంలో అనేక వర్గాలు, తరగతులు, కులాలు, మతాలు వుంటాయి. ఈ వ్యవస్థలలోని కొందరు చైతన్యవంతులుగా వుండి, ప్రజాభిప్రాయాన్ని కేంద్రీకృతం చేయగలరు. కొందరికి అసలు ఏ విషయాన్ని గురించీ ఒక అభిప్రాయమంటూ వుండదు. కాని అంతా కలిసి సమష్టిగా కొనసాగించే వ్యవహారాలలో వీరు సహాయ నిరాకరణకూడా చేస్తారు. కనక, ఇలాంటివారు కూడా ప్రజాభిప్రాయంలో భాగస్వాములుగా వుండేటట్లు చూడడమే కాక సంఘంలోని అన్ని వర్గాలు కొన్ని నిశ్చితాభిప్రాయాలతో వుండేటట్టు చేసుకోవాలి.

ప్రజాస్వామ్యసూత్రాల ప్రకారం, ప్రజాభిప్రాయాన్ని పెంపొందించాలంటే — అనగా వయోజనులైనవారందరూ ప్రజాభిప్రాయంలో భాగస్వాములు కావడానికి ముందు "గ్రూపు చర్చలు" అత్యవసరం. అది పాఠశాల, కాలేజీ, దేవాలయం, గ్రామం, పట్టణం — ఏదైనప్పటికీ, అక్కడ స్వేచ్ఛగా చర్చలు జరిగినప్పుడు, చర్చల సారంశంగా, అన్ని వర్గాల అభిప్రాయాల సమన్వయంతో రూపొందిన చివరి నిర్ణయమే ఆ వర్గం నిశ్చితాభిప్రాయ మాతుంది. ఈ నిశ్చితాభిప్రాయాన్ని అధిక సంఖ్యాకులు ఆమోదించి నప్పుడు అది ప్రజాభిప్రాయ మౌతుంది. కనక స్వేచ్ఛగా

చర్చలు జరుపుకొనడ మనేది ప్రజాభిప్రాయం రూపొంద డానికి చాలా అవసరం.

ఏ ఒక్క వర్గంకూడా, నాయకుడు అనేవాడు లేకుండా ఎలాంటి నిశ్చితాభిప్రాయానికి రాలేదు. "ఏమిటి చేయాలి?" అని అందరూ చర్చించుకుంటూ వున్నప్పుడు ఫలానావిధంగా చేయాలని సూచనలను ప్రతిపాదించేవారు కొందరుంటారు. వీటిలో కొన్ని కొందరికి నచ్చకపోవచ్చు. చివరకు కొన్ని సూచనలు చేసిన కొందరి వెనక, అధికసంఖ్యాకులు నిలబడి, చివరకు వారిని నాయకులుగా అంగీకరించి, ఆయన అభిప్రాయాలే ఆ వర్గం అభిప్రాయాలుగా చెలామణిలోకి తెస్తారు. ప్రథమంలో ఈ నాయకుడు చేసిన సూచనలు జయం పొందడంతో, అతడు ప్రజానాయకుడు కావడం, చివరకు అతని నిర్ణయాలే ప్రజాభిప్రాయాలుగా వ్యాప్తిలోనికి రావడం సంభవిస్తుంది. ప్రథమంలో ఒక నాయకుడు చేసిన సూచనలు విఫలమైనప్పుడు, మరొక నాయకత్వం కోసం ప్రజలు ఎదురుసూస్తారు.

తెలివిగల సూచనలు, ఆలోచనలు చేసినంత మాత్రాన్నే ఏ ఒక్కరినీ తమ నాయకుడుగా ప్రజలు ఎన్ను కొనరు. కాగా, పలుకుపడి, ప్రతిష్ఠ అనేవాటిని కూడా గమనిస్తారు. నాయకునికి ప్రతిష్ఠ పలుకుబడి కూడా అధిక సంఖ్యాకుల అభిమానాన్ని ఆయన చూరగొనగలిగినప్పుడే నిలువ గలుగుతవి. కనక, నాయకులనేవారు ప్రజల ధోరణిని కూడా గమనించి నడుచుకోవాలి.

కాని, నాయకుల సూచనలపై ప్రజలకు నమ్మకం కుదరనప్పుడు——అంటే, నాయకుల నిజాయితీని అడుగడుగునా ప్రజలు శంకించినప్పుడు ఏ ఒక వర్గంలోనూ నిశ్చితాభిప్రాయం అనేది వుండదు. విభిన్న వాదనలతోపాటు విభిన్న నాయకులు రంగంమీదకు దిగుతారు. కనకనే, అధిక సంఖ్యాకులు వున్న పార్టీలోనే స్థిరమైన అభిప్రాయాలు వుండవు. ఏ ఒక్క విషయంమీదా నిశ్చితాభిప్రాయానికి రాలేరు. ఈ అదనులోనే మైనారిటీగావుండి, క్రమశిక్షణ కలిగినవర్గం పైకివచ్చి, అధికారం చేజిక్కించుకుంటుంది. జర్మనీలో హిట్లర్, ఇటలీలో ముస్సోలినీ ఇలాగే అధికారం లోనికి వచ్చారు. ఈ ప్రమాద పరిస్థితికి మరొక పరిష్కారం మార్గం నాయకత్వం వహించేవారిలో మార్పును ప్రజలు సాధించడం.

ప్రజాభిప్రాయాన్ని ప్రభుత్వం ఎంతవరకు గుర్తిస్తుందనేదికూడా ఈ సమయంలో ఆలోచించాలి. ప్రజాస్వామిక వ్యవస్థలోని ప్రతి విషయంమీద ప్రజాభిప్రాయం పలుకుబడి కొంతవరకు కనిపిస్తుంది. సూచనలు, విజ్ఞప్తులు, బెదిరింపులు అనేవి అధికార వ్యవహారాలలో తప్పక కొన్ని మార్పులు పరిమితంగానైనా కొనిరాగలవు.

అయితే, ప్రజాభిప్రాయానికి కూడా కొన్ని పరిమితులు వున్నాయి. అది ప్రభుత్వ విధానాలను నిర్ణయించగలదే కాని, సాంకేతిక విషయాలను సిద్ధాంతీకరించలేదు. ఒక నాయకుని ద్వారానే ప్రజాభిప్రాయం వ్యక్తం చేయబడుతోంది. ఒకే విషయంమీద, ఒకే సమయంలోనే ప్రజాభిప్రాయం వివరించ

బడుతుంది. అభిమానాలు, ఆదరాలు, బంధుప్రీతి, కుటుంబ సంబంధాలు అనేవికూడా ప్రజాభిప్రాయంలో కొంత మార్పులు తెస్తవి. ప్రజాభిప్రాయానికి ఓర్పువుండక పోవడం ప్రమాదకరం. వర్గస్వభావం, సమష్టిధోరణి, వ్యక్తుల లక్షణాలు, అభిరుచులు మొదలగువాటి ప్రాబల్యాన్ని బట్టి కూడా ప్రజాభిప్రాయం మారుతూ వుంటుంది.

కాబట్టి స్వతంత్రాలోచన, తన ప్రభుత్వాన్ని గురించిన పరిశీలన, విషయజ్ఞానం అనేవి ప్రజాభిప్రాయం రూపొంద డానికి అత్యవసరమని శాస్త్రజ్ఞుల వాదన.

ఏ వ్యక్తి అయినా విషయ సేకరణలో పూనిక చూపినప్పుడే, విజ్ఞతగల పౌరు డనిపించుకుంటాడు. ఎంత ఎక్కువగా సమాచారాన్ని సేకరించుకుంటే, అంత తక్కు వగా ఉద్రేకాలకు లొంగుతాడు. ప్రజాభిప్రాయమనేది ప్రజాస్వామ్య ప్రాదుర్భావానికి సహాయం చేయాలంటే ఒకే విషయంమీాద విభిన్నదృక్పథాలతో కూడిన విషయాలు, వివరాలు పౌరులకు అందజేయడం అత్యవసరం.

తమ అధికారులు చేసేదేమిటని ప్రజలు తెలుసుకొని, స్వేచ్ఛగాను, సుహృద్భావంతోనూ విమర్శలకు దిగ నప్పుడు స్వయం పరిపాలన ఎన్నటికీ సాధ్యం కాదు. అందు వల్లనే, ప్రతి ప్రజాస్వామ్య వ్యవస్థకు, పత్రికాస్వాతంత్ర్యం, ప్రకటనా స్వాతంత్ర్యం, భావ స్వాతంత్ర్యం అనేవి మూల కందాలుగా వున్నవి.

వీటన్నింటిలోనూ ప్రధాన విషయం ఒక్కటే. ప్రజాభిప్రాయాన్ని వ్యతిరేకించే అభిప్రాయాలు, సంఘటనలు

పదిమంది దృష్టికి తీసుకొని రావడానికి పూర్తి స్వేచ్ఛ కలిగించడమే వీని పరమార్థం. కనక ఒక విధానం లేదా ఒక అభిప్రాయం మంచి చెడ్డలు నిర్ణయించబడ్డానికి ముందు ప్రజలు స్వేచ్ఛగా వానినిగురించి చర్చించుకొన వలసి వుంటుంది.

విభిన్నాభిప్రాయాలను ప్రజలకు అందించే ప్రచార సాధనాలు నాలుగు (1) రేడియో (2) వార్తాపత్రిక (3) సినిమా (4) మాగజీనులు - వీటిద్వారానే మనకు విభిన్నవిషయాలమీద సమాచారం అందుతూ వుంటుంది. వీనిద్వారా తమ అభిప్రాయాలను ప్రకటించుకొనలేని ఏ ఒక వర్గమైనా, ప్రజాభిప్రాయమనే దానిలో పాలు పంచుకొనలేదు. కనక ప్రజాభిప్రాయం రూపొందడానికి స్వతంత్రాలోచన, విషయ జ్ఞానసేకరణ ఎంత అవసరమో, వాటిని వ్యాప్తిలోనికి తెచ్చే ప్రచార సాధనాలుకూడా అంతే అవసరం. వానిని ప్రజలలోని విభిన్నవర్గాలు సక్రమంగా ఉపయోగించుకున్నప్పుడే ప్రజాస్వామ్య వ్యవస్థ ఫలప్రదాయి కాగలదు.